శ్రీ గణేశాయ నమః

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# వాస్తు జ్యోతి

గ్రంథకర్త

జ్యోతిర్విజ్ఞాన భాస్కర, గణిత విద్వద్వరేణ్య,

మంత్ర మాతృకార్చన విశారద, శ్రీ విద్యోపాసక చూడామణి

## చల్లా రామారావు

ఎమ్.ఎ.జ్యోతిషం,అర్చక ప్రవర,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పూర్వ అర్చక పరీక్షలాధికారి,

దశాధిక జ్యోతిష గ్రంథకర్త

9866532586

ramaraochalla62@gmail.com

## మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, రాజమండ్రి - 533101

విషయసూచిక

## ధన్యవాదములు

వాస్తుజ్యోతి అను ఈ గ్రంథమును రచించుటలో ఎంతో ప్రోత్సాహము అందించి,మరియు గ్రంథమునకు చక్కని అక్షర కూర్పును చేసిన తాడేపల్లిగూడెం వాస్తవ్యులు వాస్తు విద్యావిజ్ఞాన కేంద్రము అధిపతి బ్రహ్మశ్రీ పళ్ళావఝుల శ్రీరామకష్ణశర్మ గారికి, వారి సతీమణి శ్రీమతి వెంకట సత్య లలితా ఫణి లక్ష్మి గారికి ధన్యవాదములు తెలుపుతున్నాను. గ్రంథమును ఆమూలాగ్రము పరిశీలించి తమ అమూల్యమైన అభిప్రాయములతోపాటు ఆశీస్సులు అందచేసిన ప్రముఖ పండితులు రాజమండ్రి వాస్తవ్యులయిన బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తిశాస్త్రి గారికి, మా మిత్రులయిన డా॥ చిత్రాల గురుమూర్తి గుప్త సిద్ధాంతి, శతాబ్ధి పంచాంగకర్త అనంతపురము గారికి, వాస్తు శాస్త్రమునందు ప్రప్రథమంగా Ph.d. పట్టా పొందిన డా॥ ముదుండి విశ్వనాథరాజు హైదరాబాదు వారికి, శ్రీ పళ్ళావఝుల శ్రీరామకృష్ణశర్మ పుష్కర పంచాంగకర్త తాడేపల్లిగూడెం వారికి,

ఈ గ్రంథమును ప్రచురణ – ప్రచార బాధ్యతను తమ భుజస్కంధాలపై వేసుకున్న మోహన్ పబ్లికేషన్స్ అధినేత శ్రీ ఆకుల రామచంద్రరావు గారికి, నా కృషియందు ప్రోత్సాహము నందిస్తున్న శ్రేయోభిలాషులకు ఇలా మరెందరికో నేను ఉపాసించే దేవత అనుగ్రహం కలగాలని కోరుతున్నాను. అందరికి శుభం. విజయోస్తు.

**– చల్లా రామారావు**
గ్రంథకర్త

## గ్రంథకర్త పరిచయం


పేరు : చల్లా రామారావు

తండ్రి: చల్లా మల్లేశ్వరరావు

తల్లి : యువరత్నం

జననతేదీ : 21.06.1962

సాధారణ చదువు : ఎమ్.ఎ.,చరిత్ర, బి.యి.డి, ఎన్.యి.టి

జ్యోతిషం : ఎమ్.ఎ. జ్యోతిషం, అర్చక ప్రవర,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పూర్వ అర్చక పరీక్షలాధికారి,

ముద్రితాలు :
1. పంచాంగ గణిత పథక పారిజాతము
2. శ్రీ రాజరాజేశ్వరీ లలితా మహాత్రిపుర సుందరీ నామ పారాయణ విద్యా
3. శ్రీ నందీశ్వర గృహ జాతకము
4. వింశోత్తరీ దశాంతర్దశామంజరి
5. శ్రీకృష్ణ పరమాత్మ జననతేదీ నిర్ణయము
6. అయనాంశ మాన నిర్ణయము
7. ఏసుక్రీస్తు జననతేదీ నిర్ణయము
8. దశాశేష నిర్ణయము

అముద్రితాలు :
1. మహమద్ ప్రవక్త జననతేదీ నిర్ణయము
2. వీరబ్రహ్మేంద్ర స్వామి జననతేదీ నిర్ణయము
3. శ్రీరాఘవేంద్ర స్వామి జననతేదీ నిర్ణయము
4. శ్రీ ఆది శంకరాచార్య జననతేదీ నిర్ణయము

రచయిత బిరుదులు :
1.జ్యోతిర్విజ్ఞాన భాస్కర,
2. గణితవిద్వద్వరేణ్య,
3.మంత్రమాతృకార్చనా విశారద
4. శ్రీ విద్యోపాసక చూడామణి

ప్రచురించిన వ్యాసాలు :
1. యువరాజ పట్టాభిషేక ముహూర్తమే వనవాసానికి దోహదం చేసినదా
2. శ్రీసీతారాముల వివాహ ముహూర్త పరిశీలన
3. శ్రీ రామాయణంలోని వాస్తు విషయములు

చిరునామా : పురోహితులు, శివాలయం వద్ద, **రావూరిపేట గ్రామం,**

వేటపాలెం మండలం

ప్రకాశం జిల్లా, పిన్ – 523187, సెల్ – 98665 32586

ramaraochalla62@gmail.com

# ముందుమాట

అనాది నుండి మానవుడు సుఖ జీవనము కొరకు పాటుపడుచున్నాడు. తను సంపాదించిన జ్ఞానమును, అనుభవమును తన వారసులకు తెలియచేయుటద్వారా జ్ఞానము అభివృద్ధికి బాటలు వేయుచున్నాడు. ఈ జ్ఞానమును ఆలంబనగా చేసుకుని దాని విస్తృతికి తనకు లభించిన జ్ఞానమును,అనుభవమును దానికి జోడించుట జరుగుచున్నది. ఈ విధముగా జ్ఞానమును తరతరాల నుండి వృద్ధి చెందుచూ మానవుడు సౌఖ్యవంతమైన జీవనము గడుపుటకు ప్రయత్నిస్తున్నాడు.

ఈ ప్రకృతిలోని పంచభూతములైన భూమి,అగ్ని,వాయు,జలము,ఆకాశము తన అభ్యున్నతికి ఉపయోగించుకొనుచున్నాడు. చెట్టు తొర్రలను, కొండగుహలలో నివసించిన మానవుడు ఈ ప్రకృతిలోని పంచభూతముల శక్తిని నుండి తనను తాను రక్షించుకొనుటకు నిరంతర పరిశోధన ద్వారా సౌఖ్య జీవనమునకు గృహ నిర్మాణము గావించుకొనినాడు. తను నిర్మించుకున్న ఇంటిలోకి ప్రకృతి సంబంధిత శక్తులైన పంచభూతాల అనుకూల సమ్మేళనము వలన ఆరోగ్యవంతమైన జీవనమును గడుపుచున్నాడు. మానవాతీతమైన అతీంద్రియ శక్తి ప్రకృతిని నడిపించుచున్నదని నమ్మినాడు. ఆ అతంద్రియ శక్తి తనను కూడా నడిపించుచున్నదని భావించినాడు. తద్వారా సృష్టిని అర్థంచేసుకోవడానికి జరిగిన ప్రయత్నములే శాస్త్ర రూపములుగా విజ్ఞానము వృద్ధిచెందుచున్నది. ఇటువంటి శాస్త్ర ములలో జ్యోతిషము ఒకటి. వాస్తు శాస్త్రము అనునది జ్యోతిషములో అంతర్భాగము. ఎందువలననగా పంచభూతములకు ఆధిపత్యము నవగ్రహాలకు ఇవ్వబడినది. దిక్కులకు దిక్పతులు ఏర్పడి దిక్కులను పరిపాలించున్నారు. ఈ దిక్పతుల అధిదేవతలు మరలా నవగ్రహాలకు ఇవ్వబడింది. అందువలన ఈ నవగ్రహ, ద్వాదశ రాశుల ద్వాదశ భావముల కారకత్వ, లక్ష్య లక్షణములన్ని జ్యోతిషశాస్త్రము నందు విస్తారంగా చర్చించబడినవి. ఆ అంశములను ఆధారంగా తీసుకుని వాస్తుశాస్త్ర సూత్రములో రూపొందింపబడినవి. అందువలన వాస్తుశాస్త్రమునకు పుట్టినిల్లు జ్యోతిష శాస్త్రము.

చతుర్విధ పురుషార్థ సాధనకు ఉపయోగపడే దానములు,వ్రతములు,పూజలు, యజ్ఞయాగాదులు, ప్రాయశ్చిత్తాదులవలెనే గృహము కూడా ఒక సాధనము. శాంతి కర్మలు గ్రహదోషముల నివారణకు, పౌష్టికకర్మలు గ్రహబలమును వృద్ధి పొందుటకు ఉపయో గించెదరు. శుభ ఫలి తములు ప్రసాదించు గ్రహముల బలమును వృద్ధింపచేయుటకు పై శాంతి పౌష్టికర్మలను అను సరించెదరు. గృహమును కూడ పై విధమున గ్రహముల అనుకూలత కొరకు నిర్మించుకొందురు. అయితే ఎవరికి ఏ గ్రహాలు అనుకూలమో, ఏ గ్రహాలు ప్రతికూలమో తెలుసుకొనుటకు వ్యక్తి జాతకము అవసరము. అందువలననే దశనుబట్టి దిశ అను నానుడి ఏర్పడినది. ఈ ప్రాథమిక సత్యము రానురాను మరుగు పడుచున్నది. జ్యోతిషము వేరు వాస్తు శాస్త్రము వేరు. జాతకము కన్న గృహమే మిన్న అనుభావనలు ఇటీవల కాలంలో ప్రబలముగా ప్రచారం పొంది జ్యోతి షముతో వాస్తు శాస్త్రమునకు వున్న అనుబంధము బలహీనపడుచున్నది. దానిని సరియైన రీతిలో అధ్య యనం చేయుట కొరకు ఈ గ్రంథము వ్రాయబడినది. గృహస్థులకు విషయముపై అవగాహన కలగటానికి చేసిన ప్రయత్నమే ఈ గ్రంథము.

– చల్లా రామారావు

# అంకితం

ఫొటో

మాకు మంచి విద్యాబుద్ధులు నేర్పించి క్రమశిక్షణ గల జీవితమును అందించినావు. "పురోహితరత్న" గా 12 గ్రామాలయందు 40సం॥ల పాటు అంకిత భావముతో షోడశ కర్మలు నిర్వహించుటయందు తోడ్పడినావు. హిందీలో "సాహిత్యవిశారద" ఉత్తీర్ణత సాధించి ఎందరికో ఉచితముగా హిందీ పాఠములు చెప్పినావు. వాగ్వర్ధనీ సభను నిర్వహించి విద్యార్థులను ఉత్తమశ్రేణి ఉపన్యాసములు ఇచ్చు వారిగా తీర్చిదిద్దినావు. "ఆసనవీర" గా యోగాసనాశ్రమము నిర్వహించి ఎందరికో యోగాసనములు నేర్పినావు.

గ్రామీణ, పల్లెకారులను చైతన్య వంతులుగా చేయుటకొరకై ఎంతోమంది నిరక్ష్య రాశులను అక్షరాస్యులుగా తీర్చిదిద్దుటకు అంకితభావంతో సేవచేసినావు. "చండకాత్యాయనీ" దేవిని ప్రసన్నం చేసుకోవటానికి ప్రయత్నించినావు. గానగంధర్వుడవై పౌరాణిక, సాంఘిక నాటకములలో పాల్గొని ప్రజలను రంజింపచేసినావు. నీ కవితాశక్తి అమోఘమైనది. నీ జీవితమును సంఘాభివృద్ధి కొరకై గ్రామాభ్యుదయ సంఘప్రెసిడెంట్‌గా వుండినావు. నోరులేని పశువుల ఆరోగ్యము కొరకై వైద్యుడుగా G.A.V.C. పట్టాపొంది వాటికి సేవచేసినావు. సంఘాభివృద్ధిలోనే తన అభివృద్ధి వుందన్న భావన కలిగినావు.

సమాజములోని ప్రజలందరి అవసరాలను తీర్చే ఈ "వాస్తుజ్యోతి" గ్రంథమును నీకు అంకితమిచ్చుచున్నాను.

మీ ప్రియపుత్రుడు

**– చల్లా రామారావు**

గ్రంథకర్త

# పండితాభిప్రాయములు

## ఉత్తమ వాస్తు గ్రంథము

శ్రీచల్లా రామారావు గారు " వాస్తుజ్యోతి " యను వాస్తుగ్రంథమును మిక్కిలి సులభముగ అర్థమయ్యే రీతిలో వ్రాసినారు. గృహనిర్మాణములు చేసుకొనువారు, తాపీ మేస్త్రులు, వడ్రంగి మేస్త్రీలు మొదలగువారందరు శ్రద్ధతో చదివినయెడల యజమానులకు సుఖసంతోషములు కలిగేటట్లుగ గృహములను,అందలి ఉపకరణములను నిర్మించుటకుఅవకాశముండును. శ్రీరామా రావు గారు గతములో చాలా గ్రంథములను వ్రాసి, ఆయా విషయములయందు కృషి చేయు వారికి గొప్పఉపకారముచేసియున్నారు.

వాస్తుజ్యోతి గ్రంథములో ఈనాడు అపప్రచారములోనున్న విషయములను ఖండించి సరియైన విషయములను తెలిపినారు."పూర్ణాంకమా – భిన్నాంకమా " అను విషయమై ఎక్కువ విచారణ జరిపి " ఏవిధముగా చేసినను పూర్ణాంకపదము రావలసియున్నది. వెడల్పులో ఒకటి,రెండు అంగుళములు కలుపుకుంటే హిమాలయ పర్వతమంత తప్పుగా భావించి బెంబేలు పడుతూంటారుకొంతమంది. పూర్ణాంక పదసాధన మాత్రమే మనగమ్యము అనునది గమనించ వలయును. "ఇంకనూ యీ విషయమై విచారించి పర్యవసానముగా" పూర్ణాంకపదము ద్వారానే నవవర్గులు తెలుసుకొనవలసియున్నది.

పైన వ్రాసిన విషయమంతయూ శాస్త్రమునకు సాంప్రదాయమునకు బాగుగా సరిపడి యున్నది.

నేను బహుగ్రంథములను పరిశీలించి సంకలము చేసి వ్రాసిన " వాస్తుశాస్త్ర వివేకము" 4 భాగాలలో గల అనేకాంశములను వీరీ "వాస్తుజ్యోతి" లో వివరించి శాస్త్రీయములైన అంశములను ప్రచారము చేయుచూ అప ప్రచారంలో గల అనేక విషయాలను ఖండించియున్నారు.

66 వ పేజీ నుండి " జాతకము – గృహము " " వాస్తు – జాతకము" అను శీర్షికలతో వ్రాసిన జ్యోతిషాంశములు కూడా ప్రశంసనీయములుగానున్నవి. ఇంకనూ నిత్యావసరములైన అనేకాంశములనీగ్రంథము నందు వివరించి సాధారణ మానవులకు మిక్కిలి ఉపకారమును చేసినారు. ఈ గ్రంథమును ప్రతీ ఒక్కరూ సంపాదించి, చదువుకొని సుఖ సంపదలను పొంద గలరు అనుటలో అతిశయోక్తి ఎంతమాత్రములేదు. అందరూ జాగ్రత్త చేసుకొనదగిన గ్రంథము. గ్రంథకర్తగారు యింకనూ అనేక విషయములపై ఉత్తమగ్రంథముల రచించి ప్రజల కందచేయ వలయునని, పార్వతీపరమేశ్వరులు అనుగ్రహించవలెనని కోరుచున్నాను.

ఇట్లు

రాజమండ్రి

6-6-2015

వాచస్పతి,జ్యోతిష విజ్ఞాన భాస్కర, వాస్తు కళానిధి,
రాష్ట్రపతి అవార్డు గ్రహీత,మహామహోపాధ్యాయ

**మధుర కృష్ణమూర్తి శాస్త్రి**

## పండితాభిప్రాయములు

### అభినందన

శ్రీచల్లా రామారావు గారు వ్రాసిన " వాస్తుజ్యోతి " గ్రంథాన్ని ఆమూలాగ్రంగా పరిశీలించాను. నవీన వాస్తు అశాస్త్రీయ వాస్తు శాస్త్ర వేత్తలయిన గౌరు తిరుపతిరెడ్డి, E.tv లో అశాస్త్రీయ వాస్తు శాస్త్రాన్ని ప్రచారం చేస్తూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్న మాచిరాజు వేణు గోపాల్ లాంటి వారి చెర నుండి ఋషిప్రోక్త వాస్తుశాస్త్రాన్ని రక్షించునదిగా ఈ గ్రంథమున్నది.

ఈ గ్రంథములో ఆయము గూర్చి విపులముగానున్నది. అర్వణము, ఏకశాల, ద్విశాల, త్రిశాల నిర్మాణములు, సింహద్వార నిర్ణయము, వంటశాల,దిశానిర్దేశము గూర్చి, వాస్తు జ్యోతిషమునకు ఉన్న అవినాభావ సంబంధము గురించి వివరించుట శుభదా యకము. మత్స్య యంత్ర స్థాపన,శల్య శోధన గూర్చి వ్రాసిన విషయాలు అక్షరసత్యాలు.

ఈ గ్రంథరచనద్వారా వాస్తుశాస్త్ర విలువలు కాపాడి సశాస్త్రీయ వాస్తుశాస్త్రాన్ని పాఠకులకు తెల్పిన శ్రీచల్లా రామారావు గార్కి వాస్తు పురుషుడు ఆయురారోగ్యఐశ్వర్యములు ప్రసాదించాలని కోరుకొనుచున్నాను.

ఇట్లు
విద్వజ్జన విధేయుడు
**డా॥ చిత్రాల గురుమూర్తి గుప్త సిద్దాంతి**
శతాబ్ది పంచాంగకర్త

D.no-14\214
**కమలానగర్**
**అనంతపురము - 515001**
**94402 48176**

### శుభాకాంక్షలు

ప్రముఖ జ్యోతిష, వాస్తు పండితులు శ్రీచల్లా రామారావు గారు రచించిన వాస్తుజ్యోతి అను గ్రంథమును ఆమూలాగ్రం చదువుట జరిగింది. వాస్తులో కొన్ని ముఖ్య విషయములను వివరణాత్మకంగా వ్రాసిన విధానము బాగున్నది. వర్గారూఢములు వాటికి తగిన దిశలు, సందర్భానుసారముగా జ్యోతిష శాస్త్ర విషయములు యుక్తి యుక్తముగా వివరించినారు.

భూ ప్లవముల విషయము, ఎత్తుపల్లాల ప్రస్తావన ఉన్నది గాని, బరువు - తేలికల వివరణము వాస్తు శాస్త్రములో లేదని గ్రహించవలెను. వాస్తులో ముఖ్యమైన సోపాన, శంకుస్థాపన, గృహప్రవేశము విషయముల గూర్చికూడా వివరించిన పాఠకులకు ప్రయోజనకరముగా నుండును. మలి ముద్రణలో సవరించుట మంచిది.

ఇక ముందు కూడా సజ్జనులకు ఉపయోగపడు వాస్తుశాస్త్ర విషయములు గ్రంథ రూపమున రచించి ప్రకటించగలరని ఆశిస్తున్నాము.

వాస్తవ దృక్సిద్ధ పుష్కర పంచాంగకర్త,
వాస్తు - జ్యోతిష పండితులు
**పళ్ళావఝుల శ్రీరామకృష్ణ శర్మ**
వాస్తు విజ్ఞాన పరిషత్ కార్యదర్శి
వాస్తు విద్యా విజ్ఞాన కేంద్రం అధిపతి
తాడేపల్లిగూడెం, 9849252017

జ్యోతిష విశారద - వాస్తు సమ్రాట్
**డా॥ ముదుండి విశ్వనాథరాజు**
వాస్తు విజ్ఞాన పరిషత్ అధ్యక్షులు,
వాస్తవ దృగ్గణిత పంచాంగ సమాఖ్య గౌరవ అధ్యక్షులు
హైదరాబాద్, 9440945403

# గృహము - దాని ఆవశ్యకత

వాస్తు అనగా భూమి అని అర్థము. వస్తువులతో నిర్మింపబడినది కావున గృహమునకు వాస్తువు అని పేరు. గృహము నిర్మించుకొనుటకు యోగ్యమైన ప్రదేశము భూమిని వాస్తు అనియు అట్టి భూమిపై నిర్మించు గృహమునకు కూడా వాస్తు అనియు అందురు. కావున గృహనిర్మాణము చేయు భూమి, ఆభూమిపై కట్టబడిన గృహమును కూడా వాస్తు అనియే అందురు.

భగవంతుడు ఉండుటకు కట్టబడినది దేవాలయము. అదే విధముగా భగవత్ స్వరూపమయిన ఈ జీవుడు నివసించు స్థలమును గృహము అందురు. భగవంతుడు మనకు శరీరములను కల్పించెను. అట్టి శరీరములు ప్రకృతి నుండి వచ్చు ఉష్ణ, వాయు, శీత, వర్షముల నుండి కాపాడుకొనుటకు మహర్షులు వాస్తు శాస్త్రమును తెలిపియున్నారు. ఇతరుల గృహముల యందుండి చేయు శ్రౌత,స్మార్తాది కర్మలయొక్క పూర్తి ఫలితము మనకు అందకుండా కొంత భాగము గృహ యజమానికి చెందుతుంది. ఆ పూజవలన ఇంటియజమాని గృహదోషములు సమసిపోవును. అద్దె ఇంటిలో ఎల్లవేళలా ఉంచరు కాబట్టి ఇల్లిల్లు తిరగడం ఎప్పుడూచేయలేము.

మనకు తగిన వసతులున్న గృహము లభించక,లభించినా అందుబాటు ధరలలో అద్దెలుండక,ప్రతినిత్యము అద్దెయింటి యజమాని పర్యవేక్షణవలన కలిగే ఇబ్బంది, ముసలి తనము, దీర్ఘకాలిక అనారోగ్యముల యందు అన్ని వసతులు, సౌకర్యములు సమీపములో ఉండు ఇల్లుదొరకక, ప్రజలచే చిన్నచూపులు సహించుట ఎల్లవేళల సాధ్యం కాదు కాబట్టి, మనఇష్టానుసారం జీవించటానికి వీలుకలగాలంటే సొంత ఇల్లు ఎంతో అవసరము. అది భవంతినా, డాబానా, పెంకుటిల్లా, తాటియాకుల ఇల్లునా, సిమెంటు రేకుల ఇల్లా అనికాదు. ఏది ఏమైనను సొంత ఇంటిలోవున్న ఆనందం సంతోషము అంతాఇంతాకాదు. ఎవరి ఆర్థిక శక్తినిబట్టి గృహమును నిర్మించుకుంటారు.

అందువలన ఇంటిని శాస్త్రీయముగా నిర్మించుకొనుట అనగా మహర్షులు చెప్పిన విధముగా నిర్మించుకొనవలెనని ప్రతి గృహస్థుడు కోరుకుంటాడు. గృహనిర్మాణార్థమై వాస్తు ప్రచారకులను సంప్రదిస్తే వారు మన ఇష్టాఇష్టములకు సరియైన ప్రాధాన్యత ఇవ్వక తనకు తెలిసిన అరకొర మిడిమిడిజ్ఞానం కలవారు అధికమై వాస్తు శాస్త్ర స్వభావ మును సరిగా గ్రహించక గృహనిర్మాణార్థమై వచ్చువారిని నానా ఇబ్బందులు పెట్టుచున్నారు. ఆయము కుదరలేదని, వర్గు సరిలేదని గృహస్థుడిని కుంగదీస్తారు. మీ పేరుకు ఇంతటి పొడవు,వెడల్పు ఉండాల్సిందే అని శాసిస్తారు. ఇంకా ప్రశ్నిస్తే కసురుకుంటారు. వాస్తు శాస్త్రం పుట్టింది యజమాని ఇష్టానుసారముగా నిర్మించడానికి తప్ప అరకొరజ్ఞానం కలి గినవారు చెప్పినట్టుగా గృహము నిర్మించడముకాదు. గృహము కట్టుకునేవారి వద్ద అధిక ముగా, సులువుగా కానుకలు స్వీకరించుట కొరకు అధికమంది వాస్తు పండితులమని వీధివీధికి తయారైనారు. గృహయజమాని ఇష్టాలను గ్రహించి అందుకు అనుగుణమైన గృహ నమూనాకొరకు వాస్తుఛందస్సును క్షుణ్ణంగా పరిశీలించాలి ఓర్పు, శ్రద్ధ, భక్తివున్నవారే

గృహస్థు ఇచ్ఛానుసారము గృహనమూనా రూపొందించగలరు. వాస్తుశాస్త్రము, జ్యోతిష శాస్త్రమునందు అంతర్భాగముగా భావించి మహర్షులు వాస్తు శాస్త్రమును రచించి నారు. కావున జ్యోతిషము వేరు, వాస్తువేరు అనువారిని ఉద్దేశించి ఈ గ్రంథము వ్రాయబడలేదని గ్రహించవలయును. గ్రహజాతకముకన్నా గృహజాతకము మిన్న ఇటువంటి మాటలు చెప్పువారు గ్రహించవలసినది ఏమనగా గ్రహజాతకమును అనుసరించియే గృహమును కట్టుకొనవలయును అను విషయము. మానవున్ని శాసించేది కాలము. కాలము నవగ్రహాల ఆధీనము.ఆ నవగ్రహ ములు కర్మల ఫలితములను ప్రసాదించుటకు ఆదిదేవుడు ఏర్పరచిన వ్యవస్థ.

## జన్మనక్షత్ర ప్రాధాన్యము

మానవ జీవితములో అత్యంత కీలకమైనది వివాహము. వివాహము ద్వారా ఇరువురు స్త్రీ, పురుషులు మనస్సులు ఒక్కటౌతాయి. వివాహం అయిన పురుషుడును గృహస్థుడు అని, వివాహం అయిన స్త్రీని గృహిణి అని అంటారు. ఇప్పటిదాకా తల్లిదండ్రుల సమక్షంలో పెరిగిన ఈ స్త్రీ,పురుషులు వివాహం అనంతరం దంపతులుగా నూతన జీవితమును గడుపుదురు. వీరి నూతన జీవితమునకు గృహము అవసరమై ఉన్నది. జననాది మరణ పర్యంతంగల షోడశ కర్మలకు చెప్పే సంకల్పంలో నామమును చెప్పుకొనుట వుంటుంది. ఆ నామము సాధారణముగా జన్మనక్షత్రము ననుసరించి ఏర్పరచికోబడివుంటుంది. అందువలననే వర్ణ సమామ్నాయములో ఏ నక్షత్రమునకు ఏఏ అక్షరాలు సంబంధంగలవో తెలుపబడతాయి. తారాబలము, చంద్రబలము ముఖ్యంగా చూడబడతాయి. ఈ తారాబల, చంద్రబలము జన్మనక్షత్రముతోనే చూచెదరు. నామనక్షత్రమును బట్టి చూడరు. జన్మ నక్షత్రము గురించి పూర్తిగా తెలియని వారి కొరకు నామనక్షత్రము చూచెదరు. షోడశ కర్మలకు జన్మనక్షత్రమునకు అధిక ప్రాధాన్యతను ఇచ్చిరి. వివాహ పొంతనలో వధూవరుల జన్మ నక్షత్రములను బట్టి అనుసరించాలి. వరుడుకు జన్మనక్షత్రం వుండి వధువుకు జన్మనక్షత్రం లేకపోతే నామనక్షత్రంతోనే వధువు పొంతన చూడాలి. వధువుకు జన్మనక్షత్రం ఉండి వరునకు జన్మనక్షత్రం లేకపోతే అప్పుడు వధూవరుల ఇద్దరికీ నామనక్షత్రానికి ప్రాధాన్యత ఇవ్వాలి. వివాహమయిన వరుడు గృహస్థుడు అవుచున్నాడు. ఆ గృహానికి వరుడు యజమాని అవుచున్నాడు. యజమానికి జన్మనక్షత్రం ఉండి వధువుకు జన్మనక్షత్రం ఉంటే ఇరువురికి జన్మ నక్షత్రాలతోనే పొంతనలు, తారాబల, చంద్రబలములు చూడవలసి వున్నది. గృహస్థుడికి జన్మనక్షత్రం ఉండి వధువుకుజన్మనక్షత్రం లేకుండావుండినప్పుడు నామనక్షత్రం తోనే పొంతన చూచు కోవచ్చుని చెప్పినారు. వరుడుకి జన్మనక్షత్రం లేకపోయినప్పుడు నామనక్షత్రంను పరి గణనలోకి తీసుకోమనినారు. అప్పుడు వధువుకు జన్మనక్షత్రం ఉన్నాసరే నామనక్షత్రాన్నే పరిగణనలోకి తీసుకోమంటారు. అంటే వరుడి జన్మనక్షత్రానికే ప్రాధాన్యత ఇవ్వబడినది.

పుట్టినది మొదలు అంత్యేష్టి కార్యక్రమములకు విధిగా జన్మనక్షత్రముతోనే కార్య క్రమములు జరుపుతారు. జన్మనక్షత్రమును ప్రధానంగా ప్రముఖంగా వాడతామేగాని జన్మనక్షత్రము కాదని నామనక్షత్రమునకు ప్రాధాన్యము ఇవ్వడంలేదుకదా. జాతకుడు

జన్మించిన నక్షత్రముననుసరించి మహాదశలు నిర్ణయింపబడి జీవిత ఫలములు కలుగు చుండును కదా. ఆవిధంగా జరిగే దశాంతర్దశలు వివిధ గ్రహాలకు చేయించు శాంతులు పూజలకు జన్మనక్షత్రము ద్వారానే జరుపుతాము. షోడశ కర్మలలో గృహశంకుస్థాపన, గృహప్రవేశకర్మలు చెప్పబడలేదు. జాతకములో నాల్గవ భావాన్నిబట్టి గృహసౌఖ్యము తెలుపబడుతుంది. జీవితంలో అత్యంతకీలక కార్యక్రమాలలో జన్మనక్షత్రం వాడుతూ కేవలం ఒక్కగృహానికి మాత్రం నామనక్షత్రము స్వీకరించుట సబబా. జన్మనక్షత్రంకన్నా, నామనక్షత్రమే ప్రాముఖ్యత గలదైతే షోడశకర్మలకు కూడా నామనక్షత్రం ఎందుకు పరి గణనలోకి తీసుకోలేదు. కావున జన్మనక్షత్రం ఉన్నవారు ఆ నక్షత్రముతోనే గృహకార్య ములు చేయవలయును. జన్మ నక్షత్రం తెలియనివారు మాత్రము ఏ నక్షత్రము తీసుకోవాలి అను మీమాంశ ఏర్పడును.

వారు మాత్రమే నామానికి ప్రాధాన్యత ఇచ్చి నామ నక్షత్ర రీత్యా గృహకార్యములు చేయవలయును. ఈ నామనక్షత్ర రీత్యానే షోడశకర్మలు చేయవలయును. జన్మ నక్షత్రముల ఉన్నవారు షోడశ కర్మలతో పాటు గృహ స్థాపనాది కార్యములు జన్మ నక్షత్రముతోనే చేయవలయును. పంచాంగములలో వ్రాయబడే గోచార గ్రహాల ప్రభావములను జన్మ నక్షత్రరీత్యా ఏర్పడే రాశులననుసరించి మాత్రమే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చుచున్నారే గానీ నామనక్షత్రరాశులరీత్యా గోచారగ్రహాల ప్రభావమునుసరిగా నిర్ణయించలేము.

కావున షోడశకర్మలకు, గోచార గ్రహాలకు చేయు పూజలు, దానములు, వ్రతములకు జన్మనక్షత్ర ప్రాధాన్యత ఉన్నది. వ్యక్తి జన్మనక్షత్రమును బట్టి దశాంతర్దశలు ఏర్పడుచున్నవేగాని, పేరుపెట్టిన తరువాతి నామ నక్షత్రము ననుసరించి గ్రహముల దశాంత ర్దశలు ఏర్పడుటలేదు. శాస్త్రము నందు జన్మనక్షత్రమునకు పర్యాయపదముగా నామ నక్షత్రము అని వాడినారే గాని నామ నక్షత్రములను ప్రత్యేకించి పరిశీలన చేయమని కాదు. అయితే వాక్కుకు కూడా కొంత శక్తి ఉన్నది కాబట్టి నామనక్షత్రరీత్యా నైధన తార, అష్టమరాశి కాకుండా చూచుకొనుట సాంప్రదాయమున్నది. కావున జన్మ నక్షత్ర ప్రాధాన్యతను గ్రహించి గృహనిర్మాణకార్యములకు ఆచరించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. వివాహానికి జన్మనక్షత్రము పరిగణనలోనికి తీసుకుని గృహవిషయంలో తీసుకోక పోవడం ఆశ్చర్యకరమైన విషయమే. గృహస్థులుగా నూతన జీవితం ప్రారింభించే వివా హానికి జన్మనక్షత్రం తీసుకొన్నప్పుడు గృహానికి కూడా జన్మనక్షత్రం అనుసరించుట విజ్ఞత అనిపిస్తోంది.

## గృహనిర్మాణానికి ఆయము చూడటము అవసరమా

ఆయము అనగా లాభము అను ఒక అర్థము కూడావున్నది. ఇంటిని నిర్మించే పొడవును ఆయము అనికూడా అందురు. ఆయమనే పొడవును విశాలమనే వెడల్పుచేత గుణించగా వచ్చు సంఖ్యను ఘనమని, పదమని, క్షేత్రమని, క్షేత్రకృత పదమని, పిండమని పర్యాయ పదములుగా చెప్పుకొందురు. గృహనిర్మాణాది విషయమున ఆయమును ప్రాణ తుల్యంగా చెప్పుకొందురు. గృహనిర్మాణమువలన మనము సుఖసంపదలు పొందవలసి వున్నది. ఈ సుఖసంపదల సాధన కొరకే లక్షలాది రూపాయలు వెచ్చించి గృహమును నిర్మించుకుంటున్నారు. అంతడబ్బును వ్యయపరచి గృహనిర్మాణము చేసేది అందు నివ

సించుట ద్వారా సుఖభోగములు పొందవలయుననే కోరికయే ముఖ్యము. మనము ఏదైనా ఒకపని చేయతలపెట్టి నప్పుడు ఆపని వలన మనకు లభించు నష్టములు ఏమిటి, సుఖదుఃఖాలు ఏమిటి అని ఆలోచనచేసి తనకు ఏవిధంగా ఈ కార్యం నెరవేరిస్తే తక్కువ శ్రమతో నాణ్యమైన పనిచేసి తద్వారా లాభములతోపాటు సుఖములు వస్తవి అని పరిశీలించి బేరిజు వేసుకొని పని ప్రారంభించినవారిని ఉత్తములుగా వ్యవహరిస్తాము.

దీనివలన తన జన్మజాతక చక్రరీత్యావున్న గ్రహాలకు అనుకూలమైన స్థానములతో ఏవిధముగా గృహనిర్మాణం సాధ్యపడుతుంది. తద్వారా గృహముకూడా తనకు లభించు చున్న గ్రహాల మహాదశాంతర్థశ ఫలితములు అనుకూలముగా ఉండుటకు సాధన మవు తుంది. జన్మజాతకచక్ర రీత్యా ఏర్పడిన గ్రహాలస్థానాలను మార్చేశర్తి మనకులేకున్నా, ఆయాగ్రహాలు ప్రసాదించు ఫలితములను ద్విగుణీకృతముగా పొందుటకు, అశుభఫల ములను ప్రసాదించు గ్రహములు తక్కువ మొత్తంలో ఇచ్చుటకు అనువుగా తన గృహమును నిర్మించుకొనుట తనచేతిలోని పని అవుతుంది. తద్వారా సుఖసంపదలతో తనజీవితమును మలచవచ్చును. అందువలన గృహనిర్మాణము చేయవలయునను సంకల్పము కలవారు తగినంత ముందుగా దైవ శక్తివంతులైన జ్యోతిష్కుని సంప్రదించవలెను. ఇచ్చట వాస్తు పండితుడిని అనకుండా జ్యోతిష్కుని సంప్రదించ మన్నందుకు కారణము గృహవాస్తు అనునది జాతకములోని ఒకభాగమే. మనిషి జన్మజాతకమును 12 భాగములుగా విభజించి ఫలిత నిర్థేశము చేస్తుంటారు. గృహసౌఖ్యము అనేది 12 భావములలో 4వ భావమునకు సంబంధించినది. దీనిద్వారా లగ్నాధిపతి, గృహస్థానాధిపతుల మిత్రత్వ, శత్రుత్వ విచారణ చేయవలసివున్నది. గృహస్థానమును శుభగ్రహాలు చూచుచున్నవా, పాపగ్రహాలు చూచు చున్నవా. గృహరాశి శుభులక్షేత్రమా, పాపగ్రహాలక్షేత్రమా, గృహరాశిలో శుభగ్రహం వున్నదా, పాపగ్రహంవున్నదా, తనకు గృహము నిర్మించాలనిపించినప్పటికి ఏఏదశలు జరిగినవి, జరగబోయే మహాదశలు ఏవి, ఏఏమహాదశ ఏఏకాలంలో ప్రారంభమవుతుంది అను విషయములను పరిశీలింప చేసుకోవలసివున్నది. కాలము అనుకూలముగా లేకపోతేఎంత ధనము ఉన్నను తన కోరికననుసరించి ఇంటిని సకాలములో పూర్తి చేయలేము.

ఆ విధముగా కాలానికి వ్యతిరేకముగా నిర్మాణములు ప్రారంభించిన వారు ఎన్నో అష్టకష్టములు పడితేగాని పూర్తి కావటంలేదు. ఒక్కొక్కసారి మధ్యలో ఆగిపోవుట కూడా సంభవించు చున్నది. కాబట్టి సులువుగా, సుఖముగా గృహనిర్మాణము గావించుటకు తన జన్మజాతకరీత్యా అనుకూలమైన సమయమును ముందుగా తెలుసుకొని అనువైన సమయములో గృహనిర్మాణములు ప్రారంభించు వారికి నల్లేరుపై బండి ప్రయాణం లాగ వారు కార్యక్రమములు నెరవేర్చుకొందురు. తన గృహరాశి అధిపతిననుసరించి ఏ ఆయము గల గృహమును నిర్మించవలెనో ఇంటి ముఖద్వారం ఏదిక్కుకు ఉండవలయునో తెలుస్తుంది. తద్వారా తన జన్మజాతకచక్రములోని శుభఫలితములను,ప్రసాదించు గ్రహములు బలమును పెంచుటకు అశుభఫలిత ములను ప్రసాదించు గ్రహముల బలము ను బలహీనపరచుటకు అనువుగా ఆ ఇంటి యందును, ఇంటిబయటను దిశలను ఏర్పరచుకొనవచ్చును.

గృహనిర్మాణమునకు తీసుకొను స్థలము పొడవును, వెడల్పుతో గుణించగా వచ్చిన వైశాల్యమును (సంఖ్యను) వాస్తు పదము అందురు. ఈ పదము ద్వారా వచ్చిన కొలతలతో గృహము నిర్మిస్తే లాభము ఉంటుందా, నష్టము (కష్టము) వస్తుందా అని తెలుసు కొన వచ్చును. ఏ పని చేసినా ప్రయోజనము అనేది ఉండాలి. మనము కష్టించి పని చేసేది అనుకూల ప్రయోజనములు పొందుట కొరకే కదా. పంచభూతాలతో నిర్మితమైన గృహము వలన లాభము ఉన్నదా? ఖర్చు అధికముగా ఉన్నదా అని ముందే తెలుసుకుని, తనకు లాభదాయకమైన ప్రయోజనములు ఇవ్వగల వాస్తు పదము కొరకు పరిశీలన చేసి అను కూలంగా ఉండులాగున గృహమును నిర్మించుకొనవచ్చును. గృహవాస్తు జ్యోతిష శాస్త్రములో ఒక భాగమన్న విషయమును మరువవద్దు. వాస్తువు ప్రధానంగా నిర్మాణ శాస్త్రానికి సంబంధించినది. ఆ నిర్మాణం ఏవిధంగా చేసుకోవాలి అనేది వ్యక్తి జన్మ జాతకం ద్వారా ఇంటి వెలుపల ఏఏ దిక్కులందు ఖాళీ స్థలములు ఎంతెంత వదిలి పెట్టాలి మొదలగు విషయములు చర్చించబడతాయి. దీనినే దశను బట్టి దిశ అని అందురు. గృహపిండమును 8 చేత గుణించి 12 చేత భాగించగా వచ్చిన శేషం ధనమును తెలుపును. ధనం ఎన్ని పాళ్ళు వుంటుందో తెలుస్తుంది. తరువాత అదే పద సంఖ్యను 3 చేత గుణించి 8 చేత భాగించగా వచ్చిన శేషం ద్వారా వ్యయము తెలియును. అనగా ఖర్చు తెలుస్తుంది. దీనినిబట్టి ఈపదం ద్వారా గృహము నిర్మించవచ్చునా లేదా అనేది ముందుగా తెలుసుకొని అనుకూలమైతే ఆ పదమును స్వీకరించవచ్చు. ప్రతికూల ముగావుంటే ఇంకా మెరుగైన శుభఫలితములు ప్రసాదించు వాస్తుపదమును ఎన్నుకొని నిశ్చయించు కోవచ్చును. పూర్వీకులైన మహర్షులు తమ దివ్యజ్ఞాన సంపత్తితో తెలుసుకొని లోకానుగ్రహం కోసం ఎటువంటి స్వార్థబుద్ధిలేకుండా తెలిపినారు. అందువలన వీటిని అనుసరించుట మంచిది. ఈ వాస్తు పదవిన్యాసము ఈ కాలం నాటిదికాదు. శ్రీమద్రామా యణ కాలంనుండి కూడా విరివిగా ఆచరిస్తూ వస్తున్నారు. తరాలుగాదు యుగాలనుండి ప్రజలు ఆచరిస్తున్నారు అంటే ప్రయోజనం లేనిదే ఆచరించరుకదా! కావున నిష్ణాతుడైన జ్యోతిష్కుని సంప్రదించి మీకు అనుకూలమైన వాస్తు పదమును ఎంచుకొనవలయును. సమర్థులైన పండితులు తెలిపే ఫలితములు అనుభవమునకు దగ్గరగా ఉండును.

ధనవ్యయం తర్వాత గృహనిర్మాణానికి కావలసినది గృహపిండం ద్వారా రాబడిన గృహ ఆయుష్షు ఎంత అని తెలుసుకొనవలసివుంది. నిర్మాణాల భేదములువలన ఇల్లులు త్వరగా క్షీణించవచ్చును. వందల సంవత్సరాలపాటు నిలబడవచ్చును. అది నిర్మాణము నకు వాడు వస్తువులనుబట్టి కూడా ఉండును. ఇచ్చట ఆయుష్షు అనేది ఇంటికి జీవ కళ లాంటిది. నిర్జీవమైన అనగా ఎండిపోయిన చెట్టువలన ప్రయోజనము ఏమున్నది. కాబట్టి ఇంటిలో ఉండు జనులు సుఖసంతోషములతో ధనధాన్యములతో కళకళ లాడాలంటే ఆ ఇంటికి జీవకళ కూడా వుండవలయును. దానినే ఆయుష్షు పదముద్వారా తెలపబడు చున్నది. లక్షలాది రూపాయలు ఖర్చుపెట్టి నిర్మించే గృహమువలన ప్రయో జనము ఎక్కువ కాలం వుండాలని ప్రతీవారు ఆశిస్తారు. తను నిర్మించిన గృహము తన తదనంత రము తన వారసులకు కూడా ఉపయోగపడవలెనని కోరుకుంటారు.

సాధారణంగా మానవుని ఆయుష్షు నూరు సంవత్సరములు. ఒక వ్యక్తి యుక్త వయస్కుడై వివాహం చేసుకొని గృహస్థజీవితం ప్రారంభమై ధనమును కూడబెట్టు కొని స్వగృహము నిర్మించాలనే సరికి కనీసం 30సం॥లపైనే వయస్సు ఉంటుంది. ఈ కాలంలో 40సం॥ల వయస్సు తర్వాతనే సంభవమవుతుంది. అందువలన తన జీవితకాలం ఇంకా సుమారు 60సం॥లుంటుంది అని భావించి తను నిర్మించే ఇంటికి జీవకళ కనీసం 60సం॥లుగా ఉండాలని భావిస్తూవుంటారు. అందువలననే వాస్తుపదము ద్వారా లభించిన ఆయుష్షు 60సం॥ల కంటే తక్కువ వయస్సును సూచించిన దానిని శ్రేష్ఠమైనదిగా వ్యవహరింప బడుటలేదు. అందువలన 60సం॥ల కన్నా అధిక ఆయుష్షు లభించు వాస్తుపదమును ఎన్నుకొందురు. వాస్తు పదములలో ఆయుష్షునిచ్చేవి 3సం॥ల నుండి 120సం॥లు ఇచ్చే పదములున్నవి. 60కి పైగా వుండేవి శ్రేష్ఠమైతే మిగతా వాటిలో పెద్ద ప్రయోజనం లేదని భావించవలదు.

ఉదాహరణకు గృహములలో జరిగే శుభ కార్యములకు ఇంటిముందర పందిరిలు వేసేవారు. ఆ పందిరిని ఉంచేది తక్కువ కాలం కాబట్టి ధనవ్యయము. శుభాయముచూచి వాటి కొలత ప్రకారము పొడవు వెడల్పులతో పందిరిలను ఏర్పరచుకోవచ్చును. మన ఇళ్ళలో నిత్యము ఉపయోగించే వివిధ వస్తువులు బల్లలు, పీఠలు మొదలుగనవి వాడకమునకు ఎక్కువ సం॥లు లేనివివుంటివి. అటువంటి వాటికొరకై తక్కువ ఆయుష్షు ఉండి ధనము అధికముగా ఉన్న పదములద్వారా తేబడిన పొడవు వెడల్పులతో వస్తువులను, సామానులను తయారుచేయవచ్చును. ఈ విధముగా ఆయసాధన ఉప యోగపడుచున్నది. పదసంఖ్యను 9చేత గుణించి 120చేత భాగించగా వచ్చిన శేష సంఖ్యయే ఆయుష్షు అనగా జీవకళను సూచించుచున్నది.

వాస్తుపదం ద్వారా రాబట్టవలసిన ముఖ్యమైన విషయములలో ఒకటి ఆయము. ఆయము 8 రకములు.

అవి 1.ధ్వజాయము 2.ధూమాయము 3.సింహాయము 4. శ్వానాయము 5.వృషభాయము 6.ఖరాయము 7.గజాయము 8.కాకాయము.

ఈశాన్యం తూర్పు ఆగ్నేయం

| | | |
|---|---|---|
| కాకా | ధ్వజా | ధూమా |
| గజా | బ్రహ్మ | సింహా |
| ఖరా | వృష | శ్వానా |

ఉత్తరం (ఎడమ) దక్షిణం (కుడి)

వాయువ్యం పడమర నైఋతి

ఈ 8 ఆయములు ఒక్కొక్కటి ఒక్కొక్క దిక్కునందు బలము గలవి అగును. అయితే వీనిలో ధ్వజ,సింహ,వృష,గజాయములు శ్రేష్ఠమైనవి. ఇవి నివాస గృహముల నిర్మాణ ములకు స్వీకరించవచ్చును. ఈ 4ఆయములు వరుసగా తూర్పు,దక్షిణము, పడమర, ఉత్తరము దిక్కులను ఆశ్రయించివున్నవి. ఇవి శుభములను ప్రసాదించును. అశుభ ఆయములైన ధూమ,శ్వాన,ఖర,కాకాయములు మూలలకు సంబంధించినవి. ఇవి ఆయా మూలలయందు బలము కలిగివుండును. ఇవి నివాస గృహములను నిర్మించుటయందు ఇవి ఉపయోగపడవు. అశుభ ఫలితములను ఇచ్చుచుండును. ఇవి వరుసగా ఆగ్నేయం, నైఋతి,వాయువ్యం, ఈశాన్యం దిక్కులకు సంబంధించి ఉండును.

ఈ మూలలకు సంబంధించిన ఆయములను రకరకములైన వస్తువులు, వాహనములు తయారుచేయు ఫ్యాక్టరీలకు,కర్మాగారాలకు,పశువుల శాలలకు నిర్మించవచ్చును. ఇచ్చట 8 ఆయములలో తననుండి 5వ ఆయము శత్రువు అగును. ఉదాహరణకు: తూర్పుదిక్కున ఉన్న ధ్వజాయమునకు 5వ దిక్కుఅయిన అనగా తూర్పుదిక్కునుండి లెక్కించగా 1తూర్పు 2ఆగ్నేయము 3దక్షిణము 4నైఋతి 5పడమర అనగా ధ్వజాయమునకు పడమర దిక్కు నున్న వృషభాయము శత్రుస్థానమైనది. ఇదే విధముగా మిగతా ఆయములకు కూడా ఆ విధముగా లెక్కించుకొనవలెను.

| ఆయము | శత్రుఆయం | ఆయము | శత్రుఆయం |
|---|---|---|---|
| 1. ధ్వజ | వృషభాయం | 5. వృష | ధ్వజాయం |
| 2 ధూమా | ఖరాయం | 6. ఖర | ధూమాయం |
| 3. సింహ | గజాయం | 7. గజ | సింహాయం |
| 4. శ్వేన | కాకాయం | 8. కాకా | శ్వేనాయం |

కావున ఈ శత్రు స్థానములో ఉన్న ఆయములందు గృహనిర్మాణములు, కర్మాగారాలు లాంటి నిర్మాణములు చేయరాదు.

గృహ యజమాని ఏ దిశగా తన గృహమునందు ప్రవేశించునో ఆదిశ గృహనామము ఏర్పడుచున్నది. తూర్పు సింహద్వారమైనప్పుడు ఆ గృహ యజమాని పశ్చిమ ముఖముగా ఇంటిలోనికి ప్రవేశించును. గాన ఆ ఇల్లు పశ్చిమ (పడమర) ఇల్లు అగును. పడమర సింహద్వారము ఉన్న ఇంటినందు గృహయజమాని తూర్పు ముఖముగా ప్రవేశించును. కాబట్టి దానిని తూర్పు గృహము అందురు. దక్షిణ సింహద్వారము గల ఇంటిలోనికి యజమాని ఉత్తర ముఖముగా ప్రవేశించును. కాబట్టి దానిని ఉత్తర గృహము అందురు. ఉత్తర సింహద్వారముగల గృహమునందు యజమాని దక్షిణ ముఖముగ ప్రవేశించును. కావున దానిని దక్షిణగృహము అందురు. ఈ విధమైన పద్ధతి ప్రస్తుతము వాడుకలోనూ, ప్రచారములోనూ ఉన్నది. కాని ప్రాచీన గ్రంథకర్తల అభిప్రాయము వేరు విధముగా ఉన్నది. స్థలం మొత్తంమీద ఇంటిని నిర్మించిన స్థలం మొత్తం స్థలంలో తూర్పు దిక్కునకే కట్టినచో ఆ ఇంటిని ధ్వజాయ గృహము అందురు. ధ్వజాయము తూర్పు దిక్కునందే

స్వస్థానము కలది. అందువలన ఇంటిని నిర్మించిన స్థలం మొత్తంలో తూర్పు దిక్కును ఆక్రమించి ఉంటే అనగా స్థలము నందు తూర్పు దిక్కునందు నిర్మింపబడిన గృహము కాబట్టి దీనికి తూర్పుఇల్లు అందురు. ఈ తూర్పు యిల్లుకు తూర్పు దిశన ధ్వజాయముతో కట్టవలెను. ఎందు వలన అంటే ధ్వజాయము స్వస్థానము తూర్పు కాబట్టి. కానీ తూర్పు దిశ యందు కట్టిన యిల్లు ధ్వజ, సింహ, గజాయములతో కట్టవచ్చును. ఈ ఇంటికి సింహద్వారము తూర్పు దిశన ఉంచినను, పడమర దిశను ఉంచినను దీనిని తూర్పు గృహము అని, ధ్వజాయ గృహమని అందురు. ఈ తూర్పు యిల్లుకు సింహ, గజాయ కొలతలతో నిర్మించిన ఆ గృహమును ధ్వజాయ గృహముగానే వ్యవహరించ వలయును. ఎందుకనగా ఆ గృహము స్థలం మొత్తం మీద తూర్పు దిశలో యిల్లు నిర్మించినందున తూర్పు దిశయందున్న ఇల్లునే వాస్తు శాస్త్రరీత్యా పర్యాయ పదమైన ధ్వజాయ గృహమని పేరు. ఈ తూర్పు దిక్కున కట్టిన ఇంటికి వృషభాయము గణిత కొలతలు వాడరాదు. ఈ తూర్పు దిక్కునందున్న గృహానికి తూర్పు దిక్కునందు రాజవీధి ఉంటే తూర్పున సింహద్వారం ఉంచుకొనవలయును. తూర్పున సింహద్వారం లేకపోతే పడమర సింహ ద్వారం ఉంచవచ్చును. అనగా గృహములోనికి తూర్పు ముఖముగా యింటిలోనికి ప్రవే శించినంతమాత్రమున అది తూర్పు గృహముగా పరిగణించరాదని తెలియుచున్నది. ఈ తూర్పు దిక్కునందుండిన యింటికి తూర్పు వైపున రాజమార్గంఉంటే తూర్పు దిక్కున సింహద్వారం ఉంచుకోవచ్చు. ధ్వజాయకొలతలో గృహము నిర్మించవచ్చు. పడమరన దిక్కున పాణిద్వారము వుంచవచ్చును. కానీ తూర్పుదిక్కున రాజవీధిలేకుంటే యింటికి సింహద్వారం పడమర దిక్కునదుంచుట ఉత్తమమైన పద్ధతి.

ఈ విధముగానే స్థలంలోని దక్షిణ దిక్కునందు గృహము నిర్మించిన దీనిని దక్షిణ గృహమని అందురు. దక్షిణ దిక్కున స్వస్థానము కలిగినది సింహాయము. అందువలన దక్షిణదిక్కునందున్న గృహమును వాస్తు పరిభాషలో సింహాయ గృహమందురు. ఈ ఇంటిని నిర్మించుటకు తీసుకొను కొలతలు సింహాయ, వృషభాయ, ధ్వజాయ గృహకొల తలతో నిర్మించవచ్చును. వృషభాయ, ధ్వజాయ కొలతలతో దక్షిణ దిక్కున ఇల్లును నిర్మించినను ఆ ఇంటిని సింహాయ గృహమనియే పిలువవలెను. దక్షిణ గృహమునకు దక్షిణమున రాజవీధి వుండినచో సింహద్వారమును దక్షిణదిక్కునందుంచవలయును. పాణిద్వారం ఉత్తర దిక్కున వుంచవచ్చును. దక్షిణపు ఇంటికి దక్షిణమున రాజవీధి లేనప్పుడు గృహమునకు ఉత్తరదిశయందు సింహద్వారము వుంచవలయును. ఈ విధముగ కట్టు కొనుట ఉత్తమపద్ధతి. అదే విధముగ స్థలములో పడమటి దిక్కున నిర్మించిన గృహమునకు పశ్చిమగృహము అందురు. దీనికి ప్రధానంగా వృషభాయ కొలతలతో గృహమును నిర్మిం చవలయును. గజ, సింహాయ కొలతలతోనైనను పడమటి ఇంటిని నిర్మించవచ్చును. ఈ ఇంటికి పడమరవైపున రాజవీధి ఉన్నప్పుడు పడమరవైపున సింహద్వారం వుంచవలయును. రాజవీధి లేనప్పుడు సింహద్వారమును తూర్పు వైపు ఉంచవలెను. గజ, సింహాయ కొలతలతో కూడా పడమట గృహమును నిర్మించవచ్చును. స్థలమునందలి ఉత్తరదిక్కునందు గృహమును నిర్మించినయెడల దానిని ఉత్తరపు ఇల్లు అని అందురు.

ఈ ఇంటిని ప్రధానంగా గజాయ కొలతలతోనే నిర్మిం చవలయును. ధ్వజ, వృషభాయ కొలతలతోకూడ నిర్మించవచ్చును. ఈ ఇంటికి ఉత్తర దిక్కున రాజవీధివుంటే సింహద్వారము ఉత్తరదిక్కున వుంచవచ్చును. రాజవీధి లేనప్పుడు సింహద్వారమును దక్షిణదిక్కు నందుంచవలయును. కొంతమంది అభిప్రాయము ప్రకారము సింహాయ గృహమునకు గజాయము కూడా పెట్టవచ్చును అని అంటారు. సింహాయ గృహమునకు ఉత్తరము శతృదిక్కు అయినను గజము బలహీనమైనది సింహాయము బలమైనది. అందువలన బలవంతుడు బలహీనుడిని తన అదుపు ఆజ్ఞలలో వుంచుకుంటాడు అని అంటుంటారు. ఈ అభిప్రాయము సబబుగా లేదు ఎందువలననగా బలహీనుడు బలవంతుని ఎదిరించాలని కోరిక బలీయముగా వుంటుంది. అందువలన మనస్ఫూర్తిగా సహకరించలేడు. అవకాశం కుదిరితే తన శత్రువును వధించటానికే చూస్తాడు. గత్యం తరంలేని పరిస్థితులలో మాత్రమే ఇష్టంలేకున్నా తన శత్రువుకు సహకరిస్తున్నాడు.

కాని ఇప్పుడు రియల్ఎస్టేట్ ప్రభావమువలన విశాలమైన ఖాళీస్థలములలో ఇళ్ళు నిర్మించుట చాలా కష్టతరమైనది. పెద్ద పెద్ద ధనవంతులు, రాజప్రముఖుల నివాసములకే విశాలస్థలములు లభిస్తుంటవి. నేడు జనాభా విపరీతముగ పెరుగుట వలనను, ఉపాధి అవకాశముల కొరకు నగరములు, పట్టణములకు నగర పంచా యితీలకు ప్రజలు వలసవెళ్ళుచున్నారు. అందువలన భూమికి విపరీతమైన గిరాకి ఏర్పడివాటి ధరలు ఆకాశాన్ని తాకుతున్నాయి. ఇటువంటి పరిస్థితులలో రెండు లేదా మూడు సెంట్లలోనే గృహములను నిర్మించుచున్నారు. 4,5 సెంట్లలో గృహములు కట్టుట క్రమముగా తగ్గిపోవు చున్నది. మరి ఇటువంటి పరిస్థితులలో స్థలమునకు తూర్పున నిర్మించిన గృహం తూర్పు ఇల్లు అనునవి ఈ విధముగా నిర్మించుట కష్టసాధ్యమైనది. ఇప్పుడు స్థలమధ్యలోనే కాస్త అటుఇటుగా గృహమును నిర్మించుచున్నారు. అనగా స్థలము యొక్క బ్రహ్మస్థానంలోనే దాదాపుగా గృహములు నిర్మింప బడుచున్నవి. ఇప్పుడు ఈ కాలానికి తగినరీతిలో గృహ ములను నిర్మించవలసి వున్నది. స్థలములోని దిక్కులతో సంబంధము లేని గృహములను నిర్మించుకొన వలసివున్నది. అందువలన గృహపదవాస్తు గణితరీత్యా వచ్చిన ఆయమునను సరించి గృహములను నిర్మించవలయును. ధ్వజాయ కొలతతో స్థలముమధ్యనందు ఇంటిని నిర్మించవలెను. తూర్పున రాజవీధివుంటే తూర్పున సింహద్వారము వుంచవలయును. ఈ ఇంటికి సింహాయ గజాయకొలతలతో కూడ గృహమును నిర్మించుకొన వచ్చును. రాజవీధివుంటే తూర్పుదిక్కున సింహద్వార ముంచవలయును. రాజవీధి లేకపోతే పడమర దిక్కున సింహద్వార ముంచవలయును.

ఇదే విధముగా సింహాయగణిత కొలతలతో ఇల్లు నిర్మించుకొనినప్పుడు దక్షిణ దిక్కున రాజవీధి వుంటే దక్షిణదిక్కున సింహద్వారం వుంచి ఉత్తర దిక్కున పృష్ఠద్వారం వుంచవచ్చును. దక్షిణదిక్కున రాజవీధి లేనప్పుడు ఉత్తర దిక్కున సింహద్వారము వుంచవలయును. దక్షిణదిక్కున పాణిద్వారం వుంచవచ్చును. ఈ ఇంటిని వృషభ, ధ్వజాయ కొలతలతో కూడా నిర్మించవచ్చును. అదే విధముగా గృహమును వృషభాయముతో నిర్మించుకొనినపుడు పడమర దిక్కున రాజవీధి వుంటే ఇంటికి పశ్చిమ దిక్కుననే సింహ

ద్వారము ఉంచ వల యును. ఈ గృహమును గజ,సింహాయ కొలతలతో కూడా నిర్మిం చవచ్చును. ఇదే పద్ధ తిలో గజాయ కొలతలతో గృహమును నిర్మించినప్పుడు ఉత్తర దిక్కున రాజవీధి వుంటే సింహద్వారం ఇంటికి ఉత్తర దిక్కునందే ఉంచవలయును. ఉ త్తర దిక్కున రాజవీధి లేన ప్పుడు దక్షిణ దిశయందు సింహద్వారం వుంచవలయును. సారాంశమేమనగా తూర్పున రాజవీధి వుండినప్పుడు గృహమును ప్రధానంగా ధ్వజా, సింహ, గజాయము కొలతలతో నిర్మించవచ్చును. తూర్పున సింహద్వారం వుంచ వలయును. దక్షిణ దిక్కున రాజవీధి వున్నప్పుడు ప్రధానంగా సింహాయ కొలతలతోను వృషభ,ధ్వజాయ కొలతలతో కూడా గృహమును నిర్మించవచ్చును. అయితే సింహద్వారము దక్షిణ దిక్కునందుంచవలయును. పడమర దిక్కున రాజవీధి వున్నప్పుడు ప్రధానంగా వృషభాయ కొలతలతోను గజ, సింహాయ కొలతలతో కూడా గృహమును నిర్మించ వచ్చును. కాని సింహద్వారము మాత్రము పడమర దిక్కునందుంచవలయును.

ఉత్తర దిక్కున రాజవీధి వున్నప్పుడు గృహమును ప్రధానముగా గజాయ కొలతలతోనే నిర్మించవలయును. ధ్వజ,వృషభాయ కొలతలతో కూడా గృహమును నిర్మింవచ్చును. కాని సింహద్వారము మాత్రము ఉత్తరదిక్కు నందుంచవలయును. ఉత్తర దిక్కునందు రాజవీధి లేనప్పుడు సింహద్వారమును దక్షిణ దిక్కునందుంచవలయునని గ్రహించవలయును.

## అర్వణము

అర్వణము చాలా ప్రధానమైనది మరియు అత్యంత రహస్యమైనది. అర్వణము అనగా మనము అవతలి వ్యక్తితో సంబంధబాంధవ్యములు ఏర్పరచుకొనునప్పుడు దాని వలన మనకు లాభకరమా, నష్టకరమా లేక మిశ్రమ ఫలదాయకమా అని నిర్ణయించుటకు ఉ పయోగపడు అత్యద్భుత సాధనము. వివాహం నిశ్చయించే టప్పుడు వధూవరుల నామ ప్రధమాక్షరములతో కూడా పొంతన చూడవలయును. అనుకూలముగా వుండిన వారి దాంప త్యము సౌఖ్యముగానుండును. లేని యెడల వారి జీవితము అస్తవ్యస్తముగా నుండును. అప్పుడు వరుడి నామప్రధమాక్షరమునకు అనుకూలమైన వధువు నామమును మార్పు చేసుకోవలసివుండును. వధువునామ ప్రధమాక్షరమును ఈ అర్వణ పద్ధతి ప్రకారము అనుకూలమునుండులాగున నిశ్చయింపవలెను. ఒకరితో స్నేహంచేయాలన్నా, వ్యాపా రములో భాగస్వామ్యము అవ్వాలన్నా ఈ అర్వణము అత్యవసరము. అదేవిధముగా ఒకరు తన తల్లిదండ్రులునివసించు ఊరును వదలి అంతకుముందు నివాసముండని ప్రదేశములు, గ్రామములు, పట్టణములు, నగరములో గృహము నిర్మిచుకొన వలయునని ఆలోచించి నప్పుడు ఆ గ్రామములో నివాసముంటే ఆ గ్రామము నాకు కలసివచ్చునా రాదా? లాభమా,నష్టమా? సుఖమా,కష్టమా? అని తెలుసుకొనుటకు ఆతృత చూపుతారు. కలసి వచ్చే లేక అచ్చివచ్చే గ్రామము ఏది అని తెలుసుకొనుటకు ఈ అర్వణము ఎంతో ప్రసిద్ధ మైనది. తన తల్లిదండ్రులు నివసించు గ్రామములో చిన్నప్పటి నుండి వారితో కలసివుండి అదే గ్రామములో గృహము నిర్మించుకొనువారు ఈ అర్వణమును పరిశీలించనవసరము లేదు. వారు ఆ గ్రామములోనే సందేహము లేకుండా గృహనిర్మాణము చేసుకొనవచ్చును. అదే విధముగ ఒకరు ఏ దేవతను ఉపాసించితే

అనుకూలముగా వుండును. త్వరగా మంత్రము సిద్ధించును అని తెలిసికొని వారికి అనుకూలమైన అనగా సిద్ధ,సాధ్య సుసిద్ధ లలోని అరి(శతృ) నామాక్షరములను వదలి మిగిలిన నామాక్షరములు ప్రథమ అక్షరములు గల మంత్రమును జపించినచో శీఘ్రముగా దేవతానుగ్రహము పొందగలరు. అయితే నామాక్షరములతో పాటు జన్మనక్షత్రమునకు చెందిన అక్షరములు కూడా అనుకూలమైన మంత్రమును గ్రహించవలయును. ఈ అర్వణమును దాంపత్యము, కృషి, భూమి, గృహము, దేశము, గ్రామము, గురువు, మంత్రము, ప్రభువు, దేవత, యుద్ధము, వర్తకము మొదలగు విషయములకు పరిశీలన చేయవలయును. ఒక గృహమును నిర్మించిన తరువాత తన నూతన గృహమునకు నామకరణము (పేరుపుట్టుట)కు తన నామప్రథమాక్షరమునకు అనుకూలమైన అక్షరము ప్రథమాక్షరముతో కలిసి గృహనామము ఏర్పరచుకోవలయును. అర్వణచక్రమును స్థూలముగా నాలుగు విభాగములుగా విభజింతురు.

1.సిద్ధము 2సాధ్యము 3.సుసిద్ధము 4.అరి(శతృవు).మరల ఒక్కొక్క విభాగములో ఈ నాలుగువుంటాయి. సిద్దము, సాధ్యము, సుసిద్ధములలోని అరి కి వచ్చిన అక్షరములను గ్రహింపరాదు.అదే విధంగా అరి విభాగములోని సిద్ధ,సాధ్య,సుసిద్ధ,అరి మొత్తము కూడా పరిత్యజించవలయును.

సిద్ధచక్రములోని సిద్ధము నందలి నామ ప్రథమాక్షరము గల మంత్రము జపమువల్ల సిద్ధించును. సాధ్యము రెండింతల కృషి వలన సిద్ధించును. సుసిద్ధములోని స్మరించిన ఫలించును. అరి దరిద్రమును కలుగ చేయును. సాధ్యచక్రములోని సిద్ధము సాధ్యమగును. సాధ్యములోని సాధ్యము నందలివి ప్రయత్నించితేనే ఫలించును. సాధ్యములోని సుసిద్ధము స్మరించిన సిద్ధించును. అరి జ్ఞాతిహానిని కలుగచేయును. సుసిద్ధ చక్రములోని సిద్ధము ఫలించును. సాధ్యము క్రమముగా ఫలించును. సుసిద్ధము క్షణములో ఫలించును. అరి సోదరులకు హానిని కలిగించును. అరి చక్రములోని సిద్ధము పుత్రునకు హాని కలిగించును. సాధ్యము తల్లికి హాని కలిగిం చును. సుసిద్ధము భార్యకు హానిని కలుగచేయును. కావున సిద్ధ,సాధ్య,సుసిద్ధ చక్రముల యందలి సిద్ధ,సాధ్య,సుసిద్ధలకు చెందిన అక్షరములలో తనకు కావలసిన మంత్ర, గ్రామ, ప్రభువు, ప్రథమాక్షరము ఉండెనేని ప్రశస్తమైనదని తెలుసుకోవలయును. ఈ మూడు చక్రములయందలి అరి గళ్ళను, అరి చక్రము యొక్క మొత్తమును తనుకోరిన అక్షరము ఉండెనేని అరిష్టముగా నుండునని తెలుసుకోవలయును. తల్లిదండ్రులు తమ నామా క్షరములకు శుభకరముగా వుండే అక్షరములను ప్రథమాక్షరంతో కూడిన నామములతో సంతానమునకు నామకరణం చేసిన చాలా శుభకరముగా వుండును.

ప్రక్క పేజీలో దీనికి సంబంధించిన పట్టికలు కలవు గమనించవలయును.

| నామప్రధమాక్షరం | సిద్ధ | | | | సాధ్య | | | | సుసిద్ధ | | | | అరి | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి |
| అ | అ క థ | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ | ఇ గ ధ | ఋ ఛ బ | ఏ ట ర | అం ణ ష | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ ల | అః త స ళ హ |
| ఆ | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ | ఇ గ ధ | ఋ ఛ బ | ఏ ట ర | అం ణ ష | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ ల | అః త స | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ | అ ళ క హ థ |
| ఇ | ఇ గ ధ | ఋ ఛ బ | ఏ ట ర | అం ణ ష | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ ల | అః త స | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ | క థ హ | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ | అ ఆ ఖ ద ళ |
| ఈ | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ ల | అః త స | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ | క థ హ | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ | ఖ ద ళ | ఋ ఛ బ | ఏ ట ర | అం ణ ష | అ ఆ ఇ గ ధ |
| ఉ | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ | క థ హ | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ | ఖ ద ళ | ఋ ఛ బ | ఏ ట ర | అం ణ ష | అ గ ధ | ౠ జ భ | ఐ ఠ ల | అః త స | ఆ ఇ ఈ ఘ న |
| ఊ | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ | ఖ ద ళ | ఋ ఛ బ | ఏ ట ర | అం ణ ష | అ గ ధ | ౠ జ భ | ఐ ఠ ల | అః త స | ఆ ఘ న | ఌ ఝ మ | ఓ డ వ | క థ హ | ఇ ఈ ఉ ఙ ప |
| ఏ | ఏ ట ర | అం ణ ష | అ గ ధ | ఉ ఛ బ | ఐ ఠ ల | అః త స | ఆ ఘ న | ఊ జ భ | ఓ డ వ | క థ హ | ఇ ఙ ప | ఋ ఝ మ | ఔ డ శ | ఖ ద ళ | ఈ చ ఫ | ౠ ౡ ఞ య |
| ఓ | ఓ డ వ | క థ హ | ఇ ఙ ప | ఋ ఝ మ | ఔ ఢ శ | ఖ ద ళ | ఈ చ ఫ | అ గ ధ | అం ణ ష | అ గ ధ | ఉ ఛ బ | ఌ ట ర | అః త స | ఆ ఘ న | ఊ జ భ | ఏ ఐ ఠ ల ౡ |
| అం | అం ణ ష | అ గ ధ | ఊ ఛ బ | ఌ ట ర | అః త స | ఆ ఘ న | ఊ జ భ | ౡ ఠ ల | క థ హ | ఇ ఙ ప | ఋ ఝ మ | ఏ వ డ | ఖ ద ళ | ఈ చ ఫ | ౠ ఞ య | ఐ ఓ ఔ ఢ శ |
| క | క థ హ | ఇ ఙ ప | ఋ ఝ మ | ఏ డ వ | ఖ ద ళ | ఈ చ ఫ | ౠ ఞ య | ఐ ఢ శ | అ గ ధ | ఉ ఛ బ | ఌ ట ర | ఓ ణ ష | ఆ ఘ న | ఊ జ భ | ౡ ఠ ల | ఔ అం అః త స |
| గ | అ గ ధ | ఉ ఛ బ | ఌ ట ర | ఓ ణ ష | ఆ ఘ న | ఊ జ భ | ౡ ఠ ల | ఔ త స | ఇ ఙ ప | ఋ ఝ మ | ఏ డ వ | అం థ హ | ఈ చ ఫ | ౠ ఞ య | ఐ ఢ శ | అః క ఖ ద ళ |
| చ | ఈ చ ఫ | ౠ ఞ య | ఐ ఢ శ | అః ద ళ | ఉ ఛ బ | ఌ ట ర | ఓ ణ ష | అ క ధ | ఊ జ భ | ౡ ఠ ల | ఔ త స | ఆ ఖ న | ఋ ఝ మ | ఏ డ వ | అం థ హ | ఇ గ ఘ ఙ ప |
| జ | ఊ జ భ | ౡ ఠ ల | ఔ త స | ఆ ఖ న | ఋ ఝ మ | ఏ డ వ | అం థ హ | ఇ గ ప | ౠ ఞ య | ఐ ఢ శ | అః ద ళ | ఈ ఘ ఫ | ఌ ట ర | ఓ ణ ష | అ క ధ | ఉ చ ఛ జ బ |

| నామ ప్రధమాక్షరం | సిద్ధ | | | | సాధ్య | | | | సుసిద్ధ | | | | అరి | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సిద్ధ | సాధ్య | సు సిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సు సిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సు సిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సు సిద్ధ | అరి |
| త | ఔ త స | ఆ ఖ న | ఊ చ భ | ౡ ఞ ల | అం థ హ | ఇ గ ప | ఋ ఛ మ | ఈ ఘ ఫ | అః ద ళ | ఈ ఘ ఫ | ౠ జ య | ఐ ఠ శ | అ క ధ | ఉ జ బ | ఌ ఝ ర | ఓ డ ఢ ణ ష |
| ద | అః ద ళ | ఈ ఘ ఫ | ౠ జ య | ఐ ఠ శ | అ క ధ | ఉ జ బ | ఌ ఝ ర | ఓ ఢ ష | ఆ ఖ న | ఊ చ భ | ౡ ఞ ల | ఔ ఢ స | ఇ గ ప | ఋ ఛ మ | ఏ ట వ | అం ణ త థ హ |
| ధ | అ క ధ | ఉ జ బ | ఌ ఝ ర | ఓ డ ష | ఆ ఖ న | ఊ చ భ | ౡ ఞ ల | ఔ ఢ స | ఇ గ ప | ఋ ఛ మ | ఏ ట వ | అం ణ హ | ఈ ఘ ప | ౠ జ య | ఐ ఠ శ | అః త థ ద ళ |
| న | ఆ ఖ న | ఊ చ భ | ౡ ఞ ల | ఔ ఢ స | ఇ గ ప | ఋ చ మ | ఏ ట వ | అం ణ హ | ఈ ఘ ఫ | ౠ జ య | ఐ ఠ శ | అః త ళ | ఉ జ బ | ఌ ఝ ర | ఓ ఢ ష | అ క థ ద ధ |
| ప | ఇ గ ప | ఋ ఛ మ | ఏ ట వ | అం ణ హ | ఈ ఘ ఫ | ౠ జ య | ఐ ఠ శ | అః త ళ | ఉ జ బ | ఌ ఝ ర | ఓ ఢ ష | అ క ధ | ఊ చ భ | ౡ ఞ ల | ఔ ఢ స | ఆ ఖ ద ధ న |
| బ | ఉ జ బ | ఌ ఝ ర | ఓ ఢ ష | అ క ధ | ఊ చ భ | ౡ ఞ ల | ఔ ఢ స | ఆ ఖ ద | ౠ ఛ మ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ౠ జ య | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న ప ఫ |
| భ | ఊ చ భ | ౡ ఞ ల | ఔ ఢ స | ఆ ఖ ద | ఋ ఛ మ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ౠ జ య | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ఌ ఝ ర | ఓ ఢ ష | అ క ధ | ఉ జ ప ఫ బ |
| మ | ఋ ఛ మ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ౠ జ య | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ఌ ఝ ర | ఓ డ ష | అ క ధ | ఉ జ ప | ౡ ఞ ల | ఔ ఢ స | ఆ క ధ | ఊ చ ఫ బ భ |
| య | ౠ జ య | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ఌ ఝ ర | ఓ డ ష | అ క ధ | ఉ జ ప | ౡ ఞ ల | ఔ ఢ స | ఆ ఖ ద | ఊ చ ఫ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ఋ ఛ బ భ మ |
| ర | ఌ ఝ ర | ఓ డ ష | అ క ధ | ఉ జ ప | ౡ ఞ ల | ఔ ఢ శ | ఆ ఖ ద | ఊ చ ఫ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ఋ ఛ బ | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ మ య |
| ల | ౡ ఞ ల | ఔ ఢ స | ఆ ఖ ద | ఊ చ ఫ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ఋ ఛ బ | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ | ఓ డ ష | అ క ధ | ఉ జ ప | ఝ మ య ఌర |
| వ | ఏ ట వ | అం ణ హ | ఇ గ ధ | ఋ ఛ బ | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ | ఓ డ ష | అ క ధ | ఉ జ ప | ఌ ఝ మ | ఔ ఢ స | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య ర ల |
| శ | ఐ ఠ శ | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ | ఓ డ ష | అ క ధ | ఉ జ ప | ఌ ఝ మ | ఔ ఢ స | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య | అం ణ హ | ఇ గ ధ | ఋ ఛ బ | ఏ ట ర వ ల |

| నామ ప్రధమాక్షరం | సిద్ధ | | | | సాధ్య | | | | సుసిద్ధ | | | | అరి | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి | సిద్ధ | సాధ్య | సుసిద్ధ | అరి |
| ష | ఓ డ ష | అ క ధ | ఉ ఙ ప | ఌ ఝ మ | ఔ ఢ స | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య | అం ణ హ | ఇ గ థ | ఋ ఛ బ | ఏ ట ర | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ వ ల శ |
| స | ఔ ఢ స | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య | అం ణ హ | ఇ గ థ | ఋ ఛ బ | ఏ ట ర | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ ల | అ క ధ | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ శ ష |
| హ | అం ణ హ | ఇ గ థ | ఋ ఛ బ | ఏ ట ర | అః త ళ | ఈ ఘ న | ౠ జ భ | ఐ ఠ ల | అ క ధ | ఉ ఙ ప | ఌ ఝ మ | ఓ డ వ | ఆ ఖ ద | ఊ చ ఫ | ౡ ఞ య | ఔ ఢ శ ష స |

ఈ పట్టికను ఉపయోగించుకొనుటకు ఈ క్రింది ఉదాహరణను గమనించండి. నాగలింగేశ్వరరావు అనువ్యక్తి రామగుండం అను గ్రామము నందు నూతనముగ నివాసము వుండవలయునని భావించినాడు ఆ రామగుండం గ్రామమునందు నివసిస్తే లాభకరముగా ఉండునా? లేదా?అని తెలుసుకొనుటకు 13 వ పేజీలోని నామ ప్రధమాక్షరకాలంలోని న అక్షరమునందలి సమాంతరముగా వ్రాయబడిన అక్షరములను పరిశీలించగా అరి చక్రములోని సాధ్య వరుసలో ర అను అక్షరమున్నది. అరి చక్రములోనున్న గ్రామ ప్రధ మాక్షరములలో గల వాటిలో నివాసము యోగ్యము కాదు.

అదే విధముగా గురుమూర్తి గుప్త గారు అనంతవరంలో గ్రామ నివాసం ఉండుటకు అనుకూలమా?కాదా? అని పరిశీలన చేయగా 12 వ పేజీలోని నామ ప్రధమాక్షరం గ నుండి పరిశీలన చేయగా అ అనుఅక్షరము సిద్ద చక్రములోని సిద్ద నందు అ అక్షరము ఉన్నది. అందు వలన అనంతవరం నందు నివసించుటకు యోగ్యమైనదిగా గ్రహించ వలెను.

ఈ విధానమునే మంత్రప్రధమాక్షరము లకు కూడా అన్వయించ వలయును. అయితే సిద్ద మంత్రములకు అర్వణము చూడనవసరము లేదు. వధూవరుల పొంతనకు నామ కరణములకు గ్రంధారంభ అక్షర ములకు ఈ పట్టికలను అనుసరించవలయును.

# వర్గారూఢము

వాస్తు శాస్త్రము నందు వర్గారూఢము వివాదాస్పదమైన అంశములలో చాలా ప్రధాన మైనది. ఈ వర్గారూఢము సరిగా అవగాహన చేసుకోలేక పోవడం ద్వారా గందరగోళ పరిస్థితి ఏర్పడినది. ఇటీవలి వాస్తు గ్రంథకర్తలు ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తూ అశుభ ఫలములు వ్రాస్తున్నారు. అవి చదవడానికి, వింటానికి, ఆలోచించటానికి చాలా బాధను కలిగించున్నది. శృతిమించిన అనారోగ్యములు, మందులకు మాననిజబ్బులు, ఆర్థిక ఇబ్బందులు, తగవులు, కలతలు, అపనిందలు, స్త్రీమూలకు ఇబ్బందులు, ఇంటి యజమాని మరణం, ఇంటియందు ఆడవారి పెత్తనము, జ్యేష్ఠకుమారుడు అసమర్థుడు అగుట, ఉద్యోగము లేకపోవుట, చదువునందు వెనుకబడిపోవుట, పుత్రుడికి మరణము, వియ్యాల వారితో కయ్యాలు, కోడళ్ళుకాపురానికి రాకపోవుట, విద్యుత్, రోడ్డు,అగ్ని ప్రమాదములు, వాహన సమస్యలు, కోర్టుల చుట్టూ తిరుగుట, అప్పులబాధలు, ఇంటి ఆడపడచులు భర్త ఇంటిని విడిచి పుట్టింటికి వచ్చుట, అల్లుళ్ళతో తగాదాలు, యజమానికి రెండవ వివాహం, పురుష సంతతి అత్తవారింటికి చేరుట, పురుషులు దుర్వ్యసనాలకు బానిసలగుట, స్వతంత్ర ఆలోచన శక్తి కోల్పోవుట, అంగవైకల్యము, మందమతుల వంటి పుత్రులు జన్మించుట, కుటుంబంలో గృహయజమానికన్నా ఆ యింటవుండే ఆడవారే కార్యనిర్వహణాదక్షులుగా ఉండుట, ఆడవారికి పేరుప్రతిష్టలు కలుగుట, స్త్రీలు స్వతంత్రంగా వ్యవహరించుదురు, దత్తత, ఇల్లరికము, వితంతువు ఆస్థిగా మారుట, సంఘములో పేరు ప్రతిష్ఠలు లేకపోవుట, పెళ్ళయిన కుమార్తెలు భర్తలను వదిలి పుట్టింటికి వచ్చుట ఇత్యాదిగా వారు తమ గ్రంథములో వ్రాస్తూవుంటారు. ఇదంతా వారు నివసించే దిశను బట్టే జరు గునట. వారు చెప్పే దిశలో నివసిస్తూంటే మిక్కిలి అదృష్ఠము పట్టుట, సంతృప్తి, సుఖ సంతోషాలు, పిల్లలు, భార్య బంధువుల రీత్యా సుఖశాంతులుండుట, వృత్తి,వ్యాపార,ఉద్యోగ రంగముల యందు మిక్కిలి అభివృద్ధి కలుగుట, మిక్కిలి సంపన్నులుగానూ, గొప్ప వనరులు కలవారుగానుండుట, స్థిర చరాస్థులు వృద్ధి చెందుట, పలుకుబడి, గౌరవాదాయములు కలవారుగా ఉండుట, సుఖభోగములు కలుగుట, భూములు ఆస్తులు వాహనములు అంతస్తులు గలవారుగా అగుట, వారి పిల్లలు మంచి ఉన్నతస్థాయిలో వుండుట, వృత్తి ఉద్యోగాభివృద్ధి కలుగుట, శతృనిర్మూలనకలుగుట, రాజకీయ వ్యాపారా భివృద్ధిపొందుట, పిల్లలు గొప్ప చదువులు కలిగి విదేశీయానము చేయుట ఈ విధముగా విపరీతమైన ఫలితములు కలుగును అని రాయుచున్నారు.

ఇది అంతయూ వారు చెప్పిన దిశలో గృహనిర్మాణము చేస్తే అని చెపుతున్నారు. పూర్వపుఋషులచే వ్రాయబడిన వాస్తు గ్రంథములలో వర్గారూఢము వలన ఇటువంటి ఫలితాలు పొందుతారు అని వారు రాయలేదు. మరి ఇటువంటి భయ భ్రాంతులు కలుగచేసే వ్రాతలు ఎందుకు. మానవునికి మూడు విధములైన కర్మలు 1. ప్రారబ్ద, 2. సంచిత, 3. ఆగామి అను మూడుకర్మలు ఉండును. మానవుడు అనేక జన్మల పరంపరగా పుడుతూ మరణిస్తాడు. అనేక జన్మలలో చేసుకున్న కర్మల ప్రభావం మానవుడి మీదవుం టుంది. మంచి కర్మలు చేసుకుని ఉంటే సౌఖ్యానందములు ధనధాన్య సంపదలతో ఆహ్లా దకర జీవనం చేస్తూ లోక కల్యాణకారకమైన పనులు చేస్తూ వుంటాడు. గత జన్మలో

దుష్కర్మలు ఎక్కువగా చేసుకునివుంటే వాటి ఫలితముగా అనేక కష్టనష్టములు ఎక్కువగా అనుభవించును. మంచి,చెడు కర్మలు అధికముగా ఉన్నవారు శుభము,అశుభము చేయు మిశ్రమ ఫలితములు అనుభవిస్తారు. అయితే కర్మల ఫలితము అంతా ఈ జన్మలోనే అనుభవించలేరు. ఈ జన్మలో అనుభవమునకు వచ్చే శుభ, అశుభ ఫలమును ప్రారబ్ధము అని అందురు. ఈ ఫలితములే కాకుండా రాబోవుజన్మలో అనుభవించుటకు వున్న ఫలితములను ఆగామి కర్మ అందురు. ఈ ప్రారబ్ధ,ఆగామి కర్మల ఫలితములు కాకుండా మూడవది వచ్చే జన్మలో అనుభవించటానికి నిలవవున్న కర్మను సంచితకర్మ అందురు. వీలుననుసరించి ఫలితములు మానవుడు అనుభవించుచుండును. కర్మ అనగా పని, పనిచేయుట వలన ఏర్పడిన ఫలితములనే కర్మ అనుచున్నాము. ఈ కర్మల ఫలితములు గత జన్మలో చేసిన పనుల యొక్క ఫలితము. మరి ఈజన్మలో కూడా పనులు (కర్మలు) చేస్తూవున్నాము. మరి ఈ కర్మలకు ఫలితం లేదా? ఈ జన్మలో చేసిన కర్మఫలము ఈ జన్మలోనే అనుభవించలేమా? ఈ జన్మలో చేసిన కర్మకు ప్రతిఫలము ఏ స్థాయిలో ఉండును అనే ఆలోచన సాధారణముగ చేయుచుందురు. ఈ జన్మలో చేసిన కర్మల ప్రభావం ఈ జన్మలోకూడా అనుభవమునకు వచ్చును. గత జన్మల కర్మల వలనను ఈ జన్మల కర్మల వలనను పొందే ఫలము మొత్తము 7 భాగములుగా వుండును. గత జన్మలో చేసిన కర్మఫలమును అనుభవించుటకు ఈ జన్మలో లభించు అనగా ప్రారబ్ధ కర్మ ఫలముమొత్తము 7 భాగములలో 3 భాగముల ఫలముండును. అనగా ఈ జన్మలో అనుభవించుటకు గతజన్మల పరంపరాగతంగా వచ్చిన కర్మఫలము 3 భాగములుగా వుండును . మొత్తము కర్మ 7 భాగములు అయితే ప్రారబ్ధముగా ఈ జన్మలో అనుభవించే కర్మఫలము 3 భాగములు అయితే మిగతా4 భాగముల కర్మఫలము ఈ జన్మలో చేసుకొనిన కర్మల ఫలము. అనగా గత జన్మలో చేసుకున్న ఫలము 3కన్నా ఈ జన్మలో చేసుకున్న కర్మఫలము (4) అధికముగదా. ఈ జన్మలో మనం చేసుకునే మంచిపనులు , పూజలు, ప్రాయశ్చిత్తము, దానములు మొత్తము వాటిచే పొందుఫలము ఈ జన్మలో చేసినది 4 భాగములు వంతుగా వుంటే గత జన్మల ఫలమైన 3 భాగములు కన్నా ఈ జన్మలో చేసిన కర్మఫలము 4 భాగాలు కాబట్టి ప్రారబ్ధకర్మను అధిగమించి మనం అనుకున్న విధముగా మన జీవితమును మలుచు కోవచ్చును. మొత్తం కర్మఫలము 7 భాగాలు అయినప్పుడు ఈ జన్మలో చేసిన కర్మకే ఎక్కువ విలువవున్నది కావున మనము ప్రారబ్ధకర్మను అధిగమించగలము. అయితే సాధారణముగా ఈ జన్మలో చేసిన కర్మల ఫలము మొత్తము 4 భాగాలు పూర్తిగా ఫలం లభించే అంతస్థాయిలో చేయగలగాలి. చాలామంది పూజలు, వ్రతాలు, దానాలు, ప్రాయ శ్చిత్తాదులు, త్రికరణ శుద్ధిగా చేయకపోవుట వలన ఈ కర్మల ఫలము 1లేదా 2 భాగాలకే పరిమితమవుతున్నది. అందువలన జాతక గ్రంధాలలో చెప్పిన శుభఫలితాలు అనుభవ మునకు రాకుండును. ఈ జన్మలో కర్మ ఫలము 3భాగాలు వంతు పొందినా, ప్రారబ్ధ కర్మఫలము 3భాగాలు, ఈ జన్మకర్మఫలము 3 భాగాలు అయితే రెండూ సమానమ వుతాయి. అప్పుడు మిశ్రమ ఫలితాలు వస్తాయి. ఆ విధంగా కాకుండా ఈ జన్మలో చేసే కర్మను త్రికరణశుద్ధిగా శాస్త్రములో చెప్పబడిన రీతిన మంచికర్మలు చేయటం, పూజలు, జపాలు, హోమాలు, వ్రతాలు, దానాలు, ప్రాయశ్చిత్త పనులలో ఫలము మొత్తం 4భాగాలు అయితే మన

జన్మను మనకు నచ్చిన విధంగా మలచుకోవచ్చు. ఎందువలనంటే మొత్తం కర్మ 7 భాగాలు అయినప్పుడు ప్రారబ్ధ కర్మఫలము 3భాగాలు, ఈ జన్మకర్మఫలం 4 భాగాలు అయితే ఈ జన్మకర్మ ప్రభావం అధికంగా వుంటుంది. ప్రారబ్ధ కర్మలలోవున్న చెడుఫలితములు నశించును. బ్రహ్మదేవుడు రాసిన గీతను ఎవరు చెరపలేరు. మనకు ఏది రాసిపెట్టితే అదే జరుగుతుందిగా, మనము అనుకున్నట్టు ఏమీచేయలేము. మనం చేసే కర్మ ప్రభావం ఏదీ ఉండదు. అంతా బ్రహ్మరాసినట్టే జరుగుతుంది. విధి లిఖితము ఎవరూ తప్పించలేరు అను మాటలు ప్రజలు సామాన్యముగా అనుకుంటూ ఉంటారు. అలా అయితే మహర్షులు ఈ జాతకశాస్త్రమును ఎందుకు రచించినట్లు? జరుగపోయే చెడుఫలితమును ముందుగా తెలుసుకొని మనిషి క్రుంగిపోవుటమే కదా? మనిషి నిస్సత్తువుగా వుండే దానికి ఈ శాస్త్రందేనికి, అనుసందేహం కలుగుతుంది. మన తలరాతను మనమే రాసుకునే అంతటి స్థాయిలో ఈ జన్మలకర్మలను చేసుకోవచ్చును అని మహర్షులు తెలిపినారు. అందుకొరకే జాతకశాస్త్రంను లోకక్షేమము కొరకు మహర్షులు నవగ్రహాల ఫలితములు, నవగ్రహాములను ప్రీతిచెందింపచేసి, శాంతి చేయించి ఆయా గ్రహాల అనుగ్రహాన్ని పొందితే దోషఫలితాలు ఇవ్వాలనుకున్న గ్రహములు శుభఫలితములు ఇవ్వగలవు. ఒక అధికారి ఒకవ్యక్తిపై కోపతాపములు కలిగి వున్నప్పుడు ఇచ్చే ఫలితముల తీవ్రత వేరుగా ఉంటుంది. ఆ వ్యక్తే ఆ అధికారి తనమీద కోపంగా ఉండుటకు కారణమేమి, తాను ఏమిచేస్తే ఆ అధికారికి కోపం వచ్చింది అను విషయం తెలుసుకొని మన చర్యల ద్వారా ఆ అధికారి కోపం తొలగి ప్రశాంతచిత్తుడు అయినప్పుడు ఇచ్చే ఫలితములు వేరుగా ఉంటాయి. అందువలననే మహర్షులు గ్రహాల ప్రభావం తెలిపే జ్యోతిషశాస్త్రమును మానవులయందలి దయచే అనుగ్రహించినారు. మహర్షుల పద్ధతి ప్రకారం నడుచుకునేవారికి 100శాతం నష్టం కలిగించే విషయంలో 10 శాతమో 15 శాతమో మాత్రమే నష్టం కలుగుతుంది. మిగతా 90 శాతం శిక్ష అనగా చెడుకర్మల ప్రభావమునుంచి మనము తప్పించుకొని మనసుకు ఉపశాంతి ఏర్పడినట్లేగదా! ముందుచూపు కలిగినవారు ఈ మానవజీవితముద్వారా ధర్మ,అర్థ,కామ,మోక్షము అనే చతుర్విధ కర్మలలో చివరిదైన మోక్షమునకు తగినబాట వేసుకో గలుగుతారు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకునేవారు ఈ చతుర్విథ పురుషార్థములలో మొదటి మూడుఅయిన ధర్మ, అర్థ, కామముల వరకే పరిమితమైపోతారు. జన్మ పరంపరను తగ్గించుకొని మోక్షానికి దగ్గరగా రాలేరు.

కావున జాతక ఫలితములను 12 భావములుగా విశ్లేషణ చేస్తారు. ఆ 12లో గృహము అనేది 4వ భావం అవుతుంది. గృహము ధర్మార్థకామమోక్షములకు ఇది ఒక సాధనము మాత్రమే. ఈ నాల్గవ భావము ఒక్క గృహసౌఖ్యమే కాకుండా తల్లి, భూములు, చదువు, నీరు ఇత్యాదిగా అనేక కారకత్వములును గురించి తెలుపును. కావున మనము నిర్మించుకునే గృహము మన జాతకమునకు అనువైనదిగా ఉండాలి. మనము గృహము ఏదిశయందు నిర్మించుకోవాలి. ఏ విధంగా నిర్మించాలి అనేది జాతకమందలి గృహభావం తెలుపుతుంది. అందు వలననే దైవజ్ఞ విలాసమనే గ్రంథములో మనము ఎటువంటి గృహము అనగా ఏదిశలో గృహము నిర్మించుకోవాలి అని తెలుపబడినది.

శ్లో॥ జన్మలగ్నాంశ రాశీశ, మిత్రస్థాన కృతే గృహే ।

ఐశ్వర్యం సంతతించాయు, శ్చిరం తత్రలభే ద్గృహే ॥

తాత్పర్యం:- యజమాని యొక్క జన్మలగ్నసవాంశాధిపతులగు గ్రహములకు మిత్ర గ్రహములు ఆధిపత్యము వహించిన దిక్కునయందు గృహములను నిర్మించిన సంపద-సంతానము-ఆయుర్వృద్ధి కలుగును అని కశ్యపమహర్షి తెలిపిన వచనమును తెలిపెను. అదే విధముగ జన్మలగ్నమునకు మాదిరిగానే జన్మరాశ్యాధిపతికి మిత్రగ్రహములు ఆధిపత్యము వహించు దిశలయందు నివాసయోగ్య మగును. జన్మలగ్నమునకుగాని, జన్మ రాశ్యాధిపతికిగాని, త్రికోణస్థానాధిపతులగు గ్రహములు మిత్రగ్రహములు అగుదురు. అట్టి మిత్రగ్రహములు ఆధిపత్యం వహించిన దిశలయందు గృహమును నిర్మించవలయును. రవి-తూర్పు, శుక్రుడు- ఆగ్నేయము, కుజుడు-దక్షిణము, రాహువు-నైఋతి, శని-పశ్చిమము, చంద్రుడు-వాయువ్యము, బుధుడు-ఉత్తరము, గురుకేతువులు- ఈశాన్యమునకు ఆధిపత్యము వహించియున్నారు.

ఈ విధముగ లగ్న, రాశ్యాధిపతుల మిత్రగ్రహాల దిక్కులలో గృహమును నిర్మించుకొనిన తరువాత గృహయజమాని ఆ ఇంటికివున్న అష్టదిక్కుల యందలి గదులలో తను ఏదిక్కున శయన గృహము ఏర్పరచుకోవాలి. తను వృత్తి ధర్మము చేయుటకు అనగా ఏపనిచేయుటకు లేదా ఇతర లావాదేవీలకు ఏదిక్కున చేస్తే తనకు అనుకూలముగా వుంటుంది అని చూచుకోవటానికి తన జన్మనక్షత్రము లేక తననామమును అనుసరించి అనుకూలమైన దిక్కును నిర్ణయించుటను వర్గారూఢము అందురు. అనగా ఇది గృహము నిర్మితమైన తరువాత గృహప్రవేశము అయిన తరువాత ఆ నూతన గృహములో నివసించునప్పుడు పరిశీలించవలసిన విషయము. ఈ మర్మమును తెలుసుకోలేక గృహము ఏ దిశలో నిర్మించాలి అనువిషయములో దీనిని పరిశీలించి ఆచరిస్తున్నారు. ఈ విధానం దైవజ్ఞ విలాసము గ్రంధమునందు చెప్పబడిన దానికి విరోధముగానున్నది.

ఈ విధముగా అక్షర సమామ్నాయ అష్టదిక్కులకు చెప్పబడినది. దీనిననుసరించి

| ఈశాన్యం | తూర్పు | ఆగ్నేయం |
|---|---|---|
| శ వర్గు-కుందేలు<br>ఈశానుడు అధిపతి<br>శ,ష,స,హ,క్ష | అ వర్గు-గరుడ<br>ఇంద్రుడు అధిపతి<br>అ నుండి అః వరకు | క వర్గు-పిల్లి<br>అగ్ని అధిపతి<br>క,ఖ,గ,ఘ |
| ఉత్తరం: య వర్గు-ఏనుగు<br>కుబేరుడు అధిపతి<br>య,ర,ల,వ | బ్రహ్మ స్థాన<br>క్షేత్రం | చ వర్గు-సింహం<br>యముడు అధిపతి<br>చ,ఛ,జ,ఝ,ఞ :దక్షిణం |
| ప వర్గు-ఎలుక<br>వాయువు అధిపతి<br>ప,ఫ,బ,భ,మ | త వర్గు-పాము<br>వరుణుడు అధిపతి<br>త,థ,ద,ధ,న | ట వర్గు-కుక్క<br>నిఋతి అధిపతి<br>ట,ఠ,డ,ఢ,ణ |
| వాయువ్యం | పడమర | నైఋతి |

గృహమునందు కార్యస్థానము ఏర్పరచు కొనవలయును.

ఆ విధముగా గాక గృహ యజమాని నామములోని ప్రథమాక్షరము ఏ దిశకు చెందినదో తెలుసుకొని గృహకర్తకు ఆ నామ ప్రథమాక్షర దిక్కునందు గృహము నిర్మించుట శ్రేష్ఠము అని భావించుట పొరపాటు. ఈ విధముగా అయితే ఆ గ్రామములో గాని పట్టణములోగాని, నగరము నందుగాని, వీధియందుగాని ఒకేవర్గునకు చెందిన వారందరు ఒకే దిశలోనే నివసిస్తున్నారా? ఆ దిశలోనే అనేక వర్గులలో చెప్పిన వారందరు నివసించుటలేదా? ఆ దిశ ఏ వర్గునకు చెందినదో ఆ వర్గువారు మాత్రమే సుఖసంతోషములతో వుండి మిగతావారు కష్టనష్టములు అనుభవించు చున్నారా? మరి ఆ విధముగా లేదే. మరి ఇది ప్రాముఖ్యమైన విషయమైతే విశ్వకర్మ వాస్తుశాస్త్రము లాంటి గ్రంథములందు చెప్పబడలేదుగదా. గ్రామములు గాని, వీధులలోగాని అందరికి వారి వర్గుననుసరించి ఇంటిస్థలములు లభించునా? అను విషయమును ఆలోచించవలసివున్నది. ఆ విధముగా చెప్పినట్లయితే గ్రామములో ఇల్లు నిర్మించే వారు వీధిపంక్తిననుసరించి గృహమును నిర్మించు కోవాలి. వీధిశోభ కాపాడవలెను అని ఎందుకు చెప్పినట్లు వీధిశోభ చెడిపోకూడదు, వీధిననుసరించి నిర్మించాలి అంటే అప్పుడు ఈ వర్గారూఢము ననుసరించి ఒక్కొక్కరు ఒక్కొక్క సింహద్వారం ముఖముగా గలిగిన ఇండ్లు ఏర్పడుతున్నవి. మరి మహర్షులు పరస్పర విరుద్ధమైన మాటలు ఎందుకు చెబుతారు. వాస్తుశాస్త్రానికి ప్రామాణిక గ్రంథమైన విశ్వకర్మ వాస్తుశాస్త్రములో వర్గారూఢం ననుసరించి గృహనిర్మాణము చేయమని చెప్పలేదుకదా.

కావున గృహములోని కుటుంబ సభ్యులు తమ నామాక్షరానికి అనుకూలమైన దిక్కులలో వారి వారి పనుల కార్యస్థానములు చేయుటకు అవసరమైన దిక్కుల నిర్ణయమును గృహ నిర్మాణమునకు తీసుకొనుట ద్వారా వాస్తుశాస్త్రమును గందరగోళంగా మార్చినారు, ఇంటికి సింహద్వార నిర్ణయించుటకు అనేక విధములుగా చెప్పినారు. నామాక్షరములను బట్టి, జన్మరాశినిబట్టి కూడ సింహద్వారనిర్ణయం చెప్పబడినది. అదే విధముగ వాస్తు పురుషుని శయన విధానం ననుసరించి సింహద్వార నిర్ణయము చెప్పబడినది. నామాక్షర వర్గారూఢమును అనుసరించి సింహద్వారం ఉండాలి అని అయితే క,ట,ప,శ వర్గులవారు తమ గృహములకు సింహద్వార ఏ దిశలో పెట్టుకోవాలి. గృహాలను కూడ విదిక్కులకు అనగా ఆగ్నేయ, నైఋతి, వాయువ్య, ఈశాన్య దిక్కులందు నిర్మించుకోవాలి గదా. ఆ విదిక్కులకు అనుగుణంగా మూలలయందు సింహద్వారముంచాలి. అవి ఆ వర్గులవారికి స్వక్షేత్రములు గదా. కాని శాస్త్రమునందు విదిక్కున నివాస గృహములను నిర్మించుటను వ్యతిరేకించినది. దీనిని బట్టి గృహములను వీధులన నుసరించి వీధివైపు మాత్రమే సింహద్వారం ఉండ వలయును అనునది శాస్త్రనిర్ణయము. ఒకవేళ వీధులు సక్రమముగా లేక అనేక వంకరలు వుండినను వీధిననుసరించే గృహనిర్మాణం చేయాలి. ఆ వీధిననుసరించే మిగతా దిక్కులు నిర్ణయించాలి. అంతేగాని దిక్సూచిని అనుసరించి గృహనిర్మాణము చేస్తే పంక్తి శోభ చెడిపోవటమే కాకుండా పోటులు, వీధిశూల దోషములు వస్తాయి. ఈ విషయము వాస్తుడిండిమమ్ గ్రంథంలో కూడా చెప్పబడినది. బుద్ధిమంతులైన వాస్తు ప్రచారకులు గృహనిర్మాణ విషయమై శ్రేణి ధర్మమును, భూస్థితిని విడచి అనేక పట్టణముల యందును, గ్రామముల యందును, పల్లెల యందును గల ఇండ్ల యొక్క

స్థితికి సరిపడని దిక్సూచీ యంత్రమును ఉపయోగించరాదు అని పేర్కొనబడినది.

నామ ప్రథమాక్షరం బట్టి దిశానిర్ణయం చేసి సింహద్వారం ఏర్పరచేటట్లయితే విశ్వ కర్మ ప్రకాశికలో జాతిపరముగ ఆయ నిర్ణయం చెప్పరాదుగదా! బ్రాహ్మణ వర్ణములోని వారందరి పేర్లు ధ్వజాయ సంబంధ అ వర్గునకు చెంది వుండవుగదా! బాహ్మణ గృహము లకు ధ్వజాయము శ్రేష్ఠము. క్షత్రియులకు సింహాయము శ్రేష్ఠము. ఉత్తర ముఖము గల గృహము శ్రేష్ఠము. వైశ్యులకు వృషభాయము శుభప్రదమైనది. తూర్పు ద్వారము గల గృహము ఉత్తమమైనది. శూద్రులకు గజాయము మంచిది. దక్షిణ ద్వారము గల గృహము శుభప్రదమైనది. ధ్వజాయము క్షత్రియులకు, వైశ్యులకు కూడా శ్రేష్ఠమని బృహస్పతి తెలిపెను. వృద్ధి కాములగు బ్రాహ్మణులు సింహాయ గృహమును విసర్జించవలెను. సింహాయ మందు తీవ్రత, అల్ప సంతానము కల్గును. ధ్వజాయము సిద్ధిని కలిగించును. వృషభా యము పశువృద్ధినిచ్చును. గజాయము సంపదలనిచ్చును. మిగిలిన ఆయములు దుఃఖ శోకములు కలుగచేయును అని తెలుపబడినది.

**శ్లో ॥ యోనిః ప్రాణాపవ ధామ్నాం మదస్మా । ద్గాహ్య స్తత్తద్యోగ్య యోని ప్రభేదః ॥**

తా॥ అనగా సర్వ గృహాది నిర్మాణములకు యోని (ఆయము) (ధ్వజాది ఆయములు ) ప్రాణము వంటివి. కావున తత్తద్యోగ్యమైన యోని భేదమును గ్రహించి నిర్మాణములు చేయవలయును. ఆయ నిర్ణయమును గృహములకు, ప్రాసాదములకు మాత్రము గాక, స్థంభములకు, ద్వారములకు, వాతాయనములకు,ఇతర గృహద్రవ్యములకు, ప్రతిమలకు, బింబములకు, లింగములకు, చిత్రపటములకు, మొదలగు సర్వ ద్రవ్యములకు, కూడా చూడవలయునని వాస్తు శాస్త్ర కర్తలగు మహర్షులుతెలిపియున్నారు.

ఏదైనానొక నిర్మాణమును ధ్వజాయముతో నిర్మించదలచినప్పుడు దానికి సంబంధించిన ఇతర పరికరములు (ద్వారములు గవాక్షములు, వాతాయనములు, స్థంభములు మొదల గునవి ) కూడా ధ్వజాయముతో నిర్మించుట శ్రేష్ఠము అనగా ఆ ఇంటికి సంబంధించిన సమస్త వస్తువులు ఒకే ఆయముతోఉండుటశ్రేష్ఠం.

కావున పైవిషయములన్నింటిని పరిశీలన చేయగా యజమాని నామ ప్రథమాక్షరము వర్గారూఢము నందు ఏదిశను తెలుపుతుందో ఆదిశ యందు సింహద్వారం వుంచకూడదు అని స్పష్టమగుచున్నది. గృహములోని వ్యక్తులు వారువారు తమ కార్యస్థానములను అందరు గృహమునందు ఒక్క చోటనే చేయుట తగదు కాబట్టి మరియు గృహములోని కుటుంబ సభ్యులందరికీ ఒకే నామము ఉండదు కాబట్టి వారి వారి నామ ప్రథమాక్షరమును బట్టి అనుకూల దిక్కును నిర్ణయించుకుని పనిపాటలు చేసుకునెదరు.

దీనికొరకు ముహూర్త సుధాసార సంగ్రహమునందు దిగ్వరణము పంచాశద్వర్ణములలో అ-క-చ-ట-త-ప-య-శ యీ వర్గాక్షరములు తూర్పు దిక్కు మొదలుగా ఎనిమిది దిక్కులకు అధిపతులుగాన ఎవని యొక్క నామ ప్రథమాక్షరము ఏ దిక్కువర్ణమై యందుం దునో అది స్వవర్గు. స్వవర్గు నుండి ప్రదక్షిణ క్రమముగా 1. జయము, 2. అరవీసము, 3. వీసము, 4. వీసన్నర, 5. కలహము, 6. శతృపీడ 7. సంతతి, 8. మరణము అని వర్గులకు ఫలము తెలుపబడినది. దీనిని అనుసరించి దిశార్ణవము వివరింపబడుచున్నది.

## ధ్వజాయ గృహము

### అ వర్గువారు అ నుండి అః వరకు

ఆంజనేయులు,ఇంద్ర,ఈశ్వరరావు,ఉమామహేశ్వరరావు,ఊర్వశి, ఋష్యేంద్రమణి, ఏకాంబరేశ్వరరావు,ఓంకారయ్య,ఔరంగజేబు మొదలగు నామములవారికి ఈ విధముగా ఫలములుదును.

1. తూర్పు = బంధుమిత్రుల స్నేహము, ధనధాన్యలాభం కలుగును.
2. ఆగ్నేయం = సామాన్యలాభము వుండును, దుర్గుణములుండవు.
3. దక్షిణము = భోగభాగ్యములు, ధనసౌఖ్యకీర్తులు
4. నైఋతి = దరిద్రత, రోగము,ఎల్లప్పుడు వైద్యసహాయం
5. పడమర = శతృస్థానము, అనర్థము,దరిద్రము
6. వాయువ్యం = కలహము,రాచకార్యనష్టము,హానికలుగును
7. ఉత్తరము = చాలాలాభదాయకము, కార్యసిద్ధి
8. ఈశాన్యము = రోగభయము, చాలాదరిద్రము కలుగును.

శుభఫలములు లభించు దిశలయందు ఇంటిలో కార్యస్థానమును ఏర్పరచు కొనవలయును.

### క వర్గువారు - క,ఖ,గ,ఘ,ఙ

కనకారావు,ఖడ్గేంద్రుడు,గంగయ్య,ఘనశ్యామ,జ్ఞానానందం. ఈ ప్రథమాక్షరములకు ఏత్వములు,ఓత్వములు,ఔత్వములు వున్నను క వర్గుగానే వర్తించును.

1. ఆగ్నేయము = ప్రభుమిత్రత్వము,ధనలాభము,కార్యదీక్ష
2. దక్షిణము = ధనలాభము,సకలసౌఖ్యములు,కార్యసిద్ధి
3. నైఋతి = అధికలాభదాయకము,సుఖసౌఖ్యములు కలుగును.
4. పడమర = రోగము,బాధలు,దారిద్రము,పదవులనుకోల్పోవుట
5. వాయువ్యం = అకారణముగా ధనము నశించుట,శత్రుబాధ
6. ఉత్తరము = రాజకీయ అవమానములు,ధననష్టము
7. ఈశాన్యము = సర్వసౌఖ్యములు సిద్ధి, ఇష్టకార్యసిద్ధి
8. తూర్పు = త్రిప్పుట,దరిద్రము,భ్రష్టత్వము

శుభఫలములు లభించు దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పరచుకొనవలయును.

### చ వర్గువారు - చ,ఛ,జ,ఝ,ఞ

చలపతి,ఛటోపాధ్యాయ,జగదీశ్వరరావు,ఝాన్సీరావు, ఈ 4ప్రథమాక్షరములు గలవారు.

1. దక్షిణము = ధనధాన్యములు విశేషలాభములు,ప్రజాకర్షణ,సుఖసౌఖ్యము లుండును.
2. నైఋతి = సామాన్యస్థితి, అపకారంవుండదు.
3. పడమర = భోగభాగ్యములు, బంధువులపోషణ, ధనము
4. వాయువ్యం = వ్యాధిభయము,ధనవ్యయము,కలహము
5. ఉత్తరము = శతృబాధ,ఋణబాధ
6. ఈశాన్యము = కలహము,శరీరరోగములు, ధననష్టము

7. తూర్పు = సంరక్షణ బాధ్యతలు, ఆడవారి పెత్తనములు, సంపదలు కలుగుట
8. ఆగ్నేయము = దరిద్రము, మృత్యుభయము,ధనలాభము
శుభఫలితములు లభించగల దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పటు చేసు కొనవలెను.

**ట వర్గువారు ట-ఠ-డ-ఢ-ణ** నామ ప్రథమాక్షరములు గలవారు

టపాదాస్,ఠాగూరు,డమరసింగ్, ఢమరుక
1. నైఋతి = విశేష ధన సంపద, ఆరోగ్యసౌఖ్యములు
2. పడమర = సామాన్యస్థితి
3. వాయువ్యం = సకల సౌఖ్యములు, లాభములు
4. ఉత్తరం = రోగప్రాప్తి,అర్భకత్వం, ధనలోభము
5. ఈశాన్యం = శత్రురోగము,ఋణదోషము
6. తూర్పు = కలహము,ధనవ్యయము, రాజ్యావమానము
7. ఆగ్నేయము = విశేష ధన సంపద, స్త్రీ ధనసంపద
8. దక్షిణము = మరణతుల్యమైన దరిద్రము,భయము
శుభఫలములు ప్రసాదించు దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పాటు చేసుకొనవలెను.

**త వర్గువారు - త, థ, ద, ధ, న** నామ ప్రథమాక్షరములు గలవారు
1. పడమర = ధర్మాదాయము, కీర్తి, సౌఖ్యం, సకలసంపద
2. వాయువ్యం = ధనలాభం, తానుచెడక ఇతరులను చెడుపుట
3. ఉత్తరం = విశేష ధనప్రాప్తి, సౌఖ్యము
4. ఈశాన్యం = రోగము,అర్భకత్వము,ధనలోభము
5. తూర్పు = శతృదోషము,ఆడపెత్తనము,ధనవ్యయము
6. ఆగ్నేయం = కలహము,రాజకార్యనష్టము,అపజయము
7. దక్షిణం = సకలైశ్వర్యములు, అధిక ధనసౌఖ్యము
8. నైఋతి = ఈతిబాధలు,ఋణబాధలు
శుభఫలితములు ప్రసాదించు దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పరచు కొనవలెను.

**ప వర్గువారు - ప ఫ బ భ మ** నామ ప్రథమాక్షరములు గలవారు
1. వాయువ్యం = బంధుపోషణ, ప్రభుత్వసహాయం
2. ఉత్తరం = కించిత్ ధనలోభం కలుగును.
3. ఈశాన్యం = ఆరోగ్యము,సౌఖ్యము,సామాన్య ధనలాభము
4. తూర్పు = రోగభయము,వైద్యసహాయము, ధనవ్యయము
5. ఆగ్నేయము = శతృభయము, ధనన్షము, స్త్రీ స్వతంత్రత
6. దక్షిణము = కలహము,రోగము,ధనవ్యయము
7. నైఋతి = సర్వసౌఖ్య సకల లాభములు కలుగును
8. పడమర = చాలా అనుకూలము, ధనసౌఖ్యము
శుభఫలితములు ప్రసాదించు దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పరచు కొనవలెను.

**య వర్గువారు - య ర ల వ** నామ ప్రథమాక్షరములు గలవారు

ఈ 4 ప్రథమాక్షరములు కలవారు యల్లారావు,రామారావు,లక్ష్మీనారాయణ,వరదాచార్యులు.

1. ఉత్తరము = ధనధాన్యవృద్ధి, స్వశక్తి, కీర్తి, సుఖము
2. ఈశాన్యం = ఋణబాధ,రోగబాధ,సామాన్యస్థితి
3. తూర్పు = అఖండ విజయము, స్త్రీధనప్రాప్తి
4. ఆగ్నేయము = రోగభయము, వ్యాజ్యభయము
5. దక్షిణము = శతృభయము,ఎదురీతగా నడుచుట
6. నైఋతి = ధనవృద్ధి, కలహములు
7. పడమర = యోగ్యమైనది, విశేష ధనసంపదలు
8. వాయువ్యం = దరిద్రము,భయము,స్త్రీలవల్ల సహాయము

శుభఫలితములు ప్రసాదించు దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పరచు కొనవలెను.

**శ వర్గువారు - శ, ష, స, హ** నామ ప్రథమాక్షరములు గలవారు

ఈ నాలుగు ప్రథమాక్షరములు నామము గలవారు

1. ఈశాన్యం = సామాన్యసౌఖ్యము,ధనలాభము కలుగును
2. తూర్పు = కన్యవర్గు,స్త్రీ ధనప్రాప్తి, సుఖము
3. ఆగ్నేయం = భోగభాగ్యములె, స్త్రీ అధికారము
4. దక్షిణము = ధనలోభము,రోగము,భయము వల్ల క్షయము
5. నైఋతి = కలహము, శతృభయము
6. పడమర = ఎల్లప్పుడు కలహములు,స్త్రీ అధికారములు
7. వాయువ్యం = ధనవ్యయము, తాపత్రయము ఎక్కువగానుండును
8. ఉత్తరం = ధనధాన్య భూలాభము కలుగును

శుభఫలితములు ప్రసాదించు దిక్కునందు ఇంటిలో కార్యస్థానము ఏర్పరచుకొనవలెను.

ఇంటికి సింహద్వారము నుంచుటకు అనేక పద్ధతులు వాస్తు శాస్త్రమునందు తెలుపబడినవి. వాటిలో ఒకటి వర్గారూఢము. వర్గారూఢము ఇంటియందు ఏ దిశలో కార్యస్థానం (ఆఫీసు,కార్ఖాన మొదలగునవి), శయనము ఏర్పరచుకొనుట ద్వార అధిక శుభ ఫలితములు పొందగలమన్న విషయం తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది వర్గారూఢము. కొందరు భ్రమలకులోనై ఇంటి నిర్మాణమునకు ఈ వర్గారూఢమును ప్రధానాంశముగా తీసుకొని గృహనిర్మాణములు చేయించు చున్నారు. అందువలన వాస్తు శాస్త్రముపై నమ్మకము సన్నగిల్లుచున్నది. ఈ రోజులలో దాదాపుగా స్థలం మధ్యలోనే ఇల్లును నిర్మిస్తున్నారు. ఇంటికి నాలుగు ప్రక్కల అవసరార్థం కొద్ది కొద్ది ఖాళీ స్థలములను వదలు కొనుచున్నారు. కావున వాస్తు పదగణితము ద్వారా లభించు ఆయములకు ప్రాధాన్యత ఇచ్చి గృహనిర్మాణము చేసుకొనవలయును. సింహద్వారం, వీధిననుసరించి, రాజబాటలు అనుసరించి, వాస్తుపురుష శయనం అనుసరించి సమన్వయముతో నిర్ణయించు కొనవలయునని తెలియుచున్నది.

వర్గారూఢమును యజమాని నామములోని ప్రథమాక్షరమును బట్టి గృహదిశను నిర్ణయిస్తున్నారు. కుటుంబములోని సభ్యులందరికీ పేర్లు యజమాని నామానుకూలముగా వుండకపోవచ్చును. అప్పుడు గృహములోని సభ్యులందరికి ప్రయోజనములు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా వుంటాయి కదా. ఆవిధంగా ప్రయోజనములు విభిన్నముగా వుండే టట్లయితే దివ్యజ్ఞాన సంపన్నులు అయిన మహర్షులు ఈ వర్గారూఢమునుబట్టి ఇల్లు కట్టుకోవాలని చెప్పరుకదా. కాబట్టి గృహమునందలి సభ్యులు వారివారి దిశార్వణమును బట్టి గృహమునందు ఎవరు ఏదిశయందు నివసించాలి, కార్యస్థానము ఏర్పరచుకోవాలి. అనుదానికి ఈ దిశార్వణము చెప్పబడినది. అనగా ఇల్లు కట్టుకొన్న తరువాత నివాసము వుండడానికి చెప్పిన విషయమును గృహము కట్టుకోవడానికి అన్వయించుటవలన ఈ సందిగ్ధత ఏర్పడుచున్నది. ఒకే దిశలోని గృహముల యజమానులందరి నామములు అందరివి అదే వర్గునకు చెందియుందుటలేదు, పైగా వారందరూ సుఖసంతోషములతో కూడియుంటున్నారు కదా. ఇది మనకు స్పష్టముగా అనగాహన మవుచున్నది. ఇది కాస్మిక వాస్తుకు విరుద్ధమైనది. మహర్షులచే చెప్పబడనిదానికి కొందరు అపోహపడుటవలన వాస్తుశాస్త్రము అపహాస్య పాలవుటకు, విమర్శలకు నెలవుఅయినది అని గ్రహించగలరు. వాస్తు డింధమమ్ గ్రంధకర్త కాలనాధభట్టి వారిచేత కూడా ఆక్షేపింపబడినది.

## వాస్తుపద నిర్ణయము

ఏదైనా ఒక కొలత కొలవాలంటే ఆ కొలతను ఏదో ఒకస్థానము నుండి ప్రారంభించ వలసివున్నది. కొలవబడే స్థానమును గురించి శ్రద్ధ చూపించవలసిన ఆవశ్యకత వుంది. కొలతను సరియైన రీతిలో శాస్త్రీయముగా కొలవకపోతే దానివలన అనర్ధములు ఏర్ప డుతున్నవి. జ్వరమానినుపయోగించి జ్వరము ఏ స్థాయిలో వున్నది తెలుసుకొనుచున్నాము. ఆ జ్వరమానిని నిర్మించేటప్పుడు ఎన్నో జాగ్రత్తలు తీసుకొని వుంటారు. దానిపై సూచించే డిగ్రీలను సరియైనరీతిలో ప్రింటు చేయబడివుంటాయి. అందువలన మార్కెట్లో లభించే ఏ ధర్మామీటరును వాడినా అన్ని ప్రదేశాలలో, అందరు ఒకే జవాబు చెబుతారు. ధర్మా మీటరుపై సూచించబడే సమాచారం ఫారన్ హీట్స్‌లోను, సెంటిగ్రేడ్ డిగ్రీలలోను తెలుసు కొనవచ్చును. ఏ విధానం వాడినా సమాధానం ఒకే రకంగా రావాలి. ఆ విధంగా రాబ డిన దానిపైనే విశ్వసనీయత ఏర్పడుతుంది. గృహమును కొలవటానికి ప్రారంభించే బిందువు ఎక్కడ నుంచి ప్రారంభించాలి అనే విషయముపై పరస్పర విరుద్ధ అభిప్రాయ ములు వున్నవి. ఏకాభిప్రాయము లేకపోవుటవలన ఖచ్చితమైన పదనిర్ణయము చేయలేక పోవుచున్నాము. ఒకపదము అని నిర్ణయించి ఏకాదశవర్గులు కట్టగా వచ్చిన సమాధా నమునకు మరొక పండితుడు నిర్ణయించిన వర్గులకు పొంతన వుండుటలేదు. అందువలన మంచిపదము అని నిర్ణయించి వర్గులు కట్టిన పదము అశుభపదములవుచున్నవి. అశు భమైన పదము అని వదిలేసినది శుభప్రదమైన పదము అవ్వచ్చును. ఈ విధగా స్థిరమైన కొలమానం లేకపోవుటవలన గృహాయము నిర్ణయించి గృహనిర్మాణం చేయగా అనుకున్న

ఫలితములు లభించుటలేదు. అనుభవమునకు సరియైన ఫలితములు రావడంలేదు. మార్కెట్లో ధర్మామీటరు ఎవరు తయారు చేసిన కొన్ని ప్రామాణికతలతో తయారు చేస్తున్నారు కాబట్టి జ్వరనిర్ణయములో తేడా కనబడుటలేదు. మరి అటువంటి ప్రామాణికత ఏర్పరచుటలో వాస్తు పండితులు వెనుకంజలో వుండిపోవుచున్నారు. ఏ కొలత తీసుకొనినను నిర్మాణ భేదంతో సంబంధం లేకుండా సార్వజనికమైన పద్ధతులు వుండవలెను. నిర్మాణములలో బేధము వచ్చినప్పుడు కొలత ప్రారంభంలో మార్పువుండరాదు. గృహమును తాటాకుల దడులతో నిర్మించినను, మట్టిగోడలతో నిర్మించినను, ఇటుక రాయితో నిర్మించినను, బండరాళ్ళతో నిర్మించినను కొలత అనగా కొలిచే ప్రారంభ బిందువు అన్నిరకాల నిర్మాణములకు ఒకే విదంగా ఎల్ల ప్పుడు అనుసరించాలి. ఆ విధము గాకుండా నిర్మాణ బేధములనుసరించి, ప్రాంతీయ బేధములనుసరించి వివిధ పద్ధతులు పాటింపరాదు. ఒకే పద్ధతిని సర్వత్ర ఉపయో గించవలెను. కాని గృహనిర్మాణమునందు కొలత ప్రారంభ బిందువులో వేరువేరుగా వున్నవి. మట్టిగోడలతో నిర్మించిన ఇంటికి గోడల లోపల కొలతలు తీసుకోవాలని కొందరం టారు. గోడల నిర్మాణమునకు ఇటుకరాయి వాడితే గోడలమధ్య కొలత ప్రారంభబిందువు తీసుకుంటున్నారు. అనగా వాస్తుపదమును నిర్ణయించేటప్పుడు నిర్మించే గోడమందము కొలతలో సగమును పదములో కలిపి లెక్కించుచున్నారు. రెండువైపుల గోడల మధ్యకొలత తీసుకొనుచున్నారు. మరికొందరు గోడల వెలుపలి కొలతను ప్రారంభ బిందువుగా తీసుకొని పదనిర్ణయము చేయుచున్నారు. వాస్తుపద ప్రారంభ బిందువు ఒకే విధముగ లేకుండా మూడు రకములుగా వుంటున్నది. దీనివలన సాధించబడిన వాస్తుపదము మూడు రక ములుగా వస్తుంది.

ఈ విధముగా తేబడిన వాస్తుపదములలో దేనిని అనుసరించాలి అను గందరగోళ పరిస్థితివున్నది. సత్యము ఒకటేగాని అనేకముకాదు. ఈ మూడింటిలో ఏదో ఒకటే శాస్త్ర సమ్మతమైనది. ఇది నిర్మాణ భేదమును బట్టి మారరాదు. సార్వత్రికంగా ఆచరింపబడాలి అను విషయము ఆలోచించవలసిన ఆవశ్యకత వున్నది. పదశబ్దము అనగా గృహగర్భము రెండు హద్దుల యొక్క మధ్యప్రదేశము. అనగా గోడలను ముట్టకుండా వాస్తుపదమును నిర్ణయించవలెను. పదము అన్న గర్భము అన్న శబ్దములకు సంసృష్టి ధర్మమే కాని సంకర ధర్మములేదు. సంసృష్టి అనగా తిలలు, బియ్యపు గింజలు కలియుటవంటివి. నువ్వులను బియ్యపు గింజలను వేరువేరు చేయవచ్చును. బియ్యపుగింజల నుండి నువ్వుల గింజలను వేరుచేయవచ్చును. ఇవి రెండు పరస్పరం కలిపిన ఒకదాని స్వభావం మరొకటి చెరపలేదు. స్త్రీ గర్భము ధరించినది అనునప్పుడు ఆమె కడుపునందు జీవుడు ప్రవేశిం చినాడు. అది దినదిన ప్రవర్ధమానమై సంపూర్ణ శిశువుగా రూపుదిద్దుకొని ప్రాణము కల గగానే మాతృగర్భం నుండి బయటకు వెడలివచ్చును.

స్త్రీ గర్భంలోనే శిశువు వృద్ధి చెందుటకు గర్భము లోపల తిరుగుటకు శిశువునకు గర్భములో ఖాళీస్థలం అనువుగా వుండినప్పుడే గర్భస్థ పిండము ఆరోగ్యంగా పెరుగుతుంది. అనగా గర్భగోడల మధ్యఖాళీని బట్టి శిశువు వృద్ధి చెందుటకు అవకాశం వుంటుంది.

ఆవిధంగా కాకుండా గర్భము గోడల మధ్య కొలత అని నిర్ణయించునప్పుడు శిశువు వృద్ధి చెందుటకు అవకాశంలేదు. ఎందువలననగా శిశువు పెరిగే కొద్ది గర్భస్థ గోడలను చీల్చుకుంటూ వెలుపలికి వస్తూ పెరగవలసి వుంది. మరి ఆ విధముగా జరుగుటలేదుకదా. ఆ విధముగ జరిగితే తల్లికి బిడ్డకు క్షేమంకాదు కదా. కావున గృహగర్భము అనగా నాలుగు గోడల లోపలి కొలతనే తీసుకోవాలి గాని గోడమధ్య కొలత కాదు అని తెలియు చున్నది. ఒక పదార్థమునకు చెందిన పాత్రను తీసుకొనిన పాత్ర లోపలగల వైశాల్యమును బట్టి నీటితోనో, వస్తువుతోనో నింపుతాము. అంతేగాని పాత్రమందము ఎక్కువైన కొలదిని వైశాల్యమునందు మార్పురాకూడదు. మందంపెరిగే కొద్ది పాత్ర వైశాల్యంలో మార్పురాదు. అదే విధంగా గోడల మందం యొక్క మధ్యకొలత తీసుకొనరాదు. గోడల లోపల కొలత అయితేనే శ్రేష్ఠము. గర్భస్థ శిశువు బయటికి రాగలు చున్నది. ఆ విధముగా తల్లి,శిశువు వేరువేరుగా వుండుట జరుగుచున్నది.

గృహనిర్మాణమునందు పునాదులయందుండు కొలత గృహపైభాగ నేల మట్టమునకు వుండు కొలత మరొక విధముగా వుంటుంది. అనగా గృహము యొక్క పునాదులు ఏర్ప రచేటప్పుడు గోడలమందం ఎక్కువగాను, గృహనేల మట్టమునందు ఏర్పరచిన గోడల మందములు తేడాలు వుడుచున్నవి. మరి గోడల మధ్యకొలత అనగా ఏ కొలతను ప్రాధాన్యంగా తీసుకోవాలి. ఇంటి కొలత అనగా వాస్తుపదము ఒక్కటిగానే వుండాలి. పునాదుల నుండి గృహపైభాగము వరకు గోడలు ఒకే మందంగా వుండాలి. అప్పుడు మాత్రమే వాస్తుపదమును సరియైన రీతిలో నిర్ధుష్టంగా నిర్ణయించవచ్చును. పునాదులు బలంగా వుండాలి. ఇంటిగోడలు బలంగా వుండాలి. కావున గోడమధ్యకొలతను నిర్ణయిం చుట అసాధ్యము. గోడల లోపల కొలతగా నిర్ణయించుట సమంజసముగా వుండును. దీనివలన గోడమందం ఎంతైనా పెట్టుకోవచ్చును. ఇది సృష్టి ధర్మమును అనుసరించి వున్నది.

దేవాలయముల కొలతకు గోడలతో సహా కొలతను తీసుకోమని చెప్పబడినది. పర మాత్మశక్తి ఇట్టిది, అట్టిది అని ఎవరు నిర్ణయించలేనిది. పరమాత్ముడు సకలుడు, నిష్కలుడు కాబట్టి గోడలతో సహా కొలత తీసుకొనవలయునని చెప్పిన మహర్షుల అభిప్రాయముతో ఏకీభవిస్తాము.

కొలతలను గ్రహించునప్పుడు దశాంశమానములో స్వీకరించాల షష్ట్యబ్ద మానములో స్వీకరించాలా అను సందేహం ఏర్పడుచున్నది. భూమి గోళాకారంగా వున్నది కాబట్టి గడి యారంలోని కొలతలు అయిన ఒకరోజుకు అరవైఘడియలు అనగా 24 గంటలు. ఘడియ అనగా 24 నిమిషములు. ఒక ఘడియలలో వున్న కొలతలను గంటలు, నిమిషములుగా మార్చుకొని 24 గంటలు ఒక రోజుకు ఒక గంటకు 60 నిమిషములుగా స్థిరీకరించు కొనినాము. గడియ, విఘడియ కొలమానం అధిక వ్యాప్తిలో వున్నప్పుడు గజము – అడుగు– అంగుళములు విధానం వ్యాప్తిలోకి వచ్చినది. ఇప్పుడు కాల్యుకలేటరు అధిక విస్త ృతంగా వ్యాపించి వుండుట వలన షష్ట్య బ్దమాన కొలతలను శతాంశమానములోనికి మార్చుకొని గణితమును కాల్యుకులేటర్, కంప్యూ టర్ ద్వారా

చాలా సులువుగా చేయగలుగుచున్నాము. ఇప్పుడు ఎక్కువగా మీటరు, సెంటి మీటరు అను విధానానికి అధికముగా అలవాటు పడినాము. కావున కొలతలను ఆ విధంగా సాధించు కోవచ్చును. ఒక అడుగుకు అంగుళములు : 12. దీనిని దశాబ్దమానం లోకి మార్చుకొని పదమును నిర్ణయించవలెను.

అంగుళములు :-

| | | |
|---|---|---|
| 1=0.833 | 2=1.666 | 3=2.500 |
| 4=3.332 | 5=4.165 | 6=5.000 |
| 7=5.831 | 8=6.664 | 9=7.500 |
| 10=8.333 | 11=9.166 | 12=10.000 |

ఈ విధముగా కాల్యుకులేటరు సహాయముతో అంగుళములను దశాంశమానంతో గుణించ వచ్చును.

సృష్టిలో ప్రతివస్తువు ప్రతిజీవి ఏదో ఒక కొలత ప్రమాణముతో వుంటవి. అరచేతి వైశాల్యమును తెలుసుకొనుటకు మిల్లీమీటర్లు కొలమానమును ఉపయోగించాలి. కాకున్న సెంటీమీటరునైనను ప్రమాణంగా తీసుకొని వైశాల్యం లెక్కకట్టవచ్చును. అంతేగాని మీటరు ప్రమాణములో వైశాల్యమును లెక్కకట్టలేము. కొన్ని వస్తువులను కొలవటానికి అంగుళాలు, కొన్నిటిని అడుగులు, మరికొన్నిటికి గజములు ప్రామాణికముగా తీసుకొని వైశాల్యంగాని, ఘనపరిమాణంగాని లెక్కకట్టు తాము. అయితే దేనికి ఏ కొలతవాడాలి అని మన మహర్షులు నిర్ణయించినారు. నదులను కొలిచే కొలత ప్రమాణం నేటి మీటర్లు, కిలో మీటర్లలో నిర్ణయించలేము. వాటి కొలత వేరుగవున్నది. శిల్పి ఒక దేవతా విగ్రహాన్ని మలచేటప్పుడు వారు అవలంబించే కొలత ప్రమాణమును తాలములు అందురు. శరీర అవయవములలో ఒక్కొక్క దానిని మలచేటప్పుడు మరల తాలప్రమాణములోనే సూక్ష్మ విభాగ కొలతలువున్నవి. విగ్రహాన్ని మొత్తం తాలప్రమాణంలో కొలిచినా ముక్కునుగాని, చెవినిగాని లాంటి చిన్నపాటి అవయవముల కొలత తాళప్రమాణాలను బట్టి మార్పు చేర్పులుంటాయి. అదే విధంగా నేడు మనిషిని అడుగులలోనే మనము ఎత్తును పరి శీలిస్తాము. ఆ అడుగులను సెంటీమీటర్లోనికి మార్చుకొని కూడా పరిశీలిస్తాము. మన పూర్వీకులు షష్ఠ్యబ్ద మానమును పాటిస్తూ అడుగులు, అంగుళములు, కొలతలు స్వీకరించి నారు. దానిననుసరించి కొలత ప్రమాణములను ఏర్పరచినారు. గృహము వైశాల్యమును అడుగులలోనే చెప్పబడినది. కావున వాస్తు పదమును నిర్ణయించినప్పుడు పొడవు,వెడల్పు కొలతలు అడుగులలోనే తీసుకొని వైశాల్యమును అడుగులలోనే నిర్ణయించుకొనవలయును.

గృహవాస్తు పదములను అడుగుల కొలత ప్రమాణములోనే తయారు చేసుకోవాలి. అంతేకాని ఇంటి కొలతకు పొడవు-వెడల్పులకు, అడుగు-అంగుళాలు, కొలత తీసుకొని దానిచే రాబడిన వైశాల్యమును గజములలోకి తేబడిన దానిని స్వీకరిస్తున్నారు.కొందరు చిన్న వస్తువులను చిన్న కొలతలతోనే కొలవవలెను. పెద్ద వస్తువులను పెద్ద కొలతలచేత కొలవవలెను. అప్పుడు మాత్రమే సరియైన పదమును నిర్ణయించగలం. అలాకాక అడు గులలో లెక్కవేసి పదనిర్ణయమునకు దానిని గజములలోనికి మార్చిచూచుట శాస్త్రీయ ముకాదు. ఇల్లును పొడవు-వెడల్పు గజములలో కొలిస్తే వచ్చే వైశాల్య పరిమాణం

గజములలో చాలా తక్కువగా ఉంటుంది. ఈ గజములద్వారా గృహపిండమును నిర్ణయిస్తే అతి తక్కువ పదములతోనే మంచి,చెడులు స్వీకరించాల్సి వస్తుంది. ఈ పద్ధతిద్వారా శుభాశుభనిర్ణయమును స్పష్టముగా నిర్ణయించలేము. గజములను గృహము వెలుపలి ఉన్న ఖాళీస్థలములను గృహమునకు కట్టు ప్రహరీగోడల నిర్మాణ పదమునకు స్వీకరించాలిగాని, గృహ వైశాల్యమునకు కాదు. గృహవైశాల్యం నిర్ణయించుటకు గజములలో పొడవు-వెడల్పు కొలతలు తీసుకుంటే స్వచ్ఛమైన, శుద్ధమైన పదమును నిర్ణయించుటలో విఫలము అవుతాము. ఇప్పుడు పూజకు వినియోగించే పీటను తయారుచేయాలి. దానిని శుభప్రదమైన పదముగ స్వీకరించి తయారుచేయాలంటే దానికి అడుగులుకాకుండా అంగుళములను మాత్రమే కొలతగా స్వీకరించవలసి వున్నది. ఆ విధంగా అంగుళములతో సాధించబడిన వైశాల్యము అడుగులలోనికి, గజములలోనికి మార్చి పదనిర్ణయం చేయుట హాస్యాస్పదము వంటిది. కావున కొలచుటకు ఏ కొలతను వాడతామో పదనిర్ణయానికి దానినే స్వీకరించాలి కాని గజములలోనో,అడుగులలోనో, మీటర్లలోనో మన ఇష్టం వచ్చినట్లు మార్చుకుని గృహపదము నిర్ణయిస్తూ ఉంటే వాస్తు పద ప్రాముఖ్యత కోల్పోతుంది. ఋజువైన ఫలితాల సాధన చేయలేము. కొంతమంది గృహపదములను నిర్ణయించుటకు అడుగులు- అంగుళములను కొలత తీసుకొని దానిని గజములలోనికి మార్చుకొని పద నిర్ణయము చేయుచున్నారు. ఈ విధముగా వాస్తు సుధాకరము గ్రంథంలో చెప్పబడినది అని చెప్పుచున్నారే గాని, వారు ఆ విధగా చెప్పడం సబబా ! నా గురువులు ఇట్లానే నాకు నేర్పినారు అను మాటలు వివేకమంతమైనవి కావు.

## పూర్ణాంకపదమా - భిన్నాంకపదమా

### సర్వాయమా - గర్భాయమా

గృహమును నిర్మించునపుడు ఎంత వైశాల్యములో గృహమును నిర్మించుకోవాలి పొడవు-వెడల్పు ఎంత అను విషయము గృహస్థునికి వున్న స్థలమును బట్టి,శక్తిని బట్టి నిర్ణయింపబడతాయి. అయితే గృహవాస్తు పదము అంటే ఏమిటి అనగా గృహమును నిర్మించుటకు స్వీకరించిన స్థలము పొడవు-వెడల్పులు కొలచి వైశాల్యమును లెక్కగట్టవలెను. ఈ గృహవైశాల్యమునే గృహ వాస్తుపదము అని అందురు. ఈ వాస్తుపదము గృహమునకు తీసుకోబడే పొడవు-వెడల్పులు అడుగులలో లెక్కించగ వచ్చిన వైశాల్యమును అడుగులతో కూడిన గృహవాస్తు పదము అని అంటారు. గజములలో పొడవు-వెడల్పులు స్వీకరిస్తే వచ్చిన పదమును గజముల పదముగా స్వీకరించాలి. అనగా గృహనిర్మాణమునకు తీసుకొనిన స్థలమును కొలుచుటకు మనము ఉపయోగించే కొలబద్దను బట్టి పదమునకు ఆ పదము వచ్చును. గృహమునకు తీసుకునే పదము పూర్ణాంకముగా వున్నదానినే స్వీకరించాలి. భిన్నాంక పదమైనను స్వీకరించవచ్చునా అను విషయముపై భిన్నాభిప్రాయములు వున్నవి. ఒక రూపాయి అనునది ఒక విభాగం. రూపాయిలో పైసలు అనునది మరొక విభాగం. రూపాయిని లెక్కించుటకు 100పైసలు వుంటేనే పూర్ణముగా రూపాయి అనునది ఏర్పడుతుంది. ఆ విధముగా కాకుండా 96,97, 98,99 పైసలు అనుచు లెక్కించుటవలన రూపాయి విలువ వందపైసలకు దరిదాపులలో ఉన్నవి. పైన 96,97,98,99 పైసలు

అనునవి వున్నవేగాని పూర్తిగా రూపాయి ఏర్పడలేదు. అదేవిధంగా రూపాయిని 4 విభాగాలుగా పావలా, అర్థరూపాయి, ముప్పావలా, రూపాయి అను విభాగం వలన ముప్పావులా అనగా 75పైసలు వచ్చినది. మిగిలిన 25పైసలు విలువను తొలగించుచున్నాము. ఏ విధముగా అంటే మూడుపావులాలు ఒక పావలా కన్నా చాలా అధికము కదా. మిగిలినది స్వల్పమేకదా అని గణితమును పూర్ణాంక బిందువులోనికి తీసుకురావటానికి 75 పైసలకు ఇరవైఐదు పైసలు కలిపి ఒకరూపాయిగా లెక్కవేసుకొనుచున్నామే కాని పూర్తిగా రూపాయి విలువ లేదుగదా. కావున గృహవాస్తు పదమునకు నవవర్గులు కట్టునప్పుడు వచ్చే ఆయము, ఆదాయము ఇవి కూడా భిన్నాంకములుగా వచ్చి సగముకన్నా ఎక్కువ విలువవున్నందున దానిని కలుపుట జరుగుచున్నది. పదము అడుగులలో తీసుకున్నప్పుడు పదము నిండుగా సంపూర్తిగా రాకుండా 12 అంగుళములలో 7,8,9,10,11 అంగుళములు వచ్చినవి కదా అని ఒకటి కలుపుకోవడం గణితసౌలభ్యం కోసం చేసే పని. పూర్తి విలువలేదు కదా. కావున గృహవాస్తు పదము మాత్రము పూర్ణాంకముగానే తీసుకొనవలయును. అప్పుడు మాత్రమే ఆ పదమునకు సంబంధించిన శుభఫలితములను పూర్తిగా పొందగల మను విశ్వాసం ఏర్పడుతుంది. ఆ విధంగా కాకుండా భిన్నాంక పదమును పొంది దానికి నవవర్గులు కూడా భిన్నాంకముగా వచ్చుచుండుట అధికముగా వుండును. ఫలిత నిర్ణయము సందేహాస్పదముగా వుండును. ఇటువంటి సంశయాత్మకమైన భిన్నాంక పదము స్వీకరించవచ్చునా? అయితే గృహకొలతలకు తీసుకునే పొడవు-వెడల్పులలో కొలతలు భిన్నాంకముగా వుండవచ్చును గాని పదవైశాల్యము మాత్రము పూర్ణసంఖ్యారూపములోనే ఉండాలి. ఇది ఋషుల సమ్మతము. గృహపిండమును పూర్ణాంక రూపములో సాధించుటకు పొడవు తీసుకున్న అడుగులకు మాత్రమే అంగుళములు స్వీకరించాలి గాని గృహవెడల్పు కొలతలు మాత్రము అడుగులోనే స్వీకరించాలి. ఈ వెడల్పుకు అంగుళములు చేర్చరాదు అని గర్భాయ విషయములో చెపుతుంటారు. సాధ్యమైనంత వరకు పొడవు కొలతలకే అడుగులకు అంగుళములు చేర్చుకొనుచుందురు. ఆ విధంగా రాబట్టిన గృహపిండము పరిశుద్ధము కానప్పుడు ఒకటి, రెండు అంగుళములు వెడల్పు అడుగులకు చేర్పుకొనవచ్చును. ఏ విధముగా చేసినను పూర్ణాంకపదము రావలసి వున్నది. వెడల్పులో ఒకటి, రెండు అంగుళములు కలుపుకుంటే హిమాలయ పర్వతమంత తప్పుగా భావించి బెంబేలు పడుతుంటారు కొంతమంది. పూర్ణాంక పదసాధన మాత్రమే మనగమ్యము అనునది గమనించవలయును. ఇది గర్భాయ పదము విషయమునకు సంబంధించినది. కొందరు గర్భాయం అనగా హాలు వెడల్పు 12 అడుగులు మాత్రమే ఉండాలి ఎందువలననగా 4 గజములు సరిగ్గా వుంటుంది. దీనిలో అంగుళాలు చేర్చరాదు అని భావించుచుందురు. పదము పూర్ణాంకమురాకపోయిన ఫరవాలేదుగాని గర్భాయ సాధనలో హాలు వెడల్పు 12 అడుగులకు తగ్గరాదు,పెరగరాదు అని భీష్మించుకొనువారు వున్నారు. గమ్యస్థానంను మరచే వారే అలా అంటుంటారు.

గృహనిర్మాణమునకు తీసుకొను పదము కేవలం గర్భాలయానికి తీసుకోవలెనా,

సర్వాయము తీసుకొనవలెనా అను మీమాంస చాలా మంది పండితులలో వుంటుంది. పూర్వకాలములో గృహములను నిర్మించుకొనేటప్పుడు గదులకు వరండాలు లేదా అళిందములు, వసారాలు వేసుకొనేవారు. ఈ వసారాలు గర్భగృహమునకు తక్కువ ఎత్తులో వేయబడును. అనగా హాలు నాలుగు గోడలవరకు ఒకే ఎత్తు మిగతా వసారాలు ఏటవాలుగా వేసేవారు. ఈ వసారాలకు నాలుగు గోడలు వుండవచ్చును, లేకపోవచ్చును. ఒక విధంగా హాలు నుండి వేరుచేయ బడినదిగా వుండును. అందువలన గతములో వసారాలను లెక్కించకుండా ఒక్కగర్భము (హాలు)నకు మాత్రమే పదమును నిర్ణయించేవారు కొందరు. మరికొందరు వసారాలతో కూడిన హాలు మొత్తం స్థలంను పదముగాని నిర్ణయించేవారు. కాని సర్వాయమే శ్రేష్ఠమైనది. గర్భాయము శ్రేష్ఠమైనది కాదు. గృహయజమాని, హాలుమాత్రమే కాకుండా వసారాలను కూడ తన అవసరాలకు కుటుంబ సభ్యులతో పాటు వాడుకొనుచున్నప్పుడు గృహము ఆవరించిన మొత్తం స్థలమును గ్రహించాలి గాని కొంత గ్రహించుట వివేకమైన పనిగాదు.

ఇప్పుడు డాబాలు నివాసములుగా వచ్చుచున్నవి. అనగా పైకప్పు అంతా ఒకటిగా సమానంగా వుంటుది. ఒకే పైకప్పు అనగా శ్లాబు కిందకు హాలు, గదులు,పంచ, వరండాలు వచ్చుచున్నవి. అయినను (హాలు) మాత్రమే స్వీకరిస్తున్నారు. గృహపదనిర్ణయములో హాలుతోపాటు ఇతరగదులు, వరండాలు స్వీకరించక పోవట విచారించవలసిన విషయము. పూర్వకాలం మండువాఇళ్లు, పూరిండ్లు ఎక్కువగా ఉపయోగించేవారు దానికి కూడా సర్వాయం తీసుకోవలసివున్నది. గర్భాయం తీసుకొనినారు. కాని నేడు ఒకే శ్లాబు ఒకే ఎత్తులో వుంటుంటే ఆ శ్లాబులో వున్న అన్ని గదులను హాలుతో సహా వైశాల్యంను లెక్కించునప్పుడు తీసుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది. అనగా సర్వాయము అంటే ఇంటి నాలుగు గోడల లోపల ఆవరించివున్న స్థలం మొత్తాన్ని పరిగణలోనికి తీసుకోవలయును. దీని ద్వారా సాధించబడిన గృహపదమును సర్వాయ పదము అందురు.

సర్వాయపదము గృహము నిర్మించు స్థలము అనగా గృహవెలుపలి నాలుగు గోడల లోపలవున్న వైశాల్యం మొత్తమునకు వర్తించుచుండును. ఈ మధ్యవున్న స్థలమును వారికి అనువుగా శాస్త్రరీత్యా వివిధ గదులుగా, వరండాలుగా విభజిస్తూ గోడలు కట్టుకొనువచ్చును. కొన్ని ప్రాంతములందు గర్భాయమునకు ఇచ్చు ప్రాధాన్యత సర్వాయమునకు లేదు. మరికొన్ని ప్రదేశములలో సర్వాయమునకు అధిక ప్రాధాన్యత ఇచ్చుచున్నారు. కాని ఇంటిని నిర్మించుస్థలము మొత్తమును పరిగణన లోనికి తీసుకొని గృహపిండము ఏర్పరచుకొనవలెను. దానికి సర్వాయరీత్యా నవవర్గులు తెలుసుకొనవలయును. అదే విధముగ గృహమునందలి ప్రధాన గది(హాలు)కి ఆయము కట్టి నవవర్గులు తెలుసుకొనవలెను. ప్రధాన గది(హాలు)కి ఆయము కట్టేదానిని గర్భాయము అందురు. సర్వాయరీత్యా వచ్చిన వర్గులను గర్భాయరీత్యా వచ్చిన వర్గులకు తులనాత్మకంగా పరిశీలన చేసి గర్భాయరీత్యా వచ్చిన నవవర్గులు సర్వాయరీత్యా వచ్చిన నవవర్గులకు పొంతన కుదరవలెను. ఈ రెండింటికి సమతూకం వచ్చే విధంగా గర్భాయ పదము ఏర్పడువరకు హాలు యొక్క పొడవు-వెడల్పులలో చిన్నచిన్న మార్పులు చేసి గృహము మొత్తానికి

వర్తించే సర్వాయమునకు అనుకూలముగ గర్భాయము (హాలు) వుండవలెను. ఆ విధముగా సర్వాయరీత్యా గర్భాయరీత్యా వాస్తుపదమును నిర్ణయించి గృహనిర్మాణము చేయుటను సర్వులు హర్షించెదరు. కొద్దిపాటి శ్రమతో సర్వాయ గర్భాయములను సాధించవచ్చును. గృహనిర్మాణం చేసి గృహప్రవేశమైన తరువాత గృహయజమాని సుఖసంతోషములతో ఉండవలెనని గృహనిర్మాణంలో పాల్గొన్నవారు కూడ మనసార కోరుకుంటారు. లక్షల రూపాయలు వెచ్చించి తన కలల ఆశల అనుగుణంగా నిర్మించుకున్న గృహములో నివాసం ద్వార గృహ యజమాని సుఖసంతోషములతో జీవించుటయు లక్ష్యము. దాని కొరకు సర్వాయరీత్యా, గర్భాయరీత్యా గృహయజమానికి అనుకూలమైన వాస్తుపదమును నిర్ణయించుకొనవలెను. ఈ వాస్తు పదము పూర్ణాంక సంఖ్యారూపములో వున్నది మాత్రమే సంశయరహితమైన ఫలిత నిర్ధారణకు అనుకూలముగా వుంటుంది. ధాన్యం నింపాలికాని, కొంచెం కొరతవున్న దానిని మన ధాన్యం కొలిచే పాత్రలో ఉన్నాయి అని భావించుట వారి మనస్సుకు సంబంధించిన విషయము అవుతుంది గాని గణిత రీత్యాకాదు. కావున పూర్ణాంక పదము ద్వారానే నవవర్గులు సాధించాలి అని తెలుసుకొన వలసివున్నది.

## వాస్తు పురుషుడు

వాస్తు పురుష పూజను చేయుసందర్భములు విశ్వకర్మ ప్రకాశికలో చెప్పబడినది. వాస్తు పురుషుడుకి ఆధారమైనది ఈ భూమి. దీనియందు అంతర్భూతముగా సర్వత్ర వ్యాపించివున్నాడు. వాస్తు పురుషుడు అనగా సూర్యభగవానుడే అని విశ్వకర్మ చెప్పినాడు. మానవులే కాక సమస్త జీవరాశులకు నిలయమైనది ఈ భూమి. ఈ భూమియందలి సకల ప్రాణులకు అవసరమైన ఆహారము, ప్రాణవాయువు, ఉష్ణము, నీరు మొదలుగా గల సమస్త సంపదకు ఆధార భూతమైనది సూర్యకిరణశక్తి. కావున ఈ భూమియందు సర్వాంతర్యామిగా వ్యాప్తమై వున్న సూర్యశక్తిని వాస్తుపురుషునిగా కొలుచుచున్నాము. ఈ వాస్తుపురుషుడు పూర్వము శివునకు అంధకాసురునకు ఘోరయుద్ధము జరుగుచుండగా శివుని దేహమునుండి శ్వేద(చెమట) బిందువు పుట్టి భూమిపై పడినది. ఆ బిందువు నుండి భూలోక స్వర్గ లోకములకు మహాభయము కలిగించెడి ఒక మహాభూతము పుట్టినది. ఈ భూతము దేవతలచే భూలోకమునకు త్రోయబడి భూలోకమంతా వ్యాపించినది. ఆ భూతమే వాస్తుపురుషునిగ భూలోకవాసులచే గ్రహింపబడినది. ఈ వాస్తుపురుషుని దేహమందు సకలదేవతలు నివసించుటచే భూలోకవాసులందరు వాస్తుపురుషునికి పూజలు చేయవలసిన అవసరమువున్నది. ఈ వాస్తుపురుషుడు భాద్రపద బహుళ తదియ, శని వారము,కృత్తికా నక్షత్రమందు, వ్యతీపాత యోగము నడచుచుండగా భద్రకరణము యొక్క మధ్యభాగము జరుగుచుండగా వాస్తుపురుషుని ఉద్భవము జరిగినది. అయితే ఈ భూమి అంతా వ్యాపించిన వాస్తుపురుషుని పూజించుట ఎలా అని ఆలోచన కలగవచ్చును. కాని మనము గృహమును నిర్మించుటకు తీసుకొనిన భూమియందే అనగా ఘటము, ఆకాశము అను రీతిగా వ్యాపించివున్నాడు అని భావనచేసి పూజించ వలయును.

ఈ వాస్తుపురుషుడు ఏఏ సందర్భములో పూజించాలి అని మహర్షులు ఈ విధముగా చెప్పినారు. గృహారంభము, గృహప్రవేశము, సింహద్వార స్థాపన, త్రివిధ గృహ ప్రవే

శములయందును, ప్రతి సంవత్సర ఆరంభదినము అనగా చాంద్రమానము అనుసరించి నట్లయితే చైత్రశుద్ధ పాడ్యమి అనగా ఉగాదిరోజున. సౌరమానము అనుసరించి నట్లయితే మేషరాశిలోకి సూర్యుడు ప్రవేశించు ఏప్రియల్ 14వ తారీఖున జరపవలయును. ఇంకను యజ్ఞములు ప్రారంభించునప్పుడు, పుత్రజననము జరిగినప్పుడు, ఉపనయనము, వివాహము లేదా గొప్ప ఉత్సవాలు చేసేటప్పుడు, గృహాదులుగాని, దేవాలయాలుగాని మొదలగు నిర్మాణములు జీర్ణోద్ధారణ గావించునపుడు, శల్యోద్ధారణ జరుపునపుడు, పిడుగుపడి లేక దగ్ధమైన గృహములనందు, సర్పము, ఛండాలదూషిత గృహములయందును, గుడ్లగూబ ప్రవేశించిన ఇంటిలోను, ఏడురోజులు కాకివున్న ఇంటిలోను, ఇంటిలో గోమార్జాలాది ధ్వనులు కలుగుచున్నప్పుడు, ఏనుగులు, గుర్రాల ధ్వనులు కలుగు ఇండ్లయందును, స్త్రీలు నిత్యము తగవులాడు గృహమునందును, తేనేతుట్టలు పుట్టిన గృహములును, పావురాలు నివసించు ఇంటిలో ఇంకను అనేక ఉత్పాతాలు కలిగినప్పుడు శుభము కలగడం కోసము వాస్తుపురుష పూజను శాస్త్రయుక్త పద్ధతిలో తప్పక చేయాలి. అంతేకాక గ్రామాలు, నగరాలు, దుర్గాలు, పట్టణాలు, ప్రాసాదాలు, ఉద్యానవనాలు, ఆరామములు, మండపములు నిర్మించునప్పుడు వాస్తుపూజ చేయాలి. వాస్తుపూజ చేయకపోతే దరిద్రము, మృత్యువు, విఘ్నాలు కలుగుతాయని విశ్వకర్మ ప్రకాశికలో తెలుపబడినది. భూమి మీద ఇల్లు మనసౌకర్యం కొరకు కట్టుకొనినప్పుడు ఆ భూమిపై ఆవరించివున్న వాస్తుపురుష దేవతను సంతృప్తి పరచుట మన ధర్మము. అయితే ఇది ప్రాధాన్యతగల పూజగా కాకుండా తూతూమంత్రముగా జరపటము సర్వసాధారణమై పోయింది. అందువలన వాస్తుపురుషుడు సంప్రీతి చెందక పోవుట వలన గృహమునందు అశాంతి ఏర్పడుతుంది అని గమనించవలయును. వాస్తుపూజపై ప్రత్యేక గ్రంధముగా వ్రాయాలనే సంకల్పము వున్నందున ఆ విషయము ఇంతటిలో ముగించుచున్నాను

వాస్తు పురుషుడు అధోముఖముగా భూమిపై శయనించును. అటువంటి వాస్తు పురుషుని స్థిరవాస్తు పురుషునిగా గ్రహించాలి. ఈశాన్యములో వాస్తు పురుషుని శిరస్సు వుండును. నైరుతి దిశలో పాదములుండును. వాయువ్య ఆగ్నేయ దిశల యందు భుజాల మధ్య భాగములో వక్షస్థలం హస్తములు వుండును. ఈ స్థిరవాస్తు పురుషుడు సూర్య సంచారాన్ని బట్టి చరవాస్తు పురుషునిగా సంచరిస్తాడు. ఎడమవైపు తిరిగి శయనించును. సూర్యుడున్న రాశిలో పాదములుంచి దానికి సప్తమరాశిలో శిరస్సువుంచి నాలుగుదిక్కులకు భ్రమణము చేస్తాడు. ఈ చరవాస్తు పురుషుడు సూర్యుడు కన్య,తుల,వృశ్చిక రాసులలో వున్నప్పుడు తూర్పు శిరస్సుగాను. ధనుస్సు, మకర, కుంభ రాశులలో సూర్యుడున్నప్పుడు దక్షిణ శిరస్సుగాను, మీన,మేష,వృషభ రాశులయందు సూర్యుడున్నప్పుడు పశ్చిమ శిరస్సుగాను, మిధున,కర్కాటక,సింహ రాశులయందు రవివున్నప్పుడు ఉత్తర శిరస్సుగాను వాస్తుపురుషుడు వుండును. ఈ చరవాస్తు పురుషుని అనుసరించి గృహారంభకాలాలను నిర్ణయించవలయును. గృహవిన్యాసము, ద్వారస్థాపన కూడ నిర్ణయించాలి.

1.<u>తూర్పున శిరస్సు</u> పడమర పాదాలుంచి ఎడమవైపుకు తిరిగి శయనిస్తాడు. కావున అతని పూర్ణదృష్టి దక్షిణ దిశకు, పాదదృష్టి పడమరవైపుకు ప్రసరించును. అందువలన

భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసములయందు దక్షిణ,పశ్చిమ సింహద్వారములుగల ఇండ్లను నిర్మించవలయును.

2. దక్షిణ శిరస్సును ఉత్తర దిశలో పాదాలుంచి ఎడమవైపుకు తిరిగి శయనించును. పూర్ణదృష్టి పశ్చిమ దిశయందును, పాదదృష్టి ఉత్తర దిశలో పడును. అందువలన మార్గశిర, పుష్య, మాఘ మాసములందు పశ్చిమ ఉత్తర సింహద్వారములు గల ఇండ్లను నిర్మించాలి. దక్షిణ తూర్పు దిశల గృహములను నిర్మించవచ్చును.

3. పశ్చిమ శిరస్సుకు ఫాల్గుణ, ఛైత్ర, వైశాఖ మాసములలో వాస్తు పురుషుడు పడమర దిశయందు శిరస్సును ఉంచి తూర్పు దిక్కున పాదములుంచి ఎడమవైపుకు తిరిగి శయనించివుండును. అందువలన ఆతని పూర్ణదృష్టి ఉత్తరదిశలోను పాదదృష్టి తూర్పుదిశయందు ఏర్పడును. అందువలన ఫాల్గుణ, ఛైత్ర, వైశాఖ మాసములందు తూర్పు, ఉత్తర సింహ ద్వారములు గల ఇండ్లను మరియు దక్షిణ, పడమర దిశలలోవున్న గృహములను నిర్మించవచ్చును.

4. ఉత్తర శిరస్సును జ్యేష్ఠ,ఆషాఢ,శ్రావణ మాసములలో వాస్తుపురుషుడు ఉత్తర దిశయందు శిరస్సునుంచి దక్షిణ దిశనందు పాదములుంచి ఎడమవైపుకు అనగా తూర్పువైపుకు తిరిగి శయనించుతాడు. అందువలన పూర్ణదృష్టి తూర్పుదిశలోను, పాదదృష్టి దక్షిణ దిశలోను ప్రసరించును. అందువలన జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ మాసముల యందు తూర్పు, దక్షిణ సింహద్వారము గల గృహములను పశ్చిమ ఉత్తర దిశా గృహములను నిర్మించుట శ్రేష్ఠము.

## క్షణిక వాస్తు పురుషుడు

మానవుడు వివిధ పనులయందు నిత్యము వుండుట జరుగుచున్నది. ప్రపంచమునందు వృద్ధిచెందిన సాంకేతిక పరిజ్ఞానము వలన నిర్మాణ రంగములో విప్లవాత్మకమైన మార్పులు సంభవించుచున్నవి. అందువలన అతితక్కువ కాలవ్యవధి లోనే గృహాది నిర్మాణములు జరుగవలసివున్నది. సంవత్సరాల తరబడి నిర్మించే విధానము నేడులేదు. రవాణా రంగమును విస్తృతమైన ప్రయాణ సౌకర్యము లుండుట వలన గృహనిర్మాణమునకు కావలసిన సరంజామా అంతా శీఘ్రముగా తయారు అవుచున్నది. అతిత్వరగా గమ్యస్థానములకు చేరగలుగుచున్నవి. ఆధునిక మానవుడు విశ్రాంతి తక్కువతో జీవితము గడుపుచున్నందున నేటికాలానికి అనుగుణముగా చరవాస్తు పురుషుడు రీత్యానిర్మాణములు ఆలస్యమవుతున్నవి. అందువలన కాళిదాస మహాకవిచే చెప్పబడిన క్షణిక వాస్తు పురుషుడు అనుసరించి నిర్మాణ కార్యక్రమములు, నిర్వహించుకొనుట మిక్కిలి శ్రేష్ఠమైనది భావించవలసి వున్నది. చరవాస్తు పురుషుడు మాసాలవారీగా భ్రమణం కలిగివున్నాడు. క్షణిక వాస్తు పురుషుడు రోజువారీగా భ్రమణము చేయుచున్నట్లుగా భావించి సూర్యోదయము మొదలు మరల సూర్యోదయము వరకు ఒక దినముగా విభజించ వలయును. అప్పుడు ఒక్కొక్క ఝామునకు 3గంటలకాలం వచ్చును. పగలు ఒక భ్రమణము రాత్రి ఒక భ్రమణము

ఆ విధముగా రోజుకు రెండుసార్లు భ్రమణం చెందువిధముగా భావించి నిర్మాణాదులు చేసుకొనవచ్చును. సూర్యోదయం 6 గంటలు అని భావించి విభజన జరుగుచున్నది.

| పగలు | రాత్రి |
|---|---|
| ఉ ॥ 6.00 - 9.00 | సా॥ 6.00 - 9.00 తూర్పుశిరస్కుడుగా |
| ఉ ॥ 9.00 - 12.00 | రా॥ 9.00 - 12.00 దక్షిణ శిరస్కుడుగా |
| మ॥12.00 - 3.00 | రా॥ 12.00 - 3.00 పడమర శిరస్కుడుగా |
| మ॥3.00 - 6.00 | రా॥ 3.00 - 6.00 ఉత్తర శిరస్కుడుగా |

భావించి తమ పనులను శీఘ్రముగా నిర్వర్తించుకొనవలయును. సూర్యుని యొక్క కాంతి శక్తినే వాస్తు పురుషునిగా భావన చేయవలయును. 360 కాంతి కిరణముల శక్తి పుంజమును దైవ స్వరూపముగా స్వీకరించవలయును. సహస్ర కిరణుడుగా భావించ వచ్చును.

## ఉచ్ఛ (ఎత్తు) నీచ (పల్లము)

వాస్తు శాస్త్రమునందు ఉచ్ఛ అనగా శుభఫలితములను నీచ అనగా అశుభఫలితములను కలుగచేయునదిగా తెలుపబడినది. నవగ్రహములను నైసర్గిక శుభగ్రహములుగా చంద్ర, బుధ,గురు,శుక్రులును, నైసర్గిక పాపగ్రహములుగ రవి,కుజ,శని,రాహు,కేతులును పరిగణించెదరు. దీనిలో రవిగ్రహం పాపగ్రహముగా పరిగణించినను స్వల్ప అశుభగ్రహ ముగానే పరిగణించెదరు. పాపులకు మిక్కిలి బలం ఉన్న విధముగా చేసే పనులు దుఃఖమును, కష్టమును కలుగచేయబడతాయి. నైసర్గిక పాపగ్రహములను స్వేచ్ఛగ వదిలిపెట్టకుండ వాటిని నియంత్రించ వలయును. పాపగ్రహముల దిశలైన దక్షిణము, నైఋతి, పడమర దిశలను మన అదుపాజ్ఞలో వుంచుకొనవలసివున్నది. అయా దిక్కులయందు విశాలమైన ఖాళీస్థలములు వుంచినచో పాపగ్రహ దిశలు మిక్కిలి బలముగలిగి ఉంటాయి. ఆ దిక్కుల అధిపతులకు బలము కలుగుతుంది. వీరికి బలము కలిగితే అత్యంత దుఃఖములను కలుగచేయుదురు. అందువలన ఈ దిశలయందు తక్కువ ఖాళీగల స్థలములను వుంచ వలయును. దక్షిణ దిశయందు ఉంబచడిన ఖాళీస్తలము ఉత్తర దిశయందుంచిన ఖాళీస్తలముతో సరిపోల్చవలెను. 3గాని 4 వంతులగాని ఇంటి ఉత్తర దిశయందు ఖాళీస్థలము వుంచి దక్షిణమున 2 వంతులు ఖాళీవుంచ వలయును. అనగా దక్షిణము నందు వున్న 2వంతులు ఖాళీని అధిగమించి ఉత్తరదిశయందు 3లేక 4వంతులు ఖాళీ వుంచుట వలన ఆ ఇంటి ఉత్తర దిక్కున అధిక శుభఫలితములు ఇవ్వటానికి అవకాశం వున్నది. పాపగ్రహము ప్రసాదించు ఫలితములకన్నా ఉత్తర దిక్కున బలీయంగా వుండుట వలన పాపగ్రహము ఇచ్చు ఫలితములు తగ్గి అధికశుభఫలితములు వచ్చుట జరుగుతుంది. దక్షిణము కుజగ్రహ దిశకదా; అది పాప ఫలితములు ఇచ్చునదికదా. అసలు ఆ దిశన ఖాళీస్థలం అతితక్కువ పిశాచ భాగమువరకు వుంచిన సరిపోతుంది కదా; కొంతమంది దక్షిణ సరిహద్దు

మీదనుంచే గృహనిర్మాణము చేయుచుందురు. ఈ విధముగా చేయుట అశుభకరమైనది. ధైర్యము, సాహసము, త్యాగము వంటి ఫలితములను కుజగ్రహం ప్రసాదించును. ఇవి కలుగవలెనన్న దక్షిణ దిక్కుకూడ కొంతబలమువుంటేనే ఆ ఇంటిలో నివసించు గృహస్థునకు కలుగుచుండును. ఆ విధముగా లేకపోతే గృహస్థుడు పిరికివాడు, భయస్థుడు, చొరవలేనివాడు, తెగింపులేని వాడుగా వుండును. ఆపద కలుగనప్పుడు కష్టముల సమయములలో ఓర్పుగుణము ఉండవలయునంటే కుజగ్రహం కొంచెం బలము కలిగి వుండవలయును. ఆ విధముగా కాకుండా విపరీతబలం కుజగ్రహమునకు వుంటే లోక పీడలాగ గృహస్థునికి పీడ కలిగించును. కావున దక్షిణ దిక్కున తక్కువ ఖాళీస్థలం వుంచ టమే కాకుండా ఆ దిశ ఉత్తర, తూర్పు దిశలతో సరిపోల్చినప్పుడు ఎత్తుఎక్కువగా వుండవలయును. అనగా దిశ మెరకగా ఉండవలయును. ఎప్పుడైతే దిశమెరకగా ఉం టుందో ఆ దిశ మిగతా దిశలకన్న బరువు ఎక్కువగా వుంటుంది.

పాపగ్రహదిశలయందు ఖాళీస్థలం తక్కువగా వున్నప్పుడు గ్రహము బలహీనమై వుంటుంది. దానిలోతో పాటు ఆ దిశమెరకగా వుండినచో అధిక బరువు ఆ దిశాదిక్పతిపై వుంచుట ద్వారా ఆ గ్రహమును అదుపు ఆజ్ఞలయందుంచునట్లంగను. ఎప్పుడైతే పాప గ్రహములు బలహీనమైపోయినాయో అవి ఇచ్చు పాపఫలితములు తక్కువగా వుంటాయి. అంటే ఎక్కువ పాపఫలములు ప్రాసాదించే పాపగ్రహం బలహీనమవుట వలన ఇచ్చు పాపఫలితములు సామాన్యముగా వుండును. ఈ విధముగా పాపఫలములు తగ్గినచో మనకు శుభము కలిగినట్లేకదా. అందువలననే పాపాః నీచగతాః శుభాః అని చెప్పబడినది. అనగా పాపగ్రహం నీచ పడినప్పుడు ఆ గ్రహములు బలహీనపడతాయి. అవి బలహీన పడి నప్పుడు అవి ఇచ్చే దుష్ఫలితములు చాలా తక్కువ స్థాయిలో వుంటాయి కనుక శు భాః అని చెప్పబడినది. సారాంశమేమిటంటే పాపగ్రహదిక్కులైన ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పడమరల యందు ఖాళీస్థలము తక్కువగా వుండాలి మరియు ఆ దిశలు మెరక కలిగివుండాలి.

శుభగ్రహములైన బుధ,గురు, శుక్రుల దిశలు ఎక్కువ ఖాళీస్థలము కలిగి వుండవలయును. అప్పుడు శుభగ్రహములు అధికబలము కలిగి వుంటాయి. ఈ ఖాళీస్తలములు తమ ఎదురెదురు దిశలయందువున్న ఖాళీ స్థలములకన్నా అధిక ఖాళీస్థలము వుంచవలయును. అనగా ఉత్తరదిక్కునందు దక్షిణదిక్కునందుంచిన ఖాళీస్థలముకన్నా ఎక్కువ ఖాళీస్థలం వుంచినచో ఉత్తరదిక్కు అధిపతి అయిన బుధగ్రహం బలం కలిగివుంటుంది అంతేగాకుండా ఆ ఉత్తర దిశయందు దక్షిణ దిక్కుతో సరిపోల్చినప్పుడు పల్లముగా ఉత్తరదిక్కు వుండవలయును. అప్పుడు దిక్పతి తక్కువభారం కలిగివుంటాడు. కావున స్థలవైశాల్యరీత్యాను, తక్కువబరువు రీత్యాను, శుభగ్రహం మిక్కిలి బలవంతమై వుంటున్నది. అందువలన శుభగ్రహములు ప్రసాదించు శుభఫలితములు అత్యధికముగా వుంటాయి. అందువలననే శుభగ్రహములు ఉచ్చపొందితే అధికబలవంతమై శుభఫలితములు అధికముగా ఇస్తాయి. పాపగ్రహములు ఉచ్చపొందితే అనగా అధికబలవంతులైతే (శుభగ్రహములతో పోల్చు కొనినపుడు) అధిక దుష్ఫలితములు కలుగచేస్తాయి. అందువలన పాపగ్రహములు శుభగ్రహములతో సరిపోల్చినపుడు తక్కువ

బలం కలిగివుండవలయును. అందువలననే పాపా: నీచగతా: శుభా: అని మహర్షులు పలికినారు. ఈ సిద్ధాంతం అనుసరించి ఈ క్రింది విధముగా భూములను వర్గీకరించినారు.

1. కూర్మపృష్ఠభూమి: – నాలుగువైపుల పల్లముగా వుండి, మధ్య భాగములో ఉచ్చ అనగా ఎత్తుగా యున్న ప్రదేశమును కూర్మపృష్ఠభూమి అనబడును. ఇటువంటి భూమియందు నివాసముంటే నిత్యోత్సాహము, సుఖము, ధనధాన్యములు కలుగును.

2. నాగపృష్ఠభూమి: – తూర్పుపడమరలు పొడవుగాయుండి దక్షిణ ఉత్తరములు ఎత్తుగా యున్నప్పుడు మధ్యభాగములో పల్లముగా నుండును. ఇటువంటి లక్షణములు కలిగి వున్నదానిని నాగపృష్టభూమి అందురు. దీనివలన ఆ గృహములో నివసించు వారికి స్థానచలనము, మృత్యుభయము, భార్యానష్టమును, సంతాన నష్టమును, శతృవృద్ధి కలుగును. దక్షిణము ఉత్తరములు పొడవుగా వుండి తూర్పు పడమరలు ఎత్తుగా వున్నయెడల మధ్యభాగం పల్లంగా వుండును. దీనిని కూడ నాగపృష్ఠభూమి అందురు. ఈ భూమియందు నివసించువారలకు స్థానచలనము కలుగును.

3. గజపృష్ఠభూమి: – దక్షిణ,పశ్చిమ,నైఋతి,వాయువ్యములు పల్లముగాయున్న భూములకు ఉత్తరము, తూర్పు, ఈశాన్యములో కాలువలు, వీధులు, చెరువులు వుండుట శ్రేష్ఠము. ఇట్టిభూములయందు సినిమాహాలులు, మిల్లులు నిర్మించినచో విశేషవృద్ధిలో వుండును. లక్ష్మీధనపూరితము, ఆయుర్వృద్ధి, సకల సంపదలు, సకల భోగములు కలుగును. ఉత్తరమున వీధిలేక పల్లముగా వుండి మిగిలిన దిక్కులు మెరకగా యున్నచో గజపృష్ఠభూమి అందురు. ఇది ధనవర్గు, పురుష వర్గులకు చెందినది ఇందు నివసించువారు సదా సిరి సంపదలతో నుండెదరు.

4. దైత్యపృష్ఠభూమి: – తూర్పు,దక్షిణము, ఉత్తరములు ఎత్తుగయుండి పశ్చిమము పల్లముగానున్న స్థలమును దైత్యపృష్ఠభూమి అందురు. ఇట్టి భూమియందు గృహనిర్మాణము చేసినచో వంశము, సంతానము, పశువులు నష్టమగును. పశ్చిమ, ఉత్తర, తూర్పులు ఎత్తుగాయుండి దక్షిణము పల్లముగానున్న భూమిని కూడ దైత్యపృష్ఠభూమి అందురు. ఇది ఋణవర్గు భూమి అగును. ఇట్టి భూమిలో గృహనిర్మాణము చేసి నివసించువారలకు సకల సంపదలు క్రమముగా నశించి, ఋణవృద్ధి కలుగును. భార్యకు దీర్ఘ అనారోగ్యము కలుగును. వీనికి తూర్పు దక్షిణములలో రాజవీధులుండి ఉత్తర,పశ్చిమాలలో గల స్థలం ఎత్తుగా యున్నను దీనిని కూడా దైత్యపృష్ఠభూమి అందురు. ఇందు నివసించు వారికి దరిద్రము కలుగును. సంతానము కలుగదు. కలిగినను నిలవక నష్టమగును. వాస్తువిద్య అను గ్రంథములు ఉచ్ఛనీచల ఫలితములను గురించి ఈ క్రింది విధముగా చెప్పబడినది.

అపరాజిత పృచ్ఛలో స్థలంయొక్క దిశలు పల్లంగా ఉన్న కలుగు ఫలితములు చెప్పబడినవి.

| పల్లంగా ఉన్న దిశలు | ఫలితం |
|---|---|
| 1. తూర్పు | శ్రేయస్కరం,ఆయుర్ధాయం,సంపద,బలం,ప్రాసాదాలకు విభూతి, రాజపూజ్యత, ఆనందం. |
| 2. ఆగ్నేయం | అగ్నిభయం, శతృహాని, పాపకృత్యాలు చేయుట. |
| 3. దక్షిణం | రోగం, ధనహాని, పురుషులు నశింతురు. |
| 4. నైఋతి | ధనహాని, పురుషులకు మృత్యుపు, వ్యాధులు. |

| | |
|---|---|
| 5.పశ్చిమము | ధనధాన్యము నాశనం, దు:ఖం, వంశనాశనం |
| 6.వాయువ్యం | శత్రుత్వం,వైరాగ్యము, గోత్రక్షయం, దు:ఖభయం,అజీర్ణవ్యాధి |
| 7.ఉత్తరము | గౌరవము,పుత్రపౌత్రలాభం,అభీష్టసిద్ధి, భోగం |
| 8.ఈశాన్యం | సౌఖ్యం, భార్యాసౌఖ్యం, ధనధాన్యవృద్ధి. |

6-1-4 స్థలములో ఉచ్ఛనీచల ఫలితాలు :- వాస్తువిద్య అను వాస్తుశాస్త్ర గ్రంధంలో ఉచ్ఛనీచల ఫలితం గురించి ఈ క్రింది విధంగా చెప్పబడింది.

| పేరు | దిశలు | ఫలితం |
|---|---|---|
| 1.పితామహవాస్తు | తూర్పు,ఆగ్నేయ మధ్యభాగం పల్లం | అశుభం |
| 2.సుపధవాస్తు | దక్షిణ ఆగ్నేయ మధ్యభాగం ఎత్తు, వాయువ్య ఉత్తరాల మధ్యభాగం పల్లం | సర్వకర్మలకు యోగ్యం |
| 3.దీర్ఘాయుర్వాస్తు | ఈశాన్య ఉత్తర దిశలు పల్లం, నైఋతి దక్షిణ దిశలు ఎత్తు | వంశవృద్ధి |
| 4.పుణ్యక వాస్తు | ఈశాన్య తూర్పు దిశలు పల్లం, పశ్చిమ నైఋతి దిశలు ఎత్తు | శుభదాయకం |
| 5.ఆపదవాస్తు | తూర్పు ఆగ్నేయ దిశలు పల్లం, వాయువ్య పశ్చిమ దిశలు ఎత్తు | వైరం,కలహం |
| 6.రోగకృద్వాస్తు | దక్షిణ ఆగ్నేయ దిశలు పల్లం, వాయువ్య ఉత్తర దిశలు ఎత్తు | రోగదాయకం |
| 7.అర్గళ వాస్తు | నైరుతి దక్షిణ దిశలు పల్లం, ఉత్తరం ఈశాన్యం ఎత్తు | బ్రహ్మహత్యాదిపాపం |
| 8.శ్మశాన వాస్తు | ఈశాన్య తూర్పు దిశలు ఎత్తు, పశ్చిమ నైఋతి దిశలు పల్లం | వంశనాశనం |
| 9.శ్యేనక వాస్తు | ఆగ్నేయము పల్లముగా ఉండి నైఋతి ఈశాన్యం వాయువ్యం ఎత్తు | నాశనం, మరణం |
| 10.శ్వముఖ వాస్తు | ఈశాన్య ఆగ్నేయ పశ్చిమ దిశలు ఎత్తు, నైఋతి దిశలు పల్లం | దారిద్ర్యం |
| 11.బ్రహ్మఘ్న వాస్తు | నైఋతి,ఆగ్నేయ,ఈశాన్య దిశలు ఎత్తు, వాయువ్య తూర్పు దిశలు పల్లం | నింద్యము |
| 12.స్థావర వాస్తు | ఆగ్నేయ దిశ ఎత్తు, నైఋతి వాయువ్య ఈశాన్య దిశలు పల్లం | వంశనాశనం |
| 13.స్థండిల వాస్తు | ఈశాన్య భాగం ఎత్తు, నైఋతి వాయువ్య ఆగ్నేయ దిశలు పల్లం | సర్వనాశనం |

| | |
|---|---|
| 14. సహజంగా మెరకగా ఉండవలసిన దిశలు | ఆగ్నేయం, దక్షిణ ఆగ్నేయం,దక్షిణం దక్షిణనైఋతి,పశ్చిమం, పశ్చిమనైఋతి |
| 15. సహజంగా పల్లముగా ఉండవలసిన దిశలు | ఉత్తర వాయువ్యం,ఉత్తరం, ఉత్తర ఈశాన్యం, తూర్పు,తూర్పు ఆగ్నేయం తూర్పు ఈశాన్యం. |

## ఏకశాలా విధానము

### షోడశ గృహములు

మానవ జీవితమునకు ప్రాణవాయువు అతిముఖ్యము. గృహమునకు తగినంత గాలి వెలుతురు తగినంత ప్రమాణములో లభ్యము కాకపోతే ఆ ఇంట వుండేవారికి ఆరోగ్య సౌఖ్యములోపించును. ఇంటిముందు సూర్యకిరణ ప్రసరణ తగినంతగా వుండినప్పుడే సౌఖ్యజీవనం లభించును. అతి సర్వత్రవర్జయేత్ అనగా అతిగా ఏది వున్నను బాధాకరమే. సూర్యరశ్మి మరి ఎక్కువగ ఇంటియందు వున్నను ఇబ్బందికరమే. కావున మహర్షులు మానవ నివాసాలకు షోడశగృహములనుగురించి తెలిపినారు. ఇందు కొన్ని శుభదాయకమైనవి, మరికొన్ని దుఃఖదాయకమైనవి అని తెలిపినారు. శుభదాయకమైన ఏకశాలలయందు నివసించువారికి శుభఫలితములు ప్రసాదించుననివారు మనకు తెలియజేసినారు. ఇవి ప్రదక్షిణ పూర్వకము అనగా ఎడమనుండి కుడివైపుకు తిరుగు సవ్యప్రదక్షిణ పద్ధతినను సరించి తెలుపబడినది. సూర్యుడు ప్రాత:కాలములో తూర్పుదిక్కున ఉదయించి క్రమముగా మధ్యాహ్నమునందు దక్షిణ దిక్కునందున సాయంత్రమునదు పడమరదిక్కునను అర్ధరాత్రి యందు ఉత్తర దిక్కునను మరల సూర్యోదయమునకు తూర్పుదిక్కునందు వుండును. సూర్యకిరణ ములు అయినను సూర్యోదయపుకాలంలోని కిరణములలో మంచి శక్తి మాన వులకు ఉపయోగపడే విధంగా వుంటుంది. అక్కడనుండి సూర్యకాంతి శక్తిక్రమముగా పెరిగి మధ్యాహ్న సమయానికి తీక్షణమైన కిరణములతో మానవులకు అసౌఖ్యము వుండు ను. కావున మానవునికి మూలాధారమైన ఉష్ణశక్తిని గృహమునందు నివసించే మనపైన తగురీతిలో వుండులాగున వున్నప్పుడే ఆరోగ్యము లభించును. దీనినిబట్టి షోడశశాలలో కొన్ని శుభకరమైనవి. కొన్ని అశుభకరమైనవి తెలిపియున్నారు.

మహర్షులు సవ్యప్రదక్షిణ పద్ధతిలో శాలా అళిందములు(వసారాలు) వుండుపద్ధతిని తెలిపియున్నారు. మనము ఆ పద్ధతిని అనుసరిం చినప్పుడు మాత్రమే మహర్షులు చెప్పినటువంటి శుభాశుభ ఫలితములు అనుభవములోనికి వస్తాయి. సవ్యపద్ధతిలో దిశల స్థానములను గుర్తించి ఫలితములు చెప్పబడ్డవి. ఆ విధంగా కాకుండా అపసవ్య పద్ధతిలో దిశలను లెక్కించు కుంటూపోతే 12వ స్థానము 2వస్థానముగా తలచటము జరుగుతుంది. అదేవిధంగా శాలా అళిందములుయందు ద్వారస్థాపన కూడ శాస్త్రయుక్తముగానే అనుసరించ వలయును. ఇప్పటి అనుభవ పండితుల ఉచ్చ,నీచల పద్ధతి అనుసరించినచో మనము అనుకన్న ఫలితములను పొందలేము. ఎందువలనంటే మహర్షులచే చెప్పబడిన

ఉచ్ఛ,నీచ సిద్ధాంతమునకు విరోధముగా అనుభవ వాస్తు పండితులు ఉచ్ఛనీచను ప్రతిపాదించినారు కాబట్టి, ఏదో ఒక పద్ధతిని సంపూర్ణంగా అనుసరించాలేకాని మధ్యమధ్యలో మన ఇష్టానుసారం మార్పులు చేయరాదు. ఏదో ఒక పద్దతి అని అన్నారు కదా అనుభవ వాస్తు పండితుల పద్ధతిని సంపూర్ణంగా అనుసరిం చవచ్చునని మీరుచెప్పుచున్నారు అంటే కాదు అని చెప్పుచున్నాను. నలుపుకు, తెలుపుకు భేదం ఇది అని మహర్షులు మొదటనే చెప్పినారు కాబట్టి ఆపద్ధతినే అనుసరించాలని నేను చెబుచున్నాను. అయితే మానవ విజ్ఞాన సంపద, పరిశీలన శక్తిని పరిశోధన ఇక అవసరం లేదా, అని అంటే అవసరమే. అది మహర్షుల హృదయములు తెలుసుకొని ప్రాథమిక సూత్రములకు విరుద్ధంగా వుండరాదు. అని మహర్షులు ఉచ్ఛనీచ, స్థలములో వున్న ఎత్తు పల్లులకు చెబితే అనుభవ పండితులు దానిని దిశలకు వర్తింపచేసి శాస్త్రమును గందరగోళమునకు చేర్చినారు.

తూర్పు సింహద్వారం గల గృహమునకు దక్షిణమున ద్వారమువుంచి ఆ తరువాత ఉత్తర ద్వారం ఉంచవలయును. ఉత్తర ద్వారమును ఈశాన్యదిక్కువైపుకు మరల్చినారు. మహర్షులు ఏది అయితే తప్పు,దోషకరమైనది అని చెప్పినారో దానిని శుభకరమైనది, మంచిది అని అనుభవ పండితులు చెప్పుచున్నారు. ఈ ఏకశాలా విధానంలోని షోడశ గృహములు తారుమారు అవుతాయి.

షోడశ గృహములలో 14వది అయిన ఆక్రందనశాల అని తూర్పు – పశ్చిమ – ఉత్తర దిశల ద్వారములు వసారాలు కలది. దక్షిణమున గోడ వుంటుంది. ఆ గోడకు ద్వారముగాని, వసారాలుగాని వుండవు. ఇటువంటి నిర్మాణమును ఆక్రందనశాల అని అందురు. అనగా ఆ ఇంటిలో జరగరాని కీడు హఠాత్తుగా జరిగితే ఫలితం ఆక్రందన. ఈ ఆక్రందన గృహమునే పశ్చిమ సింహద్వారమునకు అన్వయించి నిర్మాణము చేసిన దానిని గృహశేఖరము అని పిలువబడుతుంది. అనగా ఆక్రందన అత్యంత దోషములుగల నిర్మాణము దిశను మార్చగానే అనగా తూర్పు సింహద్వారము నుండి పశ్చిమ దిశ సింహద్వారమునకు అన్వయించుకోగానే సకల శుభఫలములను ఇచ్చి గృహశేఖరమని కీర్తి వహించినది. కావున దిశనుబట్టి కూడ పరిశీలన చేయవలసి వున్నది అనగా ఆక్రందనశాలను పశ్చిమ ముఖముగా నిర్మించవచ్చును. దీనికి కూడిపార్శ్వము(ఉత్తరము)న వసారా మరియు ద్వారము యుండును. ముందు వెనుక భాగముల వసారా ద్వారములు యుండును. దీనికిగల ద్వారములు మరియు మూడువసారాలు శాస్త్రబద్ధముగా వున్నవి. కావున ఇట్లు నిర్మించినశాల యోగ్యమగును. దీనినే గృహశేఖరము అని అందురు. ఇది ధనలాభమును కలిగించును. అందువలననే మయుడు దక్షిణే ద్వారహీనంతు గృహశేఖర మర్థదమ్ అని చెప్పియున్నాడు. కావున పూర్ణబాహు ప్రవేశము అనునది ఈ షోడశ గృహములందలి ప్రధాన సూత్రము. ఆక్రందన శాలో పూర్వదిక్కునందు పశ్చిమదిక్కునందు ఉత్తరదిక్కునందు ద్వారములుంటాయి. తూర్పు సింహద్వారము నుండి ఇంటిలోనికి ప్రవేశించిన గృహస్థుడు గృహము వెలుపలికి గాని వసారాలకు వెళ్ళాలంటే దక్షిణ దిక్కున ద్వారం లేనందువల్ల పడమరనుంచి కాని, ఉత్తరం నుంచికాని వసారాలలోనికి గాని,

గృహవెలుపలకు రావలసివుంటుంది. ఇది పూర్ణ బాహు ప్రవేశ విధానానికి విరుద్ధమైనది.

అదేవిధముగ రిపుఅనగా శతృగృహము దక్షిణ సింహద్వారం కలిగివుంటుంది. వెనక భాగాన ఉత్తరమువైపు పాణిద్వారముంటుంది. సూర్యోదయ కిరణములు ద్వారముల గుండా గృహములోపలికి ప్రవేశింపవు. దక్షిణ సింహద్వారం నుండి సూర్యకిరణములు ఇంటిలోనికి ప్రవేశించాలంటే మధ్యాహ్నకాలం అవుతుంది. అతి తీక్షణమైన కిరణములను భరించుశక్తి మానవులకు తక్కువగా వుటుంది. అందువలన పడమరవైపున ద్వారం వున్నప్పుదు సాయంకాలం సమయంలో సూర్యకిరణము గృహములో ప్రవేశిస్తాయి. వాటిలో తీక్షణమైన (ఉగ్ర) ఉష్ణశక్తి ఉండదు కాబట్టి వాటిని మనము ఉపయోగించుకొనవచ్చును. మరి పడమరవైపునే ద్వారము ఎందుకుంచాలి తూర్పువైపున ఉంచితే సూర్యోదయ సమయంలోని కిరణములు ఇంకామంచివి గదా అని అంటే అది పూర్ణబాహు ప్రవేశసూత్రా నికి విరుద్ధమైనది. అందువలన పడమరవైపున మాత్రమే ద్వారము ఉంచాలి. పడమర ద్వారమైతే సూర్యకిరణములు ఇంటిల్లిపాది ప్రవేశిస్తాయి. అట్లా కాకుండా కిటికీ వుంచినచో కిటికీవుంచిన గదికి మాత్రమే సూర్యకిరణాలు ప్రవేశిస్తాయి. ఇంటి మొత్తానికి ప్రసరించవు. ఈ విపులశాలను ఉత్తమశాల అని కూడ అందురు.

ఉత్తర సింహద్వారం దక్షిణమున పృష్టద్వారమువుంచి దానిని కూడా రిపుగృహము (శతృ) అని అంటారు. ఉత్తర సింహద్వారం ఇంటికి సూర్యకిరణములు సూర్యోదయ సమయమున గృహమునందు ప్రసరించవు. దక్షిణ దిక్కునందువున్న పృష్టద్వారము నుండి సూర్యకిరణ ములు మధ్యాహ్న సమయంలో ప్రసరిస్తాయి. ఆ కిరణాల తీవ్రతను భరించుట చాలా కష్టముగా వుండును. అందువలన ఉత్తరంనుండి ప్రదక్షిణ క్రమముగా చూచిన తూర్పు దిక్కువైపుకు వెళ్ళాలి. అందువలన తూర్పుదిక్కున ద్వారము వుంచినచో ఈ గృహమునకు శ్రీనిలయము అని పేరు. ఇది సర్వదా కీర్తింపబడును. నాలుగు దిక్కుల ద్వారములు, వసారాలు వున్నచో దానిని విజయగృహము అందురు.

పై విషయములను పరిశీలించగా ఏకశాలలోని షోడశ గృహములు ప్రదక్షిణ క్రమంలో ద్వారాలు, వరండాలు వుండాలి అని, అంతేగాక గృహములోనికి అనువైన ఆరోగ్యకరమైన సూర్యకాంతి ఇంటిలో ప్రవేశించటానికి ఉద్దేశింపబడినవని తెలుస్తూ వున్నది. తూర్పు, పడమర దిక్కులయందు ద్వారములుంటే దానిని కాంతాగృహమని, పుత్రపౌత్ర సౌఖ్యం లభించునని తెలుపబడినది. తూర్పు, పడమర ద్వారములు ఉన్నవి కాబట్టి సూర్యోదయ, సూర్యాస్తమయ కాలమునందలి సూర్యుని ఆరోగ్యకరమైన కిరణములు గృహములోనికి ప్రవేశిస్తాయి. దీనిని ప్రశస్తమైనదిగా చెప్పబడినది. కాని ఉత్తర సింహద్వారం దక్షిణం పృష్ట ద్వారం, దక్షిణ సింహద్వారం ఉత్తర పృష్టద్వారములు గల ఇండ్లను శతృగృహములుగా పేర్కొనబడినవి. అనగా అశుభకరమైనవని. ఎందువలననగా సూర్యోదయ, సూర్యాస్త మయములలోని ఆరోగ్యవంతమైన, ఆహ్లాదకరమైన సూర్యకిరణములు గృహములోనికి ప్రసరించవు. అందువలననే ఉత్తర సింహద్వారం గృహము,దక్షిణము పృష్ఠ (వెనుక) ద్వారము తూర్పున పార్శ్వద్వారము ఉంచితే అది శ్రీనిలయముగాను పేర్కొనబడినది. దక్షిణ సింహద్వారము ఉత్తరమున పృష్ఠ (వెనుక) ద్వారము పడమరవైపు పార్శ్వద్వారము వుంచినచో శతృ అనేది విపులశాలగా మారినది. కావున ఏకశాలా విధానములో ఆరోగ్య రహస్యములు ఇమిడి వున్నవని గ్రహించగలము.

| క్రమ సంఖ్య | గృహ నామము | తూర్పు | దక్షిణం | పడమర | ఉత్తరం | ద్వార దిశ | ఫలితము |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ధృవం | s | s | s | s | ద్వార హీనము | ధన, ధాన్య,సుఖం |
| 2 | ధాన్యం | I | s | s | s | తూర్పు | ధాన్య,సుఖం |
| 3 | జయం | s | I | s | s | దక్షిణము | విజయము |
| 4 | నందం | I | I | s | s | తూర్పు–దక్షిణం | స్త్రీకి హాని |
| 5 | ఖరం | s | s | I | s | పడమర | సంపద నాశనము |
| 6 | కాంతం | I | s | I | s | తూర్పు – పడమర | పుత్రపౌత్రసౌఖ్యము |
| 7 | మనోహరం | s | I | I | s | దక్షిణం – పడమర | లక్ష్మీప్రదం |
| 8 | సుముఖం | I | I | I | s | తూర్పు – దక్షిణం – పడమర | భోగప్రదము |
| 9 | దుర్ముఖం | s | s | s | I | ఉత్తరం | దు:ఖము |
| 10 | క్రూరం | I | s | s | I | తూర్పు – ఉత్తరం | సర్వదు:ఖములు |
| 11 | రిపుద | s | I | s | I | దక్షిణం – ఉత్తరం | శతృభయము |
| 12 | ధనద | I | I | s | I | తూర్పు – దక్షిణం – ఉత్తరం | ధనలాభము |
| 13 | క్షయం | s | s | I | I | పడమర – ఉత్తరం | సరవనాశనము |
| 14 | ఆక్రందం | I | s | I | I | తూర్పు – పడమర – ఉత్తరం | శోకము |
| 15 | విపులం | s | I | I | I | దక్షిణం – పడమర – ఉత్తరం | ధన యశోవృద్ధి |
| 16 | విజయం | I | I | I | I | తూర్పు – దక్షిణం – పడమర – ఉత్తరం | విజయము |

## ద్విశాల, త్రిశాల విధానములు

శాలావిధానము దిక్కులననుసరించివున్నది. శుభగ్రహదిక్కులైన తూర్పు,ఉత్తరములయందు నిర్మాణభారము తక్కువగావుండు విధముగను, నైసర్గిక పాపగ్రహదిశలైన దక్షిణ,పడమరల యందు అధిక బరువు వుండువిధముగ శాలలను నిర్మించుకొనవలసినది. ద్విశాలా విధానములు దక్షిణము,పడమర దిశలయందు శాల లుంచి తూర్పు ఉత్తరముందు తక్కువ బరువు వుండువిధముగా నిర్మించుట సర్వ శ్రేష్ఠముగా భావింపబడుచున్నది. అధిక శుభఫలితములు లభించును. ఆ విధంగా కాకుండా తూర్పు దక్షిణములందు రెండుశాలలు వేసినచో ఒకటి శుభ దిక్కున మరొకటి పాపగ్రహ దిక్కున వేయటం వలన ఆశించిన ఫలితములు వుండవు, అనగా శూన్యశుభ ఫలితములు ఉంటాయి. ఇదే విధముగా పడమర ఉత్తర దిశలయందు ద్విశాలను నిర్మించినను శూన్యశుభ ఫలితములుండును. అనగా లాభము,నష్టము లేకుండా సమమైన ఫలితములు వచ్చుచుండును. అనగా అశుభదిక్కునందుంచిన బరువువల్ల వచ్చే శుభఫలితములను శుభ దిక్కునందుంచిన శాల, దూలము మొదలగు వాటివల్ల వచ్చే దుష్ఫలితమునకు సమానమై పోవుచున్నవి. ఆ విధంగా కాకుండా తూర్పు,ఉత్తర దిశలయందు ద్విశాలను నిర్మించినచో పూర్తి విరుద్ధ ఫలితములు వచ్చును. రెండు శుభదిక్కులయందు నిర్మాణభారము వుంచి పాపగ్రహదిక్కులైన దక్షిణ, పడమర దిశలయందు ఎటువంటి నిర్మాణభారము లేకపోవుట వలన పాపగ్రహ దిక్పతులైన కుజ,శనులు అధిక అశుభ ఫలితములులను కలుగుచేయుదురు. శుభఫలితములను ఇచ్చు దిక్పతులైన రవి,బుధ,గురులు అధిక బరువును గ్రహించుట వలన బలహీనమయ్యెదరు.

ఇది దక్షిణ,పడమర దిశలయందుంచిన ద్విశాలా విధానం ఇచ్చు ఫలితము పూర్తిగా విరుద్ధ ఫలితములు అనుభవించ వలసి వస్తున్నది. కావున ద్విశాలా విధానం దక్షిణ,పడమర దిశలయందే నిర్మించుట శ్రేష్ఠమైనది అని తెలియుచున్నది.

త్రిశాలా విధానములో శుభఫలితములు ఇచ్చేవి అశుభ ఫలితములు ఇచ్చేవి వున్నాయి. ఇది కూడా ప్రధానంగా దిక్కులను బట్టి నిర్ణయింపబడవలసిన విషయము. నాలుగు దిక్కులలో మూడు దిక్కులయందుంచు శాలా విధానమును త్రిశాలా విధానం అందురు.

1. దక్షిణము - పడమర - ఉత్తరము
2. పడమర - ఉత్తరము - తూర్పు
3. ఉత్తరం - తూర్పు - దక్షిణము
4. తూర్పు - దక్షిణము - పడమర

పై విధముగా త్రిశాల విధానమును అనుసరించ వచ్చును. ఒకటవ విధానము ప్రకారము దక్షిణము - పడమర -ఉత్తర వీటిననుసరించి నిర్మాణభారముతో నాలుగు దిక్కులయందు మూడు దిక్కులలోనే ఉంచబడినది. దక్షిణ, పడమర పాపగ్రహ దిక్కులు ఈ దిక్కులయందు అధికభారము వుంచినాము. మొత్తం 4 భాగములలో రెండు భాగములు పాపగ్రహ దిక్కులందు ఒక్కభాగం శుభగ్రహదిక్కునందుంచుట జరుగుచున్నది. నాల్గవ

దిక్కు అయిన తూర్పునందు అసలు నిర్మాణము లేదు కాబట్టి బరువు అనేదిలేదు. అనగా ఒక శుభగ్రహ దిక్కునందు ఎటువంటి నిర్మాణం లేకుండా వుండుటను, ఒక శుభగ్రహదిక్కైన ఉత్తరమునందు తక్కువ భారము ఉంచి అధికభారమును పాపగ్రహదిశలైన దక్షిణ పడమర లందుంచుట వలన ఇది చాలా శ్రేష్ఠమైనది. అధిక శుభఫలితములు పొందవచ్చును. రెండవ విధానమైన పడమర – ఉత్తరం – తూర్పు. ఈ పద్ధతియందు దక్షిణము నందు ఎటువంటి నిర్మాణములు లేకుండా ఖాళీగా వుంచబడుతుంది. అనగా పాపగ్రహదిశయందు తప్పనిసరిగా నిర్మాణభారం వుంచవలసివుండినా దానిని పూర్తిగా ఖాళీవుంచటం చాలా దోషకరమైనది. ఉత్తరము,తూర్పు ఈ రెండు పూర్తిగా శుభగ్రహదిక్కులు. అందువలన నిర్మాణ భారము ఏ దిక్కులయందుండ రాదో ఆ దిక్కులయందే అధిక బరువును వుంచు విధంగా ఈ త్రిశాలా విధానం వున్నది. దీనివలన పాపగ్రహదిక్కుల అయిన పడమర దిక్కునందు మాత్రమే భారం తక్కువవుంచి రెండు శుభగ్రహదిక్కులైన ఉత్తరం– తూర్పులయందు అధికభారం వుంచుట అధిక దుష్ఫలితములను పొందవలసి వుంటుంది. ఇటువంటి త్రిశాలా విధానం వాడరాదు.

మూడవ విధానమైన త్రిశాల నిర్మాణమునందు ఉత్తరము – తూర్పు – దక్షిణము కూడా లోపభూయిష్టమైనది అనగా శుభఫలితములను ఇవ్వలేనిదిగా వుంటున్నవి.

నాల్గవది అయిన త్రిశాలా విధానము శ్రేష్ఠమైనది కూడ దీనిలో రెండు దిక్కులు పాపగ్రహ దిక్కులు. ఒక్కటి శుభదిక్కు తూర్పు.

కాని పై నాలుగ త్రిశాలా విధానములో మొదటిది నాల్గవదాని కన్నా మిక్కిలి శ్రేష్ఠమైనది. ఎందువలననగా అన్ని దిక్కులకు రారాజు అయిన తూర్పునందు ఎటువంటి నిర్మాణములు లేకుండా ఖాళీగా వుంటుంది. సూర్యోదయ కిరణములు పుష్కలంగా ప్రసరిస్తాయి. ఈ విధానంలో ఆరోగ్యకరమైన సూర్యకిరణాలు ప్రాత: కాలంలోనే ప్రవేశిస్తాయి.

## సింహద్వార స్థాన నిర్ణయము

మానవ జీవన విధానమును శాసించేది నవగ్రహములైతే అదే విధముగా వాస్తు శాస్త్రము ను శాసించేది కూడ నవగ్రహాలు మరియు అష్టదిక్పాలకులు. ఈ విధానమంతా జ్యోతిష శాస్త్రములో వివరంగా తెలుపబడినది. అందువలన మన ఇంటి నిర్మాణముపై నవగ్రహ ముల ప్రభావం అధికంగా ఉంటుంది. కావున పూర్వీకులు ఇంటికి ముఖద్వారమైన సింహద్వారమును నవగ్రహాలననుసరించి ద్వార స్థాపన స్థానములను నిర్ణయించినారు. దీనివలన ప్రతి ఇంటికి పూజాగది ఈశాన్యంలో వుంటుంది. కొన్ని యుగాలనుండి పూజాగదులను ఈశాన్య దిక్కులోనే నిర్మించి తూర్పు దిక్కును చూస్తూ పూజచేసేవారు. ఈశాన్యదిక్కు అధిపతి ఈశానుడు అనగా శివుడు అనగా మంగళములు ఇచ్చేవాడు అని భావించి ఆ దిక్కును పరమ పవిత్రంగా భావించి ఆ దిక్కునందే దేవతారాధన చేయుట అనాదిగా నుండి వచ్చుచున్న సాంప్రదాయము. హైందవుల ఇండ్లలో విధిగా పూజా గృహము వుంటుంది. ప్రాత:కాలంలోనే నిత్యపూజాదికములు

చేసిన తరువాతనే దైనందిన కార్యక్రమాలను చూచుకుంటారు. ఇల్లు అనగా ఆ ఇంటిలో పూజాగది తప్పని సరిగా వుంటుంది. అది శుభదిక్కు అయిన ఈశాన్యంలోనే ఉంటుంది. ఆ విధముగ ఈశాన్య దిక్కున దేవుని గది కట్టించుకొని యుగాలనుండి అనుసరిస్తూ వుంటే ఇటీవల అనుభవ వాస్తు సిద్ధాంతులు సింహద్వారస్థాపనలో కొత్త సిద్ధాతం తీసుకొని వచ్చినారు. దీనితో ఈశాన్య పూజాగది అనేది లేకుండా పోయినది. అంతేనా ఆ దిక్కులలో ద్వారాలుంచి నడకకు దారిగా ఏర్పరచుచున్నారు. ఇంటిలోనికి రాకపోకలకు మార్గంగా వుంచినారు. పూజనీయంగా పవిత్రంగా వుంచుకునే దిశలోనే నడక ఏర్పరచినారు. ఈ అనుభవ వాస్తు సిద్ధాంతులు చెప్పే విషయం మహర్షులకు తెలియకుండా వున్నదా. జ్ఞానదృష్టి కలిగినవారికి ఈ విషయం ఆలోచించలేక పోయినారా. అనుభవ వాస్తు సిద్ధాంతులు ఉచ్ఛ,నీచ అనే సరికొత్త సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టినారు. ఇచ్చట ఉచ్ఛ అంటే శుభదిక్కు, నీచ అంటే పాపగ్రహదిక్కు అని అర్థము. దీని ప్రకారము తూర్పు సింహద్వారముగల గృహమునకు సింహద్వారమును తూర్పు ఈశాన్యంలో నిర్ణయించినారు. అనగా శుభ దిక్కువైపు నడకసాగుతుంది. కావున శుభంగా వుంటుంది అని భావించినారు. ఈ దిక్కున నడక ఏర్పరచితే ఈశాన్యదిక్కు అధిపతి ఈశ్వరుడు శుభదిక్కు పవిత్రమైన దిశ. దీనిలో దేవతాగృహం వుంచవలసినదానిని ఎత్తివేసి దానికి అప్రధాన్యం ఇచ్చినారు. హైందవులు పూజాగదికి ఎంతటి ప్రాముఖ్యమిచ్చినారో ఈ అనుభవ సిద్ధాంతులు దానికి ప్రాధాన్యత ఇవ్వలేదు. ఇంటిలో రోజు నిత్యదీపారాధన జరుగు ఇల్లులు కళకళలాడతాయి అని అందరికి తెలుసు. కాని ఈ సిద్ధాంతులు ప్రజలలో అనాది సిద్ధమైన ఆచారాన్ని కాదన్నారు. మరి మహర్షులు తూర్పువైపున సింహద్వారం వుంచటానికి ఆ దిశను ఈశాన్య దిక్కునుండి ఆగ్నేయంవరకు వున్న మొత్తం స్థలాన్ని 9 భాగాలుగా చేసి తూర్పుదిక్కును పాలించు నవగ్రహాలస్థానాలను నిర్ణయించినారు. ఈశాన్యం నుండి ర-చ-కు-బు-గు-శు-శ-రా-కే పాలించు ప్రాంతాలు అని తెలిపివున్నారు. ఇంటి ప్రధానద్వారము శుభగ్రహాల స్థానములలో అనగా బుధ-గురు-శుక్ర-స్థానాలలో అనుకూలంగా వుండు స్థానములో సింహద్వారం వుంచుకోవాలి అని చెప్పినారు. అనగా మహర్షులు చెప్పబడిన విధముగానైతే ఈశాన్య పూజాగది వస్తుందికదా. ఈశాన్య దిక్కు పవిత్రంగా వుంచుకోవచ్చుగదా. నడకగా మార్చి అపవిత్రం చేయటమే కదా. అనుభవ పండితులు చెప్పినట్లుగా ఈశాన్య దిశలో సింహద్వారం వుంచితే. అది నైసర్గిక పాపగ్రహమైన రవిస్థానము. అనగా ఇంటి ముఖ ద్వారం పాపగ్రహస్థానంలో వుంచుట ఎంతవరకు సబబు. ఆ మహర్షులు చెప్పినట్లుగానే మంచిదిశలు, చెడుదిశలు శుభగ్రహాలు, పాపగ్రహాలు అనువర్గీకరణను అనుసరిస్తూ కూడ పాపగ్రహమైన రవిస్థానంలో సింహద్వారం వుంచమని చెప్పడం ప్రజలను తప్పుదారి పట్టించటమే కదా! పూర్వీకులు తూర్పువైపున రెండుద్వారములు వుంచవలనంటే సింహద్వారమును బు-గు-శు స్థానములలో వుంచాలి. రెండవ ద్వారమును చంద్రస్థానము లో వుంచవలయును అని చెప్పినారు. అనగా మహర్షులు సింహద్వారమే కాకుండా సాధారణద్వారముకూడా శుభస్థానములలో వుంచాలి అని చెబితే ఈ అనుభవ సిద్ధాంతులు ఒకేఒక ద్వారమును మాత్రమే వుంచాలి అని చెబుతుంటారు. అదికూడ పాపగ్రహస్థానమైన

రవిస్థానములో పెట్టమని. ఇది ఏ విధముగా వున్నదంటే ఉన్నదానికన్నా ఇంకా మంచిదాన్ని చేస్తున్నాము అనుకొని ఉన్నదాని కన్నా చాలా చెరుపు చేయుచున్నారు.

సంస్కరణ అంటే బాగుచేయుట. మలినమైనది, చెడ్డదైన విషయాన్ని మంచిదిగా చేయడమే సంస్కరణ అని అంటారు. కాని ఇక్కడ సంస్కరణ పేరిట ఉన్న మంచిదానిని పాడుచేసినారు. కావున గృహము నిర్మించుకొనువారు ఈ విషయములపై శ్రద్ధ చూపవలసినదిగా విన్నవించుచున్నాను. చంద్రస్థానంలో సింహద్వారం పెట్టమని చెప్పినారు. అయితే రెండు గదుల వైశాల్యంగల చిన్న ఇంటికి మధ్యభాగంలో ద్వారము పెడితే ఇంటికి మరుగు ఏమీవుండదు. అటువంటి అవసరమైన వారికోసమే చంద్రస్థానములో ద్వారం వుంచమన్నారు. అది కూడా శుభస్థానం కాబట్టి.

దక్షిణదిక్కున సింహద్వారం వుంచవలసిన స్థానమును అనుభవ సిద్ధాంతులు తూర్పు ఆగ్నేయ స్థానమును నిర్ణయించినారు. దీని ప్రకారం ద్వారము పడమరదిక్కు కన్న తూర్పు దిశవైపు ఎక్కువభాగం వున్నది కాబట్టి శుభదిక్కు అయిన తూర్పు మంచిది అని వారి ఊహ. ఇచ్చటకూడ పాపగ్రహమైన రవిస్థానములోనే సింహద్వారము వుంచమని చెప్పుచున్నారు. పశ్చిమ సింహద్వారమునకు కేతుగ్రహ స్థానంలో వుంచుతున్నారు. ఉత్తరదిశలో కూడ కేతు,రాహు అను పాపగ్రహాల స్థానములలోనే సింహద్వారములు వుంచమని చెబుతున్నారు. అనగా మహర్షులు ఏ స్థానాలైతే వద్దు అని నొక్కి చెప్పిన స్థానములలోనే అనుభవ పండితులు ఆ స్థానములు మంచివి అని చెప్పి పెట్టించుచున్నారు. ఇచ్చట విరోధము ఏర్పడుచున్నది. దివ్యజ్ఞానులైన మాటను విశ్వసించాలా? అనుభవ పండితుల మాటలను విశ్వసించాలా? అను విధమైన ఊగిసలాట ఏర్పడుతుంది. ఎందుకు వీరు పరస్పర విరుద్ధ వచనాలు చెబుతున్నారు. గృహస్థులను అయోమయమైన స్థితిలో వుంచుతున్నారు అనిపించుతుంది. మహర్షులు చెప్పినది కాదని వీరు ఈ విధంగా చెబుతున్నారంటే అనుభవ పండితులు కొత్త విషయం చెప్పివుండవచ్చుగదా అని అంటే ఏదీ లేదు. మహర్షులు ఏవి శుభదిక్కులు ఏవి అశుభదిక్కులు అని వర్గీకరణ చేసినారో దానినే అనుభవ పండితులు స్వీకరించినారు. నవగ్రహములలో ఏవి నైసర్గిక శుభగ్రహాలు ఏవి పాపగ్రహములు అని మహర్షులు చేసిన వర్గీకరణనే అనుభవ పండితులు అంగీకరించి అనుసరిస్తున్నారు. దిక్పతులలో శుభులు ఎవరు, పాపులు ఎవరు అని మహర్షులు వర్గీకరణనే అనుభవ పండితులు అంగీకరించినారు. మరి దిక్కులు, దిక్పతులు, నవగ్రహములు ఈ మూడింటిని మహర్షులచే వర్గీకరింపబడిన దానిని అంగీకరించి అనుసరిస్తూ సింహద్వార నిర్ణయములో ఎందుకు ప్రత్యేక విధానమును అనుసరించుచున్నారు. మీ విధానము వలన ఈశాన్య దిక్కులో పూజగది అనేది పూర్తిగా లేకుండా పోయినది ఈ రోజులలో. యుగాలనుండి ప్రజలు నమ్మి ఆచరిస్తున్న ఆచారాన్ని లేక నమ్మకాన్ని మీరు ఎందుకు కాదనాలి? పంచభూతములతోనే గృహనిర్మాణము జరుగుతుంది. పంచభూతముల సమన్వయ పద్ధతిలో గృహనిర్మాణము చేయాలి అను మహర్షుల వాక్యంతో మీరు ఏకీ భవించినప్పుడు ఈ సింహద్వారస్థాన విషయములో కూడ ఏకీభవించ వలసిన ఆవశ్యకత వున్నది. దీనిద్వార నాల్గు దిక్కులలో ఏ దిక్కున సింహద్వారము పెట్టుకొనినను ఈశాన్యమున

పూజాగది వస్తున్నది. అనుభవ పండితుల ప్రకారము ఏదిక్కున సింహద్వారం పెట్టినను ఈశాన్య దిక్కులో పూజాగది రాదు. సాక్షాత్తు వైకుంఠ నివాసి అయిన లక్ష్మీ నారాయణుడు త్రేతాయుగములో రావణాసురిని సంహరించుట కొరకు మానవుడిగా అవతరించినాడు. శ్రీరాముడు వాస్తు శాస్త్ర విషయములకు అమితమైన ప్రాధాన్యత ఇచ్చినారు. నేనువ్రాసిన శ్రీ రామాయణంలోని వాస్తు విషయములు అను వ్యాసము చదివితే శ్రీరాముడు వాస్తు శాస్త్రాన్ని ఏ విధంగా పాటించినాడో తెలియును.

# పరిసరాల ప్రభావము

శాస్త్రీయమైన పద్దతిలో మనము గృహము నిర్మించుకొనిన తరువాత ఇంటి చుట్టు ప్రాకారము (ప్రహరీ) నిర్మించుకున్న యెడల ఎటువంటి భయాందోళనలకు లోనుకాకుండా సుఖజీవనమును ఆ గృహములో పొందవచ్చును. ఇటీవలి కాలంలో మన ఇంటిచుట్టుప్రక్కల వారి ఇండ్ల స్థలముల ప్రభావం మన గృహముపై అధికంగా పడుతుంది అని భయాం దోళనలు రేకెత్తించు ప్రచారము మన ఇంటి వాస్తును ప్రభావితం చేస్తున్నట్లుగాను ఇంటి వెలుపలి పరిసరాల వాస్తు కేంద్ర ప్రభుత్వంతోను ప్రహరీలోపలవున్న గృహవాస్తు రాష్ట్ర ప్రభుత్వములాంటిదని రాష్ట్ర ప్రభుత్వము కన్నా కేంద్ర ప్రభుత్వమే అత్యధికబలము కాబట్టి ఇంటివాస్తును అత్యంత ఎక్కువగా ప్రభావితం చేయుచున్నది. పరిసరాల వాస్తే అనే మాటలు ఇటీవలి వాస్తు గ్రంధములందు చూచుట జరుగుచున్నది. అనగా వాస్తు పండితులను వారు మీరుచెప్పినట్లుగా మీ పర్యవేక్షణలోనే ఈ గృహము నిర్మించినాము కదా. మీరు చెప్పేటటువంటి అద్భుత ఫలితములు మాకు కలగటం లేదేమో అనిపిస్తుంది అని ఎవరైనా ప్రశ్నిస్తే దానికి తప్పిచుకునే ప్రయత్నమే పరిసరవాస్తు అనేది. ఎప్పుడైతే స్థలమును నాలుగు దిక్కులు సమానముగా చూచి ప్రహరీ కట్టినామో అప్పుడు ఈ భూమి చుట్టు ప్రక్కల వున్న భూమి యొక్క ప్రభావం ఈ స్థలంపై వుండదు. ఆ విధంగా సంబంధం లేకుండా వుండాలనే ఉద్ధేశ్యముతోనే లక్షలాది రూపాయలు ఖర్చుచేసి ప్రహరీని నిర్మించు కునేది. ప్రహరీ కట్టిన తరువాత కూడ పరిసరాల ప్రభావం వుంటుంది అని చెప్పటం వలన ప్రహరీ యొక్క ఉద్ధేశ్యమే దెబ్బతింటుంది. ఈ విధముగా పరిసర ఇండ్ల వారి ప్రభావం మన గృహంపై వుంటుంది అని చెప్పడం ద్వారా అన్నదమ్ములు,అక్కచెల్లెళు బంధుమిత్రులుగా ఇరుగుపొరుగు వారు కలసిమెలసి వుండే విధానానికి విఘాతం కలుగు తుంది. ఇరుగుపొరుగు వారితో పరస్పర ఘర్షణలు వస్తాయి, తద్వారా అనురాగ ఆప్యాయత లకు దూరమవ్వవలసి వస్తుంది. మానవుడు సంఘజీవి అను సహజసూత్రానికి ఎదిరిం చినట్లు అవుతుంది. అంటే పరిసరాల వాస్తు ప్రభావం అంత అధికశక్తి వంతమైతే అప్పుడు మనం కట్టుకునే గృహం శాస్త్రమును అనుసరించినందు వలన కలిగే ఫలి తమేముంటుంది. ఈ పద్ధతిలో గృహస్థుడు తన ఇష్టానుసారం గృహం కట్టుకునే స్వేచ్ఛను పోగొట్టుకొనుచున్నాడు. ఇది వాస్తుశాస్త్ర ప్రాధమిక లక్ష్యాన్ని మ్రింగివేసినట్లు అవుచున్నది. అనగా మన ఇంటిప్రక్క ఉత్తర దిశలో ఉన్నవారు మన ఇంటికన్నా ఎత్తయిన గృహం కట్టరాదు, డాబాలు వేయరాదు. మన ఇంటిదక్షిణ ప్రక్కన ఉన్నవారు మన ఇంటికన్నా ఎత్తైన ఇండ్లు నిర్మించుకోవాలి. అప్పుడు పరిసర వాస్తు అనుకూలంగా వుండుట జరుగు

తుంది అని చెబుతుంటారు. దీనినిబట్టి గృహస్థుని వ్యక్తిగత స్వేచ్ఛను పరిసరవాస్తు మ్రింగివేయుచున్నది. ఇటువంటి క్రొత్తక్రొత్త ఆలోచనలను వాస్తు గ్రంధములలో వారు చొప్పించుతూ ప్రజలను మానసిక అశాంతి ఆందోళనలకు గురిచేస్తున్నారు. ఎవరి శక్త్యాను సారం ఎవరి ఇష్టానుసారంగా గృహమును నిర్మించుకోవాలని గృహస్థుని మనసు ఆహ్లాద పడే విధంగా గృహమును నిర్మించుకొమ్మని ప్రాచీన వాస్తు గ్రంధకర్తలైన మహర్షులు తెలిపియున్నారు. అండము పిండము బ్రహ్మాండము అను విధంగా ఎప్పుడైతే మన ఇంటిని ప్రహారీ గోడచేత వేరుచేయబడినదో బ్రహ్మాండ ప్రభావం పిండాండం మీద ఏమీవుండదు. మానవులలో ఒక్కొక్కరికి ఒక్కొక్క రుచి ఉన్నట్లు లోకో భిన్న రుచిః అను చందముగా రకరకములైన స్థలావరణములు, గృహనిర్మాణములు వుంటాయి. అవి అన్నియూ ఉంటేనే సమాజం కొంగ్రొత్తగా వుంటుంది. కావున ఒకరి వ్యక్తిగత స్వేచ్ఛను హరించరాదు కాబట్టి ఆ పరిసరాల ప్రభావం మన గృహము మీద పడకుండా వుండటా నికొరకై వజ్రకవచం లాంటిది అయిన ప్రహారీ గోడ నిర్మాణము జరుపుకొనుచున్నాము. ప్రస్తుతము అధిక జనాభావలన, పట్టణీకరణ వలన భూమికి తీసుకునే స్థలవైశాల్యం దాదాపు కుచించుకుపోవు చున్నది. అయితే తూర్పు దిక్కున ఉదయించే సూర్యుడి కాంతి కిరణములు మన ఇంటి పరిసరముల మీద పడుటకు ఎదుటివారి ఇండ్ల మిద్దెలుగా వున్నప్పుడు ఇబ్బంది కరముగా వుంటుంది. అందువలననే తూర్పుఈశాన్యం,ఉత్తరీశాన్యం కొంత ఎక్కువ ఖాళీగా వుంచుకునేది. ఈశాన్యదిశలోని బావివలన ఆ దిశయందు భూమి బురదగా వుండకుండా సూర్యరశ్మి పడాలి. అందువలన మన ఇంటి తూర్పు ఈశాన్యదిశలయందు ఎతైన చెట్లు వుండరాదు అను ఉద్ధేశం ఇదియే. ఎప్పుడైనా ఎత్తు పెరిగినా, గుబురు చెట్లు వుంటాయో ఆ చెట్ల ప్రభావం వలన సూర్యరశ్మి భూమిమీద చేరకపోవడం వలన తూర్పుఈశాన్య దిశలు బావి వుంటుంది కాబట్టి అచ్చట భూమి అధిక తేమవంతమై వుంటుంది. సూర్యరశ్మి ప్రసరణ వలన ఆ భూమి యందలి తేమ త్వరగా ఆవిరైపోతుది. ఇది దీనిలోని మర్మము. పూలమొక్కలు అయితే ఎత్తుగ పెరగవు కాబట్టి, సూర్యరశ్మి పడకుండా నిరోధించ లేవు కాబట్టి, ఆ ప్రాంతములో పడిన నీరును ఈ పూలమొక్కలు పీల్చివేస్తాయి కాబట్టి ఈశాన్య ప్రాంతములో పూలమొక్కలు వేసుకోవాలే కాని పెద్దపెద్ద చెట్లను పెంచరాదు. అంతేకాదు ఈశాన్య దిశలోనే కదా బావి వుండేది. బావిలోని నీటికి సూర్యరశ్మి కిరణములు ప్రాకితేనే ఆరోగ్యకరమైన నీటిగా వుంటాయి. లేకపోతే బావినీటిలో సూక్ష్మజీవుల ప్రభావం అధికమవుతుంది.

చాలామంది ఈశాన్యంపై విపరీత మమకారంతో నైఋతిని బాగా తగ్గించి ఈశాన్యం పెంపుకొరకు స్థలంను క్రాసుగా నిర్ణయించుకుంటారు. ఆ విధముగా వున్నప్పుడు గృహ స్థుడు తనుకట్టే ఇంటిస్థలమును క్రాసులు, వంకరలు లేకుండా సరిచేసుకొని ఇల్లు, ప్రహారీ కట్టుకున్నాక పరిసర వాస్తుప్రభావం ఏమీ వుండదు. వీధిశూలల ప్రభావం ఇంటిమీద పడదు. ఇటీవలన గ్రామానికి ఉత్తరాన కాలువగాని, నదిగానివుంటే పరిసర వాస్తు ఆ గ్రామానికి అనుకూలంగా వుంటుంది అని ఆయా గ్రామాలు బాగా అభివృద్ధి చెందుతున్నాయి అని ఫలాన నగరానికి తూర్పున, లేదా ఉత్తరమున కాలువ, నది వున్నందున వల్ల విశేష అభివృద్ధి చెందినది అని చెబుతుంటారు. కాని నగరానికి పశ్చిమ

మున, దక్షిణమున నదులు, కాలువలు వున్నవి కూడ అభివృద్ధి చెందివుంటవి. వాటిని గురించి చెప్పరు. ఇటీవల తిరుమల వాస్తు, శ్రీశైల దేవస్థాన వాస్తు కన్నా శుభకరంగా వున్నది. అందువలన అధిక భక్తుల ఆకర్షణ జరుగుచున్నదని దీనికంతటికి వాస్తే ప్రధానమని వాస్తు దేవున్ని కూడ శాసిస్తుంది అని ప్రగల్భాలు పలుకుచున్నారు. శ్రీశైలమునకు రోడ్డుమార్గము లేనప్పుడు ఒక్కశివరాత్రి రోజుతప్ప మిగతా రోజులలో భక్తులు రానేరారు. గుడికి ఆదాయం భక్తులనుంచే వచ్చేది అల్పము. కారణం కీకారణ్యముల మధ్య ఆ గుడివున్నది. అనేక పర్వతముల మీద వున్నది. విషజంతువులనుండి ప్రాణభయం వుంది కాబట్టి రోడ్డు వేయకముందు భక్తులు విశేషంగా రాలేకపోయినారు. ఇప్పుడు రోడ్డు సౌకర్యం వేశారు, రవాణా ప్రయాణ సౌకర్యాలు మెరుగుదల వలన భక్తులు రాక పోకలు బాగాపెరిగినవి. ఈ రోడ్డు వేయకమముందు, వేసినతరువాత దేవునిగుడి ఒకేచోట వున్నది. రోడ్డు వేయకముందు గుడికి వాస్తు బాగాలేదా? పాతాళగంగ ఈశాన్యదిశన కొన్ని వందల అడుగులలోతునుండి పారలేదా? మరి అప్పుడు ఎందుకు ఇప్పుడు వచ్చి నంత భక్తులు రోజువారీగా ఆ రోజులలో రాలేదు. దానికి వాస్తుప్రభావం అని చెబుతామా? ప్రయాణ,రవాణా,సమాచార సౌకర్యం ప్రభావం కాదా? అని మిమ్ములను మీరు ప్రశ్నించు కోండి మీకే తెలుస్తుంది.

కాశీ వెళ్ళి విశ్వేశ్వరుని దర్శించుకోవాలని ప్రతి హైందవుడికి కోరిక వుంటుంది. రవాణా సౌకర్యాలులేని రోజులలో కాశీకి వెళ్ళటమంటే కాటికి వెళ్ళడం లాంటిది. కాశీకి వెళ్ళి తిరిగిరావడం ఎంతో అరుదుగా వుండేది. మరి గంగానది ఇప్పుడున్న విధంగానే ప్రయాణ సౌకర్యాలు లేని రోజులలో కూడా అలాగేవుంది. మరినేడు కాశీయాత్ర అంటే నాలుగు రోజులలో వెళ్ళిరావచ్చు. ఇంకా ఆకాశయాన విధానంలో కొన్ని గంటలలోనే కాశీకి వెళ్ళిరావచ్చు. కాబట్టి దేవుళ్ళను కూడ శాసించుచున్నది వాస్తు అని ప్రజలను భయభ్రాంతులు చేయుచున్నారు. రాజమండ్రి నగరం గోదావరికి పడమర దిక్కున వున్నది. కృష్ణానది విజయవాడకు దక్షిణ దిశన వున్నదని గమనించవలయును. భారతదేశానికి ఉత్తరాన ఎత్తైన హిమపర్వతములు వున్నవని, దక్షిణమున హిందూమహా సముద్రమున్నదని అందువలన భారతదేశం అధిక పేదరిక దేశంగా వుంటుందని ప్రచారం చేయుచున్నారు. కాని ఈ విధంగా వున్నకూడ మనదేశంలో రత్నాలు రాశులుపోసి అమ్మేవారుకదా. గజినీ మహమ్మద్ 17సార్లు భారతదేశంపై దండెత్తి అపార ధనరాశులను కొల్లగొట్టికొని పోయినాడు కదా. ఆంగ్లేయులు భారతదేశ సంపదను విపరీతంగా దోపిడీ చేసినారు కదా. చెంఘిజ్ ఖాన్ భారతదేశ సంపదను దోచుకుని పోయినాడు కదా. నేడు స్విస్ బ్యాంకులో నల్లధన నిల్లలు అపారంగా వున్నవి కదా. మరి ఉత్తర దిక్కున ఎతైన పర్వతాలు ఉన్నాయి అని అందువలననే భారతదేశం పేదదేశం అని దానికి కారణం వాస్తు అను మాటలు హాస్యాస్పదంగా వున్నవి. సంపదలలో, విద్యా వాణిజ్య సాంస్కృతిక రంగాలలో భారతదేశం మేటిదేశం. ఏవో చారిత్రక కారణాల వలన నేడు మనదేశం పేదరికదేశంగా మారినది. అంతేకాని వాస్తు కాదు. పేదదేశమైతే విదేశీయులు ఈ దేశానికి దారిద్ర్యాన్ని తీసుకుపోవటానికి వచ్చినారా? చెప్పండి. కావున పరిసర వాస్తు పేరిట దేవుళ్ళను శాసిస్తున్నారు కొందరు. ఆగమ శాస్త్ర విరుద్ధ నిర్మాణాలు చేయించుచున్నారు. పవిత్ర స్థలాలను వాణిజ్య మయమై పోవునట్లు చూచుచున్నారు.

# ఆగ్నేయదిశలోనే వంటగది ఉండాలా?

వంట అనగానే అగ్నిముఖ్యం కాబట్టి అగ్నికి దిక్కు అయిన ఆగ్నేయంలోనే వంటగది వుండాలి అని కొందరు ఖరాఖండిగా చెబుతుంటారు. గృహభాగత్రయము అనగా ఇంటిని మూడు విభాగాలుగా దేవ, గంధర్వ, మానుషములుగా విభజిస్తారు. వంటగదిని మానుష విభాగంలోనే వుంచుకోవాలి. ఇంటిముందర భాగాన్ని దేవ అందురు. ఇంటిమధ్య భాగాన్ని గంధర్వభాగం అని చివరి అనగా మూడవ భాగాన్ని మానుషభాగం అందురు. ఇది ఇల్లు ఏ దిక్కు అయినను ఇది సమానంగా వర్తిస్తుంది. తూర్పు సింహద్వారం ఉన్న ఇల్లు అయితే ఇంటి చివరిభాగంలో అనగా మానుష విభాగంలో వంటగదిని నైఋతి దిక్కు శ్రేష్ఠముగా వుంటుంది. కాకపోతే వాయువ్య దిక్కులో కూడా వుంచుకోవచ్చును. నైఋతి గదిలోగాని వాయువ్య గదిలోకాని పొయ్యి అరుగు ఆ గదిలో తూర్పువైపు అమర్చవలెను. వంటచేయు వారు తూర్పు తిరిగి వంట చేయవలెను. అనగా ఏ గదిలో వంటచేయుదుమో ఆ గదిలో తూర్పు భాగంలోవున్న ఆగ్నేయదిక్కున పొయ్యి వుంచుకొని ఆ గది తూర్పు ఈశాన్యంలో సింకుపెట్టించు కోవాలి.వాయువ్యమైన ఇదే విధంగా చేయాలి. వంటగదిలో గృహిణి వంటచేయు నపుడు ఎటువంటి అవాంతరాలు లేకుండా స్వేచ్ఛగా చేయాలి. ఇంటికి వచ్చేవారు, పోయేవారు అంతా ఇంటి ముందరభాగం వరండా మొదటి గదిలోనే ఎక్కువగా వుంటారు. వంటగది ఇంటిముందర పెడితే గృహిణికి సౌకర్యం తగ్గుతుంది. అందువలన మహర్షులు జ్ఞానదృష్టితో ఆలోచించి ఈ గృహభాగత్రయ విధానాన్ని అనుసరించమని మనకు తెలిపినారు. తూర్పుసింహద్వారం కలిగిన గృహంలో దేవభాగమైన వరండా నందే ఉంటుంది.వంటగది కట్టించి వంటచేయటం వలన వంటలు రహస్యంగా, ఎవరు చూపులేకుండా వుండవలసి వుంటుంది. ఆగ్నేయంలో వంట అయ్యేసరికి ఆ రోజు మన ఇంటిలో ఏమి కూరలో మనము చెప్పకుండానే వచ్చిన వారికి తెలిసిపోతుంది. అంతేనా కూరలు వండేటప్పుడు వాడే మసాలా దినుసులు గాని, తిరగమూత వేసేటప్పుడు వచ్చే వాసనకు ఎండిమిర్చి ఘాటుకు హాలులో వున్న అతిధులుగాని, పిల్లలు, పెద్దలకు ఇబ్బందిగా వుంటుంది. అందు వలన తూర్పు సింహద్వారంగల ఇంటికి ఆగ్నేయదిక్కులో వంటగది ఉండరాదు.

దక్షిణ సింహద్వారం గల ఇంటికి మూడవదైన మానుషభాగం ఉత్తర దిక్కువైపుకు వస్తుంది. అందువలన వీరు వంటగదిని వాయువ్య దిక్కునందు ఏర్పరచుకొనవలెను. ఆ గదిలో తూర్పువైపు వంటకు అరుగు కట్టించుకొని వంటచేయు వారు తూర్పువైపున వున్న ఆగ్నేయదిక్కులో పొయ్యివుంచుకొని వంట చేయవలెను. వంట చేసేవారు తూర్పు దిక్కును చూస్తూ వంటచేయవలయును. సింకు ఈశాన్యమున ఏర్పరచుకొనవలెను.

పడమర సింహద్వారం కలిగినవారికి ఇంటిమూడవ భాగమైన మానుషభాగం తూర్పు దిక్కున వుంటుంది. వీరు ఆగ్నేయదిశన వంటగది కట్టించుకొని తూర్పు దిక్కును చూస్తూ వంటచేయాలి. ఆగ్నేయదిక్కులో వంటగది ఒక్క పడమర సింహద్వారం వున్న ఇంటికే వస్తుంది. ఎందువలనంటే మానుషభాగం తూర్పువైపున ఉన్నది కాబట్టి.

ఉత్తర సింహద్వారం గల ఇంటికి మానుషభాగం దక్షిణ దిక్కునకు వస్తుంది. వంటగదిని దక్షిణాగ్నేయలో ఏర్పాటు చేసుకొని అరుగు ఆ గదిలోన తూర్పువైపు కట్టించి తూర్పుదిక్కునే చూస్తూ వంటచేయాలి. అంతేగాని ఇంటి ముఖమైన సింహద్వారంతో పనిలేకుండా ఆగ్నేయ దిక్కులోనే వంటచేయాలి అను మూఢనమ్మకము కలిగి వుండరాదు. మహర్షులు అన్ని విషయములోను ఆలోచించిన తరువాతనే కదా ఈ విధంగా నిర్ణయించినది.

## ఈశాన్యమున స్థలము ఎక్కువగా ఎందుకు వదలాలి?

గృహనిర్మాణమునకు తీసుకోబడిన స్థలము కొలతలు నాలుగు వైపుల సమానముగ వుండుట శ్రేష్ఠము. గృహమును చతురస్ర, దీర్ఘచతురస్రము గల స్థలములయందు నిర్మించుచుందురు. స్థలమునందలి వంకరలు,కోసులను వదలి మూలమట్టమునకు తగిన రీతిలో స్థలం కొలతలను నిర్ణయించవలయును. నాలుగు దిక్కులు నాలుగు విదిక్కుల యందు కూడ సమానముగానే వుండవలయును. అప్పుడు అన్ని గ్రహాలకు సమప్రాధాన్యం ఇచ్చిన వారు అవుతారు. ఆ విధముగ కాకుండ ఏదైనా ఒక దిక్కును పెంచటానికై ఇతర దిక్కును క్రాసు చేసి లైనులాగటం లాంటి చర్యల వలన మిగిలిన దిక్కులకు సరియైన ప్రాధాన్యత ఇవ్వలేదు అని తెలుస్తుంది. వాపువేరు,బలుపు వేరు. అన్ని దిక్కులయందు సమాంతరముగా కొలతలు తీసుకొనిన దానిని బలుపు అందురు. అది అందముగా సౌష్ఠ వంగా వుంటుంది. ఆ విధంగా కాకుండా ఒక్క ఈశాన్యదిశనే అమితంగా పెంచినచో దానిని వాపు అందురు. అన్ని వైపుల పెరగకుండా ఒక్క దిశలోనే మిగతాదిశలను అధిగమించురీతిగా పెరుగుదల వుంటే దానిని వాపు అంటారు. ఇది వికారముగా వుంటుంది.

మనకు నవగ్రహములు వున్నవి. దిక్కులు ఎనిమిదే కదా వున్నవి. మరి 9వ గ్రహానికి చోటు ఎక్కడ, ఏదిశలో వుంటుంది 9 వగ్రహము అని తెలుసుకోవలసి వున్నది. ఈశాన్య దిక్కుకు ఆధిపత్య గ్రహము గురుగ్రహము గురుడు నైసర్గిక శుభగ్రహం. మిగతా శుభ గ్రహాల కన్నా శుభాధికగ్రహము గురుగ్రహం. అందువలన ఈ దిశ మిగిలిన దిశలకన్నా ఎక్కువ ఖాళీవుంటే శుభఫలితములు అధికంగా వుంటాయని ఆశిస్తూ ఈశాన్యం పెంపుదల చేస్తుంటారు.

కాని ఈశాన్యస్థలము మినపగింజంత అనగా ఒకటో,రెండో అంగుళములు మాత్రమే పెరగాలి కాని విపరీతంగా పెంచరాదు. దానివలన మిగతా దిక్కుల అధిపతులు బలహీనులై వాళ్ళుఇచ్చు శుభఫలితములందు వెనుకబాటు వుంటుంది. అన్ని శుభగ్రహాలు శుభఫలితములు ఇచ్చేదాని కన్నా ఒక్కగురు గ్రహము ఇచ్చే శుభఫలితాలు అధికము అవుతాయా? అందువలన మిగతా గ్రహాల బలములు పౌన: పుణ్యమును బేరీజు వేసుకొని స్థలముల యందలి దిక్కుల ప్రాధాన్యతను ఏర్పరచుకొన వలసి వున్నది. కాని 9వ గ్రహమైన కేతువుకు స్థానము ఎక్కడవున్నది. మోక్షకారకుడైన కేతువు బలంగా వున్నప్పుడే కదా మోక్షానికి బాటలుపడేది. ధర్మ,అర్థ,కామ,మోక్ష అను నాలుగు పురుషార్థములు అంతిమగమ్యం మోక్షమే కదా. కావున ఈ కేతుగ్రహానికి ఈశాన్య దిశలోనే గురువుతో కలిసి వుంటాడు. మిగతా 7దిక్కులయందు ఒక్కొక్క దిక్కునందు ఒక్కొక్క గ్రహం స్థానం పొందితే 8వ

దిక్కైన ఈశాన్యదిశయందు గురువు,కేతువు అను రెండు గ్రహములకు స్థానము కలిగి వున్నది. మిగతా దిక్కులతో సమానంగా ఈశాన్యదిక్కు కూడా వుంటే అప్పుడు ఈశాన్య దిక్కునందు ఒక్క గ్రహానికే స్థానము వున్నట్లులెక్క. మోక్షకారకుడైన కేతుగ్రహానికి చోటు లేకుండా పోతుంది అని ఈశాన్య దిక్కునందు ఒకటి,రెండు అంగుళములు మాత్రమే పెరుగుదల వుండవలెను. అప్పుడు కేతు గ్రహమునకు కూడా స్థానము దొరుకుతుంది. ఈ విధముగ ఒకటి,రెండు అంగుళాలు పెంపుద్వారా చతురస్రము,దీర్ఘచతురస్రము సహజ స్వరూపమునకు విఘాతము రాదు. అందువలననే ఈశాన్యం పెంపు అన్నారే కాని, మిగిలిన దిక్కులకన్నా ఈశాన్యము మిక్కిలి శుభదిక్కు అని చాలా విపరీతంగా స్థలమును పెంచుతున్నారు. ఎంత పెరిగితే అంత శుభఫలితాలు లభించుతాయి అని అత్యాశ ధోరణితోను, అమాయకత్వ ధోరణిలో చేయుచున్నారు. దీనివలన చతురస్రము, దీర్ఘచతురస్రము స్వరూపములే మారిపోతాయి. ఒక్క దిక్కునందు కోసు ఏర్పడుతుంది. మూలమట్టమునకు కొలతలు సరియైన రీతిలో రావు.

## నైఋతి దిక్కునందు గొయ్యి ఉండకూడదా ?

ఈనాడు వాస్తుశాస్త్రమును శాసించుచున్న ప్రధాన అంశములలో నైఋతిలో గొయ్యి వుండరాదు అను అంశము. ఈ అంశమును ఇటీవలికాలంలో వస్తున్న అధునాతన వాస్తుగ్రంథములలో ప్రధానంగా పేర్కొనబడినది. పూర్వ వాస్తు గ్రంథములయందు పేర్కొన్న దానికి పూర్తి వ్యతిరేకముగా ఆధునిక నవీనవాస్తు శాస్త్రజ్ఞులు వ్రాయుచున్నారు. వీరు వ్రాసే ఫలితములకు శాస్త్రగ్రంథ ఆధారములు ఏవియునులేవు. ఇదంతా వారి ఊహా కల్పనలతో వ్రాయబడినదే. నైఋతిలో గొయ్యివుంటే గృహయజమాని, అతని ప్రథమ సంతతికి సుఖశాంతులుండవు. గ్రామంలో వీరిపై కక్ష్యలు పెరుగును, కోర్టులో వ్యాజ్యములు జరిగి జైలుశిక్షను అనుభవించెదరు, మంకుపట్టుదలతో హంతకులుగాను, దొంగలుగాను మారెదరు. ముఠాకక్షలు కలిగియుండెదరు. మందులకు మానని వ్యాధులు కలిగివుందురు. దుర్వ్యసనపరులుగా, వ్యభిచారులుగా అనగా రేపుచేయుట, రేపుచేయబడుట జరుగుచుండును, ప్రేమవివాహములు, వర్ణాంతర వివాహములు కలుగుట, చెడుశీలము, రోషము, అహంకా రము, గర్వము, డాంభికము కలిగియుందురు చెప్పేవి శ్రీరంగ నీతులు చేసేవి చేపించేది వ్యభిచార గృహాల నిర్వహణ ... అను రీతిగా లోకములోని చెడునంతను ఇచ్చట అనగా నైఋతిలో గొయ్యి/ పల్లం అనుచోట్ల ప్రజలు భయ భ్రాంతులు చెందురీతిలో అద్భుతమైన కల్పనలతో వ్రాయుచున్నారు కొందరు వాస్తు ప్రచారకులు. లోక కళ్యాణమే పరమావధిగా భావించిన మహర్షులు పై విధముగా ఫలితములు కలుగుతాయని చెప్పలేదు. నైఋతిలో గొయ్యి (లెట్రిన్ గుంట) తప్పనిసరిగా కొన్ని రకములు ఇండ్లకు ఉండాలి అని నొక్కి చెప్పినారు.

మరి మునీశ్వరులు లోకహితము కోసం పరితపించువారుగదా ఫలాపేక్ష లేకుండా స్వార్థరహితమైన జీవనం గడిపిన వారుగదా! ఇట్టి తీవ్రాతి తీవ్రమైన అశుభఫలములను ఇచ్చు నైఋతిలో లెట్రిన్‌గుంట ఎందుకు త్రవ్వమంటారు? ఇప్పటి వాస్తు ప్రచారకులు

కొందరిని మీరు వ్రాసిన ఫలితములకు ఆధార గ్రంధములు వున్నవా? అని అడిగితే ఆధారగ్రంధాలు లేవు. కాని మా అనుభవంలో ఈ ఫలితములు జరుగుచున్నవి అని పలుకుచున్నారు. అనగా మహర్షులచే చెప్పబడిన వాస్తు సూత్రములు అనుభవానికి వ్యతిరేకమైనవని, మహర్షులచే చెప్పబడిన విధముగా గృహనిర్మాణము చేస్తే నానావిధ అష్టకష్టములు పడుతారు అని, అవి అతి శీఘ్రముగా అనుభవములోనికి వస్తవని ఇటువంటి వ్యర్థమాటలు చెప్పుచూ వాస్తుశాస్త్రమంటే గౌరవభావం కాకుండా భయంభావ కలిగే విధంగా మారినది నేడు. వీరి ప్రచారమువలన ఆంధ్రదేశంలో ప్రతిఒక్కరు మోసపోవు చున్నారు. నైఋతిలో గొయ్యి ఉండాల్సిందేనని మీకే అర్థమవుతుంది. ఈ నవీన వాస్తు ప్రచారకులు ప్రకారము ఉత్తరము దిక్కున అనగా ఉత్తర ఈశాన్య దిక్కులో సింహ ద్వార ముతో గృహము నిర్మించుకొనినారు. గృహమునకు గల స్థలములో దక్షిణమున చాలా కొద్దిస్థలము వదలి ఉత్తరమున విశాలమైన ఖాళీస్థలమువుండు విధముగా గృహమును నిర్మించినారు. ఇంటివెనుక భాగాన వచ్చు ఆగ్నేయ దక్షిణ నైఋతుల యందు ఖాళీస్థలము వుండదు. అందువలన మానవులకు నిత్యము ఉపయోగించవలసిన మరుగుదొడ్లు అనగా లెట్రిన్ స్నానగది ఇంటిముందర భాగమున నిర్మించుకొనవలసి వచ్చినది. ఈ మలమూత్ర విసర్జనకు మరుగుప్రాంతము అవసరము. అనగా ఎవరు కనపడకుండా వుండు ప్రదే శము అవసరము. అటువంటి మరుగు (రహస్యం) ప్రదేశములలోనే మలమూత్ర విసర్జన జరుగుతుంది. ఇవి అందరికి తెలిసే విధంగా చూచేవిధంగా జరిగే పనులుకావు. అందువలన సహజంగా ఇంటికి వెనుకవైపు ప్రాంతములో మరుగుదొడ్లను నిర్మించు కొంటారు. కాని ఈ నవీన ప్రచారకులు వలన ఇంటి ముందరభాగం అనగా ఇంటికి ఉత్తర దిశలో (వాయువ్యం)లో నిర్మించుచున్నారు. ఇంటిముందు నుండి వీధిలోనికి పోవటానికి రహదారి వుంటుంది. ఈ రహదారి ఒక్కొక్కసారి రాజవీధులు కూడా వుండ వచ్చును. ఇంటికి ముందర వరండా వుంటుంది కాబట్టి కుటుంబసభ్యులలో కొందరు వరండాలోను, ఇంటిముందర ఖాళీస్థలములోను పిల్లలుగాని, పెద్దలు గాని ఉ ండుచుందురు. మలవిస ర్జనకు వెళ్ళేవారు స్వేచ్ఛగా వెళ్ళలేరు. వ్యక్తి లెట్రిన్‌కు వెళితే వరండాలో వున్నవారు, ఇంటిముందు ఖాళీస్థలంలో వున్నవారు అచ్చట నుండి ఇంటిలోపలికి వెళ్ళవలసి వుంటుంది. లెట్రిన్‌కు వెళ్ళిన వారుకూడ చాలా భయంతో మలమూత్రములు విసర్జించుతారు. ఎందువలననగా ఈ సమయంలో శరీరము నుండి బయటకు వచ్చుగాలి దుర్వాసనతో కూడి వుంటుంది. తరువాత శబ్దములు వస్తూ వుంటాయి. ఇవి అన్నీ లెట్రిన్ బయటవున్న వారికి వినబడుతాయని సిగ్గుచెంది చాలా నిర్భంధంగా మలమూత్ర విసర్జన చేస్తారు. అదే గ్యాస్ ట్రబుల్‌తో బాధపడేవారైతే వారి మలమూత్ర విసర్జన సమయంలో వచ్చే పెద్దశబ్దములు ప్రక్కన వుండే వారికి వినబడుతాయో అని స్వేచ్ఛగా మలమూత్ర విసర్జన చేయటానికి అవకాశం లేకుండా పోతుంది. స్నానాల గదికి మనిషి వెళ్ళుచున్నది ఇంటివారికే కాకుండా బయట వ్యక్తులకు కూడ తెలిసిపోతుంది. ఇంటికి ఎవరైనా అతి థులు వచ్చినా వారి పరిస్థితి కూడ ఇదే విధంగా వుంటుంది. బాత్‌రూమ్‌కు పోవాలంటే బిడియపడుతూ వెళతారు. స్నానాలగదికి

వెళ్ళిన ఆడవారు స్నానానం తరం చీరకట్టు కోవటానికి బాత్‌రూమ్ నేల తడితగులుతుంటుంది కాబట్టి వారు చీరకప్పుకొని ఇంటిలోనికి వచ్చి ప్రశాంతంగా చీర కట్టుకుంటారు. ఇప్పుడు స్నానాలగది ఇంటిముందుంటుంది కాబట్టి చీరచుట్టుకొని ఇంట్లోకి రావటానికి ఇబ్బంది కరంగా వెళ్ళేవారికి కనపడవచ్చు. ఇంట్లోవుండే వారందరి ముందరనుంచి లోపలిగదుల లోనికి వెళ్ళవలసివస్తుంది. ఇది ఎంత ఇబ్బంది కరమో అనుభవించేవారికే తెలుస్తుంది. ఇంట్లో ముసలివారైన తల్లిదండ్రుల పరిస్థితి మరి ఇబ్బందికరంగా వుంటుంది. ఇటువంటి పరిస్థితి తూర్పు సింహద్వారంగల ఇంటికి కూడ వర్తిస్తాయి. ఇది ఇంట్లోవున్న ఆడవారికే కాదు మగవారికి కూడ బాధాక రమైనది. ఇంటిలోకి రావాలంటే ముందు లెట్రిన్, స్నానాలగది ప్రత్యక్షమవుతున్నవి. వాటి తలుపు వేసే సమయములో తెరచి వుంచాలన్నా ఇబ్బంది కరమైనది. మరి ఎందుకు ఇంత దురవస్థపడాలి. గృహము కట్టుకునేది సౌకర్యముగా వుండుటకు కాదా. వాస్తు అను పేరుతో ప్రజలను ఇబ్బంది పెట్టడం ఎందులకు. నిజంగా ప్రాచీన గ్రంథముల లోను, మహర్షులును అదే విథంగా చెబితే కీడుజరుగుతుంది కాబట్టి సర్దుకొని పోతారు. కాని మహర్షులు కీడు జరుగుతుంది అని తెలుపలేదు కదా! వారు ఇంకా నైఋతి దిక్కు న మలమూత్ర విసర్జన శాలలను ఏర్పాటుచేసుకోమని నొక్కి చెబుతున్నారు కదా! ఇట్లా ఎందుకు జరుగుతుంది అని తెలుసుకోవలసిన అవసరం వున్నది ప్రతి గృహస్థునకు. వాస్తు శాస్త్రమునకు ఆది పురుషులలో ఒకరైన విశ్వకర్మ తన విశ్వకర్మ వాస్తు శాస్త్రమునందు గృహభాగత్రయవిధి అనగా ఇంటిని ప్రధానంగా మూడు భాగములుగా విభజించి అందు ఏఏ కార్యములు చేయాలి అని విశదంగా వివరించినారు. గృహమును మూడు భాగములుగా 1.దేవభాగము 2.గంధర్వభాగము 3.మానుషభాగము అని విభజింప బడుతుంది.

1.దేవభాగము:- ఏ ముఖద్వారముగల ఇంటికైనను సింహద్వారము(ముఖద్వారము) నకు ముందుగల వరండా భాగమునకు బ్రహ్మభాగమనియు లేక దేవభాగమనియు అని పిలిచెదరు. మానవునికి ముఖము ఎంతటి ప్రధానమైనదో ఇంటికి దేవభాగము కూడ అంత ముఖ్యమైనది. మానవహృదయ గతమగు సుఖమును గాని, దు:ఖమును గాని ముఖమును బట్టి మనము ఎట్లు గ్రహింపగలమో Face is the index of the mind. అట్లే ఇంటి ముంగిలిని చూడగానే మనమా ఇంటిలో నివసించు వారి సుఖదు:ఖములును స్థితిగతులను అంచనా వేయవచ్చును. కావున ప్రతి ఇంటి యొక్క ముఖభాగమందలి వరండా ముంగిలి ఎల్లప్పుడు కలకలలాడుచూ వుండవలయునని శాస్త్రకర్తల అభిమతము. ఈ దేవభాగము నందు అతిథిసత్కారము, పురాణ శ్రవణము, విద్యావ్యాసంగము, మిత్ర సమాగమము మొదలగు కార్యములకు ఉపయోగింపవలెను.

2.గంధర్వభాగము :- గంధర్వభాగమనగా గృహగర్భము అనగా హాలు. ఈ గృహగర్భమును రెండు లేదా మూడు భాగములుగా విభజింపవలయును. గర్భగృహమును రెండు భాగము లుగా విభజించినప్పుడు మయుడు చెప్పిన విధముగా వెనుబద్ద యొక్క మొదలు చివ రలుగల దిశలయందుగాని లేదా శ్లాబు గృహమైతే కుడి ఎడమ ప్రక్కలయందుగాని

రెండుగదుల మధ్య హాలును నిర్మించవలయును. గదులయందు గృహయజమాని నివాసముగాను, మధ్యహాలు పిల్లలు తదితరులు మసలు స్థలముగాను ఉపయోగింపవలయును.

3. మానుషభాగము :– పాణిద్వారము దాటిన పిమ్మట గల లోపలి వరండా భాగమునకు మానుష భాగమనిపేరు. ఇది గృహపృష్ఠ అనగా వెనుకనున్న వరండా భాగము కాబట్టి యిందు వంటశాల,భోజనశాల, వస్తువులు నిల్వవుంచుటకు, సామానులు నిలువ చేయుటకు గదులు ఏర్పరచుకొనవలయును. ఈ విధముగ వంటశాల ఇంటికి వెనుకభాగమున వున్నప్పుడే గృహయజమానురాలు వంట పనులకు స్వేచ్ఛగా తగు అజమాయిషీతో వుండగలరు. ఆ విధముగా కాకుండా వంటగది ఆగ్నేయ దిశయందుండుట శ్రేష్ఠమని అగ్నికి ఆగ్నేయదిక్కు సరియైనదని కొంతమంది మూర్ఖంగా వ్యవహరించెదరు. తూర్పు సింహద్వారముగల ఇంటికి దేవభాగమైన మొదటభాగములోనే వంటశాల ఏర్పాటు చేసుకుంటే ఇంటికి వచ్చిపోయే వారు వుండుటవలన వంటను స్వేచ్ఛగా చేయలేరు. ఇంటికి వచ్చిన వారిముందు వంటకార్యములు తెలుస్తూవుంటాయి, కూరలు తరుగుట ఇటువంటి పనులయందు కొన్ని ప్రత్యేక ఇబ్బందులు వుండును. ఇటువంటి విషయములోను మన పూర్వఋషులు ఎంతయో దూరదృష్టి గలవారగుట చేతనే ఇంటియొక్క ఏఏ భాగమును ఏఏ పనులకు వినియోగింపవలెనో వైజ్ఞానిక దృక్పథముతో పరిశీలించి పై విధమగు గృహభాగత్రయ విధిని అన్వయించుకొని ఆయా నిర్మాణములు సాగించుకొనుట శుభప్రదము అని తెలిపినారు.

విశ్వకర్మ గృహభాగత్రయవిధి ననుసరించి, ప్రధాన గృహమునకు వెనుక భాగమున గల ఆవరణ(మనుష్య భాగము) యందు మరుగుదొడ్డి – స్నానము గది – బావి – కసువు దిబ్బ –పశువులశాల – మున్నగు వానిని కల్పింపవలెనని నిర్దేశించినారు. దీనిని గృహ ముఖభాగమునందు ఏర్పరచుట తగదని ఆయన అభిమతము. తప్పని పరిస్థితులలో గృహమునకు కుడి లేదా ఎడమ పార్శ్వముల యందు గల దక్షిణ పశ్చిమ దిశలయందు ప్రధాన గృహమును అంటకుండ మరుగుదొడ్డిని నిర్మించుకొనవచ్చును. ఈ విధానము దిక్కులతో సంబంధము లేకుండా అనగా నాలుగు దిక్కులయందు సింహద్వారము కట్టుకున్న ఇండ్లకు వర్తించును. ముఖ్యముగా తూర్పు సింహద్వారమున్న ఇంటికి మానుషభాగము పడమరవైపున వుంటుంది కాబట్టి మరుగుదొడ్లు నైఋతినందుగాని వాయువ్యము నందు గాని కట్టుకొనవచ్చును. ఉత్తర సింహద్వారంగల ఇంటికి మరుగుదొడ్లు నవీన ఉచ్ఛ సిద్ధాంతం అనుసరిస్తే నైఋతిలోనే మరుగుదొడ్లు కట్టుకొనవలసి వస్తుంది. ప్రాచీన సాంప్రదాయం అనుసరించి సింహద్వారం ఉత్తరదిక్కున వుంచితే మరుగుదొడ్లును ఆగ్నేయం, నైఋతి మూలలయందు నిర్మించవలసి వుంటుంది. గృహము మానవ సౌఖ్యమునకు అనువుగా నిర్మించవలయును.

నైఋతినందు లెట్రిన్ గుంట త్రవ్వటం వలన నైఋతి పల్లమవుతుంది గదా. ఇది నైసర్గిక వాస్తుకు వ్యతిరేకము కదా అని అనవచ్చును. కాని ఈ మరుగుదొడ్డి నిర్మించు స్థలమును ఇంటి భూమట్టము కన్నా కొంచెం ఎత్తులో వుండులాగున భూమిని ఏర్పరచుకొనవలయును. అప్పుడు లెట్రిన్ గుంత పోగా మరుగుదొడ్డి యొక్కలోపల భూమి ఇంటి

మట్టం కన్నా ఎక్కువ ఎత్తులో ఉండుటయేకాక, ఇతర దిక్కులయందుండు భూమికన్నా ఎక్కువ ఎత్తులో వుంటుంది. అప్పుడు నైఋతి పల్లము అను సమస్యరాదు. నైఋతిలో మిగతా ప్రాంతముఅంతా ఎత్తుగా వుంటుంది. నైసర్గిక శుభవాస్తుకు అనుకూలముగానే వుంటుంది. ఈ విషయము గ్రహించవలయును.

నైఋతి ఎత్తువుండాలి అని కొంతమంది నైఋతి దిశయందు కొంత ఎత్తు వరకు పిల్లరు నిర్మించుచున్నారు. అది గృహశోభను చెడగొట్టుతుంది. ఇంటిమట్టం కన్నా ఇంటి నైఋతి వైపువున్న భూమి ఎత్తుగా వుంటేచాలు. డాబాలపై ఎత్తులు అవసరంలేదు. కావున అనాలోచిత ఆలోచనల వలన నైఋతిలో గొయ్యి సకల చెడులకు కారణమని ప్రచారం చేయటంవలన ప్రజలు భయభ్రాంతులకు గురి అయి విశ్వకర్మచే చెప్పబడిన గృహభాగత్రయ విధానానికి స్వస్తి పలుకుచున్నారు. జ్ఞానదృష్టిగల మహర్షులు విశ్వ శ్రేయస్సుకే చెప్పినారు. గతంలోని అనగా కొన్ని యుగాలనుండి ఆచరిస్తున్న విధానంను నేడు తప్పు అని చెప్పుట సాహసమౌతుంది. మునీశ్వరుల అభిమతమునకు వ్యతిరేకము. గృహస్థులకు ఇబ్బందికరము.

## నైఋతిలోనే వాటరు ట్యాంకు ఉండాలా ?

వాస్తుశాస్త్రమునందు తెలుపబడు సూత్రములు సార్వజనీకము మరియు సార్వకాలికముగా వుండవలెను. అయితే ప్రపంచంలోని ఏ దేశంలోనైను, ఏప్రాంతములోనైను ఏ కాలములోనయినను ఒకే విధముగా అనుసరింప బడవలెను. పరిస్థితులను బట్టి సందర్భాను బట్టి చిన్నచిన్న మార్పులు ప్రాంతాలను గుణముగా వుంటాయి. కాని ప్రాథమిక సూత్రముల స్వభావములో ఎటువంటి మార్పు ఉండబోదు. నిర్మాణ విషయములో విప్లవాత్మకమైన అభివృద్ధివుంది. దానిననుసరించి వాస్తు సూత్రములను సమన్వయం చేసుకోవాలి. ఒక 60,70 సంవత్సరాల క్రితము మన దేశములో డాబాలు, మిద్దెలు, భవంతులు కొందరికే పరిమితముగా వుండేవి. సిమెంటు, ఇనుము, ఇసుక వీటితో తయారయిన కాంక్రీటు విధానం మనకు తెలియనప్పుడు కూడా ధనవంతులు విశాలమైన భవంతులు అంతస్థులతో కూడ నిర్మించేవారు. అయితే అప్పటి నిర్మాణ వస్తువులు ఎక్కువగా దంతెలతోను, సున్నముతోను ఇంటిపైకప్పు నిర్మింపబడేది. ఒక్కొక్కసారి ఈనాటి కాంక్రీటు విధానములాగ పైకప్పు సమతలంగా వుండేదికాదు. విద్యుశ్చక్తికనుగొనక ముందు నుంచి మన దేశంలో భవంతుల నిర్మాణము వున్నది. శ్రీరామాయణము కాలం కొన్నియుగాలకు పూర్వము నాటిది. ఆ రోజులలో కూడ 7,8 అంతస్థుల భవనాలుండేవి. ఈ ఆధునిక కాలంలో శాస్త్రసాంకేతిక విజ్ఞానం వలన భవనాల నిర్మాణములో విప్లవాత్మకమైన మార్పులు వచ్చినవి. కరెంటు కనుక్కోవడం వలనను మరియు భూగర్భజలంను తోడి పైకి పంపించేందుకు నేడు మోటర్లు కనుగొనబడినవి. కరెంటు వున్నను కాంక్రీటు శ్లాబు విధానం ఆచరణలోకి రానికాల అంతా వాటర్ ట్యాంకుల వినియోగంలేదు. ఇంటికి ఈశాన్యంలోగాని తూర్పునగాని బావుల నిర్మాణం వుండేది. ఆ బావులలోని నీరుతోడుకొని ఆ తూర్పు ఈశాన్యదిశలోని బావికి సమాపంలోనే గంగాళాలు, పెద్దపెద్ద బానలు, తొట్టెలు,

పెద్దపెద్ద బిందెలు, కడవులు,బక్కెట్లు మొదలగు పాత్రలయందు నింపుకొని అవసరమునకు వాడుకొనేవారు. అనగా బావినుండి తోడిన నీరును నింపుకోవటానికి అనేక పాత్రలు బావికి సమీపమందే వుంచుట వుండేది. అంటే జలం నిల్వచేసుకునే పాత్రలు భూమిమీద తూర్పు, ఈశాన్య దిక్కులయందే వుండేవి అనువిషయమును గమనించవలయును. ఈశాన్యం, తూర్పు బరువు వుండకూడదు అను ఇటీవలి అనుభవ వాస్తు పండితులు చెప్పే మాటకు విరుద్ధముగా ఆనాడు ప్రజలు అనుసరిస్తూ వున్నారు. కొన్నియుగాలనుంచి ఇదే ఆచారం లేక పద్దతి కొనసాగుచున్నదికదా. మరియుగాల నుండి జీవించుచున్న గృహస్థులకు పెనుప్రమాదములు, దుష్ఫలితాలు వీరు చెప్పినట్టుగా జరగలేదుకదా? అందరు సుఖసంతోషాలతో పుత్రపౌత్రులతో కళకళలాడుతూ నేటి మనకన్నా అధిక సంవత్సరాలు జీవించినారు కదా. ఆనాడు వైద్యసౌకర్యములు నేటి కాలంలోవలె ప్రజలకు అందుబాటులో లేకపోయినను శతాయుష్మలుగా జీవించినారు. మరి ఇంతకుముందు కలుగని కీడు లేక దుష్ఫలితములు నేడు మాత్రమే జరుగుతాయి అని అనుకొనుట పొరపాటు. కరెంటు కనుగొని, మోటర్లు ప్రచారంలోకి వచ్చినాక బావిలో నుండి నీరు తోడుకొని గంగాళాలు బిందెలతో పైపుల ద్వారా నింపుకొనేవారు. కొంతకాలానికి ఇండ్లకు సిమెంటు కాంక్రీటు ద్వారా పైకప్పు నిర్మాణం జరుగుచున్నది. ఈ కాంక్రీటు విధానంవలన ఇంటిపైకప్పు చదునుగా వుండుట జరుగుచున్నది. ఇప్పుడు కరెంటు, మోటరు అందుబాటులో వున్నవి కాబట్టి నీటిని పైకి ఎక్కించి నిల్వచేసుకుంటే ఇంటిలో ఏ ప్రాంతమందు కావాలంటే ఆప్రాంతానికి పైపు లైనులద్వార ఇంటిలో ఎచ్చటనైనను ట్యాపులు పెట్టుకొని సౌకర్యం పొందుచున్నారు. ప్రతీసారి ఇంటిబయటినుండి నీళ్ళు లోపలికి తెచ్చుకొనే ఇబ్బంది పోయినది. అయితే నీటిట్యాంకు ఎక్కడుండాలి ఎచ్చటకట్టాలి అనుదానికి సౌకర్యమునుబట్టి కట్టుకోవచ్చు అని ప్రాచీనులు తెలిపినారు. తూర్పు, ఈశాన్య ప్రాంతంలో భూమిపైన నీటికుండీలు వుంటే సమస్యలు రాలేదు. ఇప్పుడు ఎందుకు సమస్యలు వస్తున్నవి. ఇంటి పైకప్పులోని ఈశాన్యం నందు ట్యాంకు కట్టించుకొనినచో సమస్యలు, దుష్ఫలితములు ఎందుకు వస్తాయి. గతములో తూర్పు ఈశాన్యంలో భూమిమీద నీటికుండీలు వుండగా రాని సమస్యలు, దుష్ఫలితములు ఇంటిపై కప్పుమీద తూర్పు దిక్కునందు గాని లేక మరే దిశనందుగాని నిర్మించుకుంటే దుష్ఫలితములు వస్తాయా? అని ఆలోచించవలెను. నైఋతి దిక్పతి రాక్షసుడు అనగా ఎక్కువ బాహుబలం వున్నవాడు కాబట్టి ఆ దిక్కుననే నీళ్ళట్యాంకు కడితే బాగుండును, పాపగ్రహదిశ కాబట్టి వాడిక్షేత్రమునందు బరువు వుండు నీళ్ళకుండీ కడితే బాగుంటుంది అని క్రొత్త ఆలోచన చేసినారు. దేవతా దిక్పతి ఇంద్రుడు చేతిలో రాక్షసులు ఎందుకు హతమైనారు. మిగిలిన దిక్పతుల కన్నా ఎక్కువ బాహుబలం కల వాడుకదా నిర్భతి రాక్షసుడు. దేవదానవ యుద్ద ప్రసక్తి కాదు ఇచ్చట. పూర్వకాలములో కూడ ఈశాన్యదిశలోని బావినందలి నీరుతోడ్కొని ఇంటికి నైఋతి దిక్కునందలి భూమిపైన నీరునిల్వ వుంచుకునే గంగాళం, బిందెలు, బక్కెట్లు వుంచినారా అని ఆలోచిస్తే ఆ విధంగా లేదుకదా.

ఇంటిమట్టం గల నైఋతి భూమియందు నీళ్ళకుండీలు పూర్వకాలం నుండి ఇటీవల

కాలంవరకు వుంచలేదు. పాపగ్రహదిక్కైన నైఋతినందలి నేలమట్టం మిగతాదిక్కుల కన్నా కొంచెం మెకరగా చేసియుంటారు. అంతేకాని నీళ్ళకుండీలు నైఋతి భూమిమీద మాత్రం వుంచలేదు. మరి ఇంటిపైకప్పు కూడా సమాంతరంగా వుంటున్నది. నైఋతి కొద్దిగా మెరక పెట్టుచున్నారు. మరి ఇప్పుడు నీళ్ళు నిల్వ వుంచుకునే నీళ్ళట్యాంకు తూర్పువైపు కట్టించితే దోషము వస్తుందా? వస్తే యుగాలనుండి ప్రజలందరికి రావాలి కదా. ఆ విధంగా వుండినట్లు శాస్త్ర, సాహిత్య గ్రంథములలో తెలుపలేదు.

బావి ఏవిధంగా శుభదిక్కు అయిన ఈశాన్య, తూర్పులయందుండి నీటినిల్వ పాత్రలు ఈశాన్య, తూర్పు, లేక ఉత్తర దిశలువుంచిన విధముగనే నీటిట్యాంకులు ఈశాన్యం, తూర్పు, ఉత్తర శుభదిక్కుల యందుంచిన యెడల శ్రేయస్కరముగా నుండును. శుభ దిక్కుల యందు నిల్వవున్ననీరు శుభదిక్పతుల ప్రభావం వలన శుభప్రదమైన నీరుగా వుండును. **ప్రాచీన వాస్తుశాస్త్ర గ్రంథములు సుమారు 200పైగా అధ్యయనం చేసినరాజమండ్రి వాస్తవ్యులు బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తి గారు చెప్పినట్లు నైఋతి దిశయందు నీళ్ళట్యాంకు వుంటే ఆ ఇంటిలోని ఆడవాళ్ళకు బాధలుంటాయి అని తెలిపివారు.** యుగాలనుంచి లేనిరాని దుష్ఫలితాలు ఇటీవలకాలం వస్తాయని అనుకోవడ అవివేకం కాబట్టి శాస్త్ర గ్రంథములో చెప్పని ఫలితములను అనుభవ పండితులు చెబుతూ ప్రజల భయభ్రాంతులును చేయు టయు గాక అనారోగ్యము పాలు చేయుచున్నారు అని గ్రహించగలరు. నైఋతిలో ఎక్కువ బరువు వుండునని, రోజూ వాడని, ఇనుములాంటి వస్తువులను, పరికరములను నిల్వయుంచుటకు చెప్పబడినది. అంతేగాని నిత్యము వాడే పవిత్ర జలవిషయములో నైఋతినందు నిర్మించాలని చెప్పలేదు.వాస్తు సూత్రములను నేటికాలమునకు అనుగుణముగా అన్వయం చేసుకోవాలి అను విషయము అంగీ కరించబడేదే. కాని ఇంగితజ్ఞానం, వివేకము వాస్తు సహజ సూత్రములను కూడ గుర్తుంచుకోవలసి వున్నది. నైఋతిలో బావి త్రవ్వటానికి ఇష్టపడని వారు నైఋతిలో నీరు నిల్వ వుంచుకొను కుండీలు కట్టుకోమనడం ఎంతవరకు సబబుగా వున్నది అని ఆలోచించవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నది. పెంకుటిళ్ళు, పూరిండ్లకు నైఋతి దిక్కున నీళ్ళట్యాంకు వుంచుట మనము ఎరుగని విషయము. పూరిండ్లపై వాటర్‌ట్యాంకు నిర్మాణం అసంభవం. ఎందువలనంటే ఇల్లుకి వాలుపంచలు వుంటాయి కాబట్టి ట్యాంకు నిర్మించుట కుదరదు. పెంకుటిండ్లకు ఇదే పరిస్థితి.కావున పూరిండ్లవారు, పెంకుటిండ్ల వారు, మట్టిగోడల ఇండ్లవారు బావికి సమీపము నందు భూమిమీద నీరునిల్వ వుంచుకునే పాత్రలు వుంచుతున్నారు. కాబట్టి వాస్తు సూత్రము అన్ని రకముల ఇండ్లలో నివసించు వారందరికి వర్తింపచేయవలసిన దానిని కేవల ధనసంపన్నులు కట్టుకునే సిమెంటు కాంక్రీటుపైకప్పుగల గృహాలకు మాత్రమే వర్తించుతుందా. పేదలకు, మధ్యతరగతి వారలకు పూరిండ్లవారికి, మట్టిగోడల ఇల్లు కట్టుకున్న వారలకు నైఋతి దిశయందు నీళ్లట్యాంకు వర్తించదా? కావున అబద్ధ ప్రచారములతో మారుమ్రోగిన ఈ అంశం ప్రజలను నైఋతి ట్యాంకు అనువిధానమునకు అలవాటు పడిపోయినారు. నేడు ఇతర దిశలయందు అవసరాన్నిబట్టి కట్టుకోవచ్చు అను విషయమును జీర్ణించుకోవటానికి, మరియు అలవా టుపడడానికి ఇబ్బందిపడే విధంగావుంది ఈ నైరుతి నీళ్ళట్యాంకు విషయము.

# జాతకము - గృహము

ఏ పని చేయాలన్నా దానికి ఒక స్పష్టమైన కార్యాచరణ ప్రణాళిక వుండాలి. ఆ ప్రణాళిక రూపొందించుటకు పటిష్టమైన విజ్ఞాన సంపత్తి కావలసివున్నది. అది కాలాను గుణమైనదిగా వుండాలి. అప్పుడుగాని చేసిన పని వృధా కాకుండా వుంటుంది. మానవుని జీవిత గమ్యం మోక్షమునకు అనుసరణగా వుండాలి అనే ధర్మార్థకామమోక్షములు అను చతుర్వధ పురుషార్థముల సారాంశము. దీనిని నిర్ణయించాలి అంటే గతజన్మల ప్రభావం ఈ జన్మలో ఏ విధముగ వున్నది. ఈ జన్మలో చేయబడుకర్మ ప్రభావం ఈ జన్మకి మరియు భవిష్యజన్మలకు కూడ ఏ విధంగా ఉండాలి అని అంచనా వేసుకొని ఈ జీవిత మును నిర్ణయించుకోవలసి వున్నది. దానికి అద్దము వంటిది జన్మజాతక చక్రము. జాతక చక్రములోని 12 భావములలో 4వ భావం ననుసరించి గృహసౌఖ్యము తెలుపబడుతుంది. తదనుగుణముగా గృహనిర్మాణము చేసుకోవలసినదిగా మహర్షుల అభిప్రాయము.

ఉదాహరణకు దక్షిణ దిశకు అధిపతి కుజుడు.నైసర్గిక పాపగ్రహము. మేష, వృశ్చిక లగ్నములకు అధిపతి కుజగ్రహము. లగ్నాధిపతి అయిన కుజగ్రహము బలముగా వున్న ప్పుడే లగ్నకారకత్వములు బలంగా వుంటాయి. అనగా ఆరోగ్యము,పూజ,గుణము, వ్యవ హారము,సుఖ, దు:ఖములు,రూపము, రంగు ఇవి అన్నియు సంపూర్ణముగా గృహస్తుడు అనుభవించాలి అంటే జాతక చక్రంలో లగ్నాధిపతి లగ్నంలోగాని, శుభస్థానములైన కేంద్రకోణముల మందుండి ఉచ్ఛ,మిత్ర వర్గ రాసులలో స్థితిపొందితే సంపూర్ణముగా అనుభవములోనికి వచ్చును. బలంగలవారు ఇంకా మంచి బలం పొందటానికి ప్రయత్నించవలెను. బలహీనులైనవారు వారి బలహీనతను పోగొట్టి, తరువాత వారు ఇంకా బలపడేటట్లు చూచుకోవటం మానవ సహజ ధర్మముగదా. అందువలన గ్రహము లకు తగిన బలం పెంపొందుటకు, బలహీనమైన గ్రహములకు బలహీనము పోగొట్టి క్రమముగా బలపడు విధముగా చేయవలసి వున్నది. గ్రహబలం వృద్ధిపొందుటకు పౌష్టిక కర్మలని, గ్రహముల బలహీనతను (మన జన్మలగ్నముననుసరించి అనగా జాతక రీత్యా) పోగొట్టడానికి శాంతి కర్మలని రెండు విధములుగా కర్మలు వున్నవి. ఆ కర్మల ఎలా చేయాలి, ఏ విధంగా చేయాలి. ఎప్పుడు చేయాలి అనునది జన్మజాతక దశాంతర్దశల కాలముల ద్వారా ముందుగానే తెలుసుకొని మన మనోభీష్టమును నెరవేర్చుకొనవచ్చును.

# వాస్తు - జాతకము

ఈనాడు ప్రచారములో వున్నవాస్తు, వర్తమానములోని కొందరి మానవ మనస్తత్వానికి అద్దం పడుతుంది. వందలాది మంది శ్రమిస్తుంటే ఒక్కడు లబ్ది పొందుతున్నాడు. ఆ ఒక్కడు పదితరాలకు సరిపోను సంపాదించినా ఈ జీవితానికి ఢోకాలేదు అని ధైర్యం చెప్పుకోలేక అసంతృప్తిని అనుభవిస్తున్నాడు. దానికి కారణము జాతక చక్రంలోని గ్రహము లిచ్చు ఫలితములతో సంబంధంలేకుండా విపరీతముగా తూర్పు, ఈశాన్య, ఉత్తర దిశలను పెంచి గృహనిర్మాణములు చేయటయే కారణముగా భావించవలసి వస్తున్నది. దీనివలన

ప్రతిదినము వేలమంది మృత్యుముఖములోనికి పయనిస్తుంటే చూస్తూనే వుంటాంకాని మనంమాత్రము ఆఖరుక్షణము వరకు మిగిలివుంటామనే భ్రమమాత్రము కొందరిని వీడిపోవు టలేదు. అందువలననే స్విస్ బ్యాంకులలో నల్లధనంనిల్వలు పెంచుకొని వుంటారు. ఎంత సంపాదించినా తృప్తిలేని జీవితము గడుపుతూ ఎల్లప్పుడు అశాంతికరంగా వుంటారు వ్యక్తుల మనస్తత్వంలోని బలహీనతలను స్వప్రయోజనాలకు ఉపయోగించుకునే తాంత్రిక స్వాములు దేశంలో అన్నిమూలలకు వ్యాపిస్తున్నారు. ఇది అన్ని వర్గాలవారిలోను ఇటువంటి స్థితి వుంటున్నది. దీనికి కారణము ఈనాడు ప్రచారములో వున్న వాస్తు.

1. ఈశాన్యంతో కూడిన తూర్పు,ఉత్తర దిశలు అధిక శాతములో ఉండుట
2. దక్షిణ పడమరలు వీలయినంత తక్కువగా వుండటము
3. నైఋతిలో ఎత్తైన కట్టడములు కట్టడము
4. ఇంటిలో ఆగ్నేయ ఈశాన్యములలో వంటకు పూజకు ఏర్పాటు చేసుకోవడం
5. ఈశాన్యంలో బావులు మొదలగునవి నిర్మించుకోవడం

కాని వాస్తుశాస్త్ర రీత్యా ఎటువంటి ప్రయోగాలు చేసినా పూర్వజన్మ సుకృతములేని వారిపట్ల ఇలాంటి ఉన్నతస్థితులు లభించవని చెప్పవచ్చును. అనగా బాహ్యేంద్రియ జ్ఞానానికి మాత్రమే పరిమితమయ్యి విషయ సుఖానుభూతుల ద్వారా శరీరమును సుఖ పెట్టుకోవడం జరుగుతుంది. ఆత్మజ్ఞానం నశించుచున్నది. మానవుడవని మరచి పోవుచున్నారు.

**జాతకచక్రము, ఇంటి వాస్తునుబట్టి ఈ క్రింది విషయముల పట్ల అవగాహన ఏర్పరచు కొనవచ్చును.**

ఎ. ఆరోగ్యము :- లగ్నము, లగ్నాధిపతి, తూర్పుదిశాభాగము, రవి
బి. ఆయుర్భావము:- లగ్నము,లగ్నాధిపతి,అష్టమము,అష్టమాధిపతి,శని,పడమర దిగ్భాగము.
సి. గౌరవ ప్రతిపతులు:- లగ్నము,లగ్నాధిపతి,దశమము,దశమాధిపతి, రవి, తూర్పుదిశాభాగము.
డి. తల్లి :- చతుర్ధము, చతుర్ధాధిపతి, చంద్రుడు, వాయువ్య ఆగ్నేయదిశలు
ఇ. తండ్రి:- భాగ్యస్థానము, భాగ్యాధిపతి సూర్యుడు తూర్పుదిశాభాగము
ఎఫ్. కళత్రము(భార్య) :-సప్తమము, సప్తమాధిపతి, శుక్రుడు, ఆగ్నేయ దిశాభాగము.
జి. భర్త :- సప్తమము, సప్తమాధిపతి, గురుడు, ఈశాన్యదిగ్భాగము.
హెచ్. గృహము :- చతుర్ధము, చతుర్థాధిపతి, కుజుడు, దక్షిణ, ఈశాన్యదిగ్భాగములు.
ఐ. భూవసతి,సుఖము:- చతుర్ధము, చతుర్థాధిపతి, శని, పశ్చిమ ఈశాన్యదిశలు.
జె. వాహనసౌఖ్యము:- చతుర్ధము, చతుర్థాధిపతి,శుక్రుడు,ఆగ్నేయ, తూర్పు ఈశాన్యములు.
కె. చదువు సంధ్యలు:- ద్వితీయము, ద్వితీయాధిపతి, బుధుడు, ఉత్తర దిశాభాగము.
ఎల్. సుఖభోజనము:- ద్వితీయము,ద్వితీయాధిపతి,చంద్రుడు, ఉత్తర ఈశాన్య దిగ్భాగము.
ఎం. వాక్కుపరపతి:-ద్వితీయము,ద్వితీయాధిపతి,బుధుడు,గురుడు,ఉత్తరము,తూర్పు,ఈశాన్యము.
ఎన్. ప్రభుత్వఅధికారములు:-దశమము,దశమాధిపతి,సూర్యుడు,తూర్పు, తూర్పు ఈశాన్యము.
ఓ. దానాలు,ధర్మాలు:- దశమము,దశమాధిపతి,బుధుడు,గురుడు,తూర్పు ఈశాన్యము, పశ్చిమ దిగ్భాగము.

పి. వియోగములు,తగాదాలు,లావాదేవీలు:- దోషం కలిగిన సప్తమము, సప్తమాధిపతి, శుక్రుడు,దోషభూయిష్ఠమైన ఆగ్నేయ,వాయువ్యాలు.

క్యు. రోగములు,రోష్టులు:- షష్ఠమము, షష్ఠాధిపతి, శని, పశ్చిమనైఋతి దిగ్భాగము.

ఆర్. శయనసౌఖ్యము:- ద్వాదశమము,ద్వాదశాధిపతి,శుక్రుడు,దక్షిణఆగ్నేయ దిశాభాగము.

అయితే మనదేశములో నేడు జన్మజాతకముల పట్ల మిక్కిలి ఆసక్తి కలిగివుంటున్నారు. పుట్టినతేదీని, సమయమును విధిగా వ్రాసుకొనుచున్నారు. గతకాలంలో మనదేశంలో నూటికి 85శాతం మందికి జన్మకాల వివరములను గురించిన సమాచారము తెలియదు. అందులకు నిరుత్సాహ పడనవసరంలేదు.

శ్లో॥ ప్రశ్నేపి జన్మ సదృశోభవతి ప్రభేద ।ప్రశ్నస్యచాత్ర జననస్య నకశ్చిదస్తి ॥

అని పెద్దలు అనుభవము మీద చెప్పిన మాటప్రకారము, జన్మలగ్న వివరములు లేనిచోట్ల ప్రశ్నలగ్న వివరములతోను,జన్మనక్షత్రము తెలియనిచోట నామనక్షత్ర మునే ప్రధానముగా తీసుకొని సముహూర్తసాధన చేసుకొని సత్ఫలితములు పొందవచ్చు అనే సిద్ధాంతము అన్ని కాలములకు, అన్ని వర్గాలవారికిని వర్తించే విషయము. అయితే ఇచ్చట మేషలగ్నము వారికి గృహమునందలి దిశలను గురించి తెలుపుచున్నాను. ఇదే విధముగ మిగతా లగ్నములకు అన్వయించుకొన వలయును.

## మేషలగ్నము

1.రవి:- ఎ. కోణాధిపత్యము కలిగి పంచమాధిపతి అయిన రవి ఈ లగ్నం వారికి శుభుడు.

బి. సంతానము యొక్క బహుముఖాభివృద్ధికి, ప్రభుత్వపరమైన విషయములలో అనుకూలతకు సూర్యుని బలము ఎంతైనా ఉపకరిస్తుంది.

సి. గృహావరణములో తూర్పుదిశ లోపరహితముగా వుండాలి. ముఖ్యంగా తూర్పు ఆగ్నేయములో దోషములుండరాదు.

2.చంద్ర:- ఎ. చతుర్థాతిపతి అయిన చంద్రుని విషయములో కేంద్రాధిపత్యం దోషము పట్టింపునకు రాదు.

బి. చంద్రుడు బలముగా వున్నప్పుడు అంటే సూర్యుడి నుంచి ఎక్కువ డిగ్రీల దూరముగా వున్నప్పుడు చద్రుడు శుభఫలితములను ఇస్తాడు.

సి. ముఖ్యంగా గృహవాహన సౌఖ్యముకు, మానసిక శాంతికి దోహదం చేస్తాడు.

డి. చంద్రుడు బలంగా లేనప్పుడు ఈభావాలు దెబ్బతినడమే కాకుండా పిత్రుభావం కూడ నష్టపడుతుంది.

ఇ. ఇటువంటి సందర్భాలలో వాయువ్య దిగ్భాములో నూతులు, ఉపగృహములు లేకుండా వుండటం ఎంతైనా మంచిది.

3.కుజుడు:- ఎ. జన్మలగ్నమే కుజునికి "మూలత్రికోణము" అవటము మూలాన కుజుడు యీ లగ్నభావానికి ఎక్కువ బలానిస్తాడు.

బి. కుజుడు బలముగా వున్నప్పుడు ముఖ్యముగా తనదశాంతర్దశలలో ఆరోగ్యము, ఐశ్వర్యము, సంఘగౌరవాన్ని ప్రసాదిస్తాడు.

సి. బలముగాలేని పక్షములో ఆయుక్షీణము, అనారోగ్యము మొదలైన క్లేశము లుంటాయి.

డి. కుజుని బలమువున్న వారికి దక్షిణ దిశాభాగము అధికప్రమాణములో వున్న శుభ పరిణామాలను ఇస్తుందని భావించవచ్చును.

ఇ. ఈ విషయములో కుజుడు అష్టమరాశిలో అనగా వృశ్చికరాశిలో వున్నవారు జాగ్రత్తగా వుండవలయును. అనగా దక్షిణ దిశకు అధిక ప్రాధాన్యత ఇవ్వరాదు అని గ్రహించగలరు.

4. బుధుడు:- ఎ. తృతీయ షష్ఠాధిపతి అయిన బుధుడు యీ లగ్నానికి అంతయోగ కారకుడు కాదు.

బి. ముఖ్యంగా ఆర్థిక విషయాలలోను, తోబుట్టువుల క్షేమాభివృద్ధి విషయంలోను చికాకులు ఎక్కువగా వుండును.

సి. అయినా ఉత్తర దక్షిణ దిశల మధ్య సమతుల్యమువుండి ఉత్తర ఈశాన్యము వృద్ధిలో వుంటే బుధుడు యోగిస్తాడు.

5. గురుడు:- ఎ. మేషలగ్నానికి భాగ్యస్థానము అయిన ధనూరాశి గురునికి "మూల త్రికోణము" అవటం మూలాన యీ లగ్న జాతకులకు గురుడు యోగకారకుడు.

బి. ముఖ్యముగా గురుశిష్య సంబంధాలలోను, తండ్రీ కొడుకుల సంబంధాలలోను, ఆకస్మిక ధనలాభాల విషయములోను గురుని ప్రభావము ఎక్కువగా కనిపిస్తుంది.

సి. ఈశాన్యదిగ్భాగంలో ఎటువంటి లోపములు,ఉపగృహములు మొదలగు కట్టడాలు లేకుండా చూసుకొవలసి వున్నది.

డి. బావులు, ఫౌంటెన్స్ మొదలగునవి వున్నప్పుడు ఈశాన్యానికి యింకాబలము కలుగుతుంది.

6. శుక్రుడు:- ఎ. ద్వితీయ సప్తమాధిపతిఅయిన శుక్రునికి ఈ లగ్నం విషయములో కేంద్రాధిపత్య దోషము వుండటం మూలాన భార్య విషయములోను, ఆరోగ్యము, ఆర్థిక రంగాలలో చికాకులు కలిగిస్తాయి.

బి. ఆగ్నేయ దిశను మూస్తూ ఉపగృహములను నిర్మించకుండా వుండాలి.

సి. తూర్పు ఈశాన్యము వృద్ధిలో వుంటే శుక్రుని దోషము కొంతవరకు తగ్గుతుంది.

డి. ఆగ్నేయములో చుట్టిల్లు శ్రేయస్కరము.

7. శని:- ఎ. కేంద్రాధిపత్యం, శుభత్వంవున్నా లాభాధిపతి అవటం మూలాన కొంతదోషము కలిగివున్నాడు.

బి. ఆరోగ్య విషయములో చికాకులు కలిగిస్తాడు.

సి. పశ్చిమ నైఋతిలో ఎటువంటి దోషములు లేకుండా చూసుకోవాలి.

డి. పశ్చిమం కన్నా తూర్పు దిశ వృద్ధిలో వుండటం మంచిది.

ఇ. తూర్పు ఈశాన్యములో బావులు వుండటం మూలముగా శని ఆర్థికపరంగా ముఖ్యంగా భూ వసతుల విషయములో యోగిస్తాడు.

8. జ్యోతిష శాస్త్రములో గ్రహములను గురించి నైసర్గిక శుభులుగాను, పాపులుగాను,

ఆధిపత్య శుభులు, పాపులుగాను గ్రహాల వర్గీకరణ తెలియును.

9. జన్మలగ్నమునుబట్టి గ్రహాల శుభాశుభత్వీలను నిర్ణయించడం జరుగుతుంది. మిగతాలగ్నాలకు కూడా ఇదే విధముగా పరిశీలించాలి.

10. ప్రతివిషయములోనూ శాస్త్రజ్ఞానాన్ని ప్రపంచానుభవాన్ని సమన్వయం చేసుకోని నిర్ణయములు తీసుకోవడము అందరికి శ్రేయస్కరము.

| వరుస సంఖ్య | లగ్నము | శుభులు | అతి శుభులు | పాపులు | అతి పాపులు |
|---|---|---|---|---|---|
| 1 | మేషం | గురు,కుజ,చంద్ర | రవి | శని,శుక్ర | బుధ |
| 2 | వృషభం | శుక్ర | శని,బుధ | రవి | గురు,కుజ,చంద్ర |
| 3 | మిథునం | శుక్ర,శని | బుధ | చంద్ర,గురు | రవి,కుజ |
| 4 | కర్కాటకం | గురు,రవి | కుజ,చంద్ర | శుక్ర | బుధ,శని |
| 5 | సింహం | గురు,చంద్ర | కుజ,రవి | శుక్ర,బుధ | శని |
| 6 | కన్య | శని | శుక్ర,బుధ | గురు,రవి | చంద్ర,కుజ |
| 7 | తుల | బుధ,శుక్ర | శని | చంద్ర,కుజ | రవి,గురు |
| 8 | వృశ్చికం | రవి,కుజ | చంద్ర,గురు | శని | శుక్ర,బుధ |
| 9 | ధనుస్సు | కుజ,చంద్ర | రవి,గురు | బుధ,శని | శుక్ర |
| 10 | మకరం | బుధ | శుక్ర,శని | కుజ,రవి | చంద్ర,గురు |
| 11 | కుంభం | బుధ,శని | శుక్ర | గురు,కుజ,చంద్ర | రవి |
| 12 | మీనం | రవి | కుజ,చంద్ర,గురు | బుధ | శని,శుక్ర |

**రవ్యాది గ్రహములకు మిత్ర,శతృ,సమ,ఉచ్ఛ,నీచ,మూల త్రికోణములు తెలుపు రాశుల వివరములు**

| గ్రహం | మేషం | వృష | మిథు | కర్కాట | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి | మిత్ర, ఉచ్ఛ | శతృ | సమ | మిత్ర | స్వ, మూ.త్రి | సమ | శతృ నీచ | మిత్ర | మిత్ర | శతృ | శతృ | మిత్ర |
| చంద్ర | సమ | ఉచ్ఛ మూత్రి | మిత్ర | స్వక్షేత్ర | మిత్ర | మిత్ర | సమ | సమ నీచ | సమ | సమ | సమ | సమ |
| కుజ | స్వ, మూ.త్రి | శతృ | శతృ | మిత్ర నీచ | మిత్ర | శతృ | శతృ | స్వక్షేత్ర | మిత్ర | శతృ ఉచ్ఛ | శతృ | మిత్ర |
| బుధ | సమ | మిత్ర | స్వక్షేత్ర | శతృ | మిత్ర | స్వ,ఉచ్ఛ మూ.త్రి | మిత్ర | సమ | సమ | సమ | సమ | సమ నీచ |
| గురు | మిత్ర | శతృ | శతృ | మిత్ర, ఉచ్ఛ | మిత్ర | శతృ | శతృ | మిత్ర | స్వ, మూ.త్రి | సమ నీచ | సమ | స్వక్షేత్ర |
| శుక్ర | సమ | స్వక్షేత్ర | మిత్ర | శతృ | శతృ | మిత్ర నీచ | స్వ, మూ.త్రి | సమ | శతృ | మిత్ర | మిత్ర | శతృ ఉచ్ఛ |
| శని | శతృ నీచ | మిత్ర | మిత్ర | శతృ | శతృ | మిత్ర | మిత్ర, ఉచ్ఛ | శతృ | సమ | స్వక్షేత్ర | స్వ, మూ.త్రి | సమ |
| రాహు | మిత్ర | ఉచ్ఛ | మూ.త్రి | మూ.త్రి | ఉచ్ఛ | స్వక్షేత్ర | – | – | – | – | – | – |
| కేతు | సమ | – | – | – | – | – | మిత్ర | ఉచ్ఛ | మూ.త్రి | మూ.త్రి | ఉచ్ఛ | స్వక్షేత్ర |

జాతక గ్రంథములలో గ్రహముల కారకత్వములుంటాయి. అదే విధంగా తన్వాది ద్వాదశ భావాల కారకత్వములుంటాయి. మేషాది మీన పర్యంతం రాశుల స్వభావాలుంటాయి. గ్రహమిత్ర శతృత్వ సమత్వాది విషయములు కూడ వుండును. దీనికి సంబంధించి 1996 వ సం॥ జూన్ – అక్టోబరు నెలలోని ఆదివారం ఆంధ్రజ్యోతి సంచికలలో "రియల్ ఎస్టేట్" అను శీర్షికపై సర్వశ్రీ ఆర్.బి.రాజు ఆర్కిటెక్ట్ గారి వ్యాసములు బాగుగా ఉపయోగపడతాయి. మరియు కాకినాడ నేమాని వారి లగ్న నాడి గ్రంథములు కూడ ఉపయోగపడతాయి. అని తెలియపరచుచున్నాను. శ్రీ ఆర్.బి.రాజు గారి విస్తృతమైన వ్యాసములు ఈ వాస్తు – జాతకము అను శీర్షికకు బాగుగా ఉప యోగపడినందున వారికి నా మన:పూర్వక నమస్కారములు తెలియపరచుచున్నాను.

వ్యక్తి జాతకము ననుసరించి గృహమునకు నైసర్గిక వాస్తును నిర్ణయించుకొన వలయును. ఉదాహరణకు వృశ్చికలగ్నమునకు అష్టమ లాభాధిపతి బుధగ్రహం ఈ లగ్నానికి ఆధిపత్యరీత్యా మహాపాపి. ఈ బుధగ్రహం సప్తమరాశియైన వృషభము నందుండినచో సప్తమ భావకారకత్వములను పాడుచేయును. భార్య ద్వారా అష్టకష్టములు అను భవించ వలసివుండును. బుధగ్రహం బలవంతుడైతే అధికమైన బాధలు పొందవలసి వుండును. బుధగ్రహం బలహీనమైనయెడల ఫలితములను చాలాతక్కువ స్థాయిలో వచ్చుటకు గృహ నిర్మాణ సమయంలో బుధగ్రహాధిపత్య దిక్కు అయిన ఉత్తర దిక్కున ఖాళీ స్థలమును తక్కువగా వుంచవలయును. వృశ్చిక లగ్నాధిపతియైన కుజగ్రహం దిక్కు దక్షిణము. దక్షిణమునందు సరియైన రీతిలో ఖాళీస్థలము ఉంచకపోతే లగ్న కారకత్వ ఫలితములు బలహీనపడును. కుజుడు నైసర్గిక పాపగ్రహం కావున దక్షిణమునందు ఉత్తరదిశకన్న తక్కువ ఖాళీ వుండవలెను. ఈ విధముగ ఈ జాతకుడు గృహప్రవేశ ముహూర్తమునందు కుజునికి బలంవుండు విధముగ చూచుకొనవలయును. గృహముయొక్క నైసర్గిక వాస్తునందు బలము వుండులాగున చూచుకొనవలెను. బుధగ్రహము అనుకూల స్థానములో వుండులాగున గృహప్రవేశ ముహూర్తం నిశ్చయించు కొనవలయును. ఈ విధముగ చేయుట ద్వారా గృహము యొక్క దిశ గ్రహము యొక్క దశకు అనుగుణముగ మార్చుకొని గృహస్థుడు సుఖసంతోషములు పొందగలడు. కావున దోషఫలితములను ఇచ్చే గ్రహంను శాంతింపచేసుకొనుటకు ముహూర్తము,గృహము, జపము, దానము, ప్రాయశ్చిత్తమును ఆచరించుటద్వారా అశుభఫలితములను చాలా తక్కువ స్థాయిలో పొందవచ్చును. శుభ ఫలితములను ప్రసాదించు గృహము యొక్క దిశను గృహావరణములో పెంపుచేసి శుభ ఫలితములకు అనుకూలము ఏర్పరచుకొనవచ్చును. కావున దశను బట్టే దిశ అని గ్రహించవలెను.

# గురుడి కారకత్వ లక్షణములు

రామాయణం కథలో యుద్ధకాండలోని ఒక చిన్న సన్నివేశం యిలా వున్నది. ఒకనాటి యుద్ధంలో శత్రుశేషం అంటూ మిగల్చకుండా మేఘనాధుడు భీభత్సాన్ని సృష్టించి తృప్తిగా లంకానగరానికి తిరిగిపోయినాడు. పుట్టెడు దుఃఖంలో యుద్ధ భూమిని కలియ తిరుగుతున్న విభీషణుడికి కొనవూపిరితో మిగిలివున్న జాంబవంతుడు కనిపించి 'హనుమంతుడు బ్రతికి ఉన్నాడా' అని ప్రశ్నిస్తాడు. అందుకు ఆ విభీషణుడు ఆశ్చర్యపోయినాడు. సమాధానంగా హనుమంతుడు జీవించివుంటే అందరమూ జీవించిఉన్నట్లే అని జాంబవంతుడు చెబుతాడు. అలా ఒక్కమాటలో శివాంశ సంభూతుడు అయిన హనుమంతుని విశిష్ఠతను జాంబవంతుడు లోకానికి తెలియ చెప్పినాడు. అలాగే నైసర్గిక శుభులలో ప్రధముడు అయిన గురుగ్రహం గురించి కూడ జ్యోతిష గ్రంధములలో ప్రశంసా వాక్యములు కనిపిస్తుంటాయి.

లగ్నంలో గురుడు వుంటే లక్షదోషములు పోతాయనే సామెత అందరికి తెలిసినదే. ఏ వ్యక్తి జాతకంలోనైనా బృహస్పతి యొక్క స్థితి అతని జీవితములో భగవదనుగ్రహాన్ని ఎన్ని విధాలుగా ఎంతగా లభిస్తుందో తెలియచేస్తుంది. జాతకంలో గురుడు బలంగా వున్నప్పుడు జీవితం ఆదర్శవంతముగా, ఆనందదాయకంగా వుంటుంది. ఇలాంటివారు సమాజానికి ఎంతో ప్రయోజనకారులుగా వుంటారు. మానవతా దృక్పధం కలిగి మత సామరస్యానికి, న్యాయం, ధర్మం, త్యాగం లాంటి భావాలకు ప్రోత్సాహకరంగా నిలుస్తారు. అదే గురువు జాతకములో పాపసంబంధమైన దృగ్యోగాదులతో దెబ్బతిన్నప్పుడు అనగా బలహీనుడైనప్పుడు అంచనాలన్నీ తారుమారు అవుతాయి. ఇలాంటివారి జీవితములో నిజాయితీ కన్నా నాటకీయత ఎక్కువ వుంటుంది. స్వార్ధచింతన లేకుండా పరమార్ధమును గురించి పట్టించుకోరు. దానాలు,ధర్మాలు నలుగురి దృష్టిని ఆకర్షించేలా చేస్తారు. ఆడంబరత్వం ఎక్కువ వుంటుంది. ఐహిక సుఖాపేక్షలు అవధులు దాటిపోగా అవసాన దశలో ఒళ్ళు గుల్ల చేసుకుంటారు. ఎన్ని అదృష్టములు కలిసివచ్చినా తృప్తిచెందకుండా తాపత్రయంతో సతమతమయిపోతూ లేని రోగములను కొనితెచ్చుకుంటారు. జీవితములో తమల్ని తామే దగా చేసుకొని నిరాశా నిస్పృహలకులోను అవుతారు. గురుని వలన లభించే వివేకముతో కూడిన విషయ పరిజ్ఞానము లోపించినప్పుడు ఇటువంటి అనర్ధములు కలుగుతుంటాయి. అందువలన వాస్తుశాస్త్ర రీత్యా బృహస్పతి ఆధిపత్యం వున్న ఈశాన్య దిశకు చాలా ప్రాధాన్యత కల్పించబడ్డది.

**అందరికీ తెలిసిన విషయములు ఒకటి, రెండు జ్ఞప్తికి తెచ్చుకుంటే**

1. ఈశాన్య మూల కొద్దిగా పెరిగి ఉండాలని
2. ఈశాన్యంలో నుయ్యి ఉండాలని.
3. ఈశాన్యంలో వంటగదులు, మరుగుదొడ్లు మొదలైనవి ఉండరాదని
4. ఈశాన్యమూలలో మెట్లగదులు, స్టోరు రూములు ఉండకూడదని
5. ఈశాన్య భాగములో పూజా గృహనిర్మాణము అత్యంత శ్రేయోదాయకమని ఇలా శాస్త్రపరమైన విశ్వాసాలు చాలా స్థిరపడిపోయినవి.

ఏది ఎలా వున్నా పటిష్టము, పరిశుభ్రమయిన ఈశాన్య ప్రభావము వల్ల ధనాధిక్యత

వున్నవారి కన్నా దారిద్ర్యభావనకు దూరముగా వున్నవారు ఎక్కువ సుఖశాంతులను అనుభవిస్తారని అనుకోవచ్చును. జాతకరీత్యా సంక్రమించే బలహీనతలను ఈశాన్యం దూరం చేస్తుందనే విషయము సహేతుకముకాదు. కోరిన వాటి నన్నింటిని సాధించుకునే దక్షత చాలామందిలో వుంటుంది. కాని తమ కోరికలను నైతికముగా సమర్థించుకునే యోగ్యత కొంతమంది వరకే పరిమితము. ఈ విషయములను వాస్తు పరంగా అన్వయించు కొని అర్థం చేసుకోవటానికి ముఖ్యంగా మనుష్య జీవితములోని విచిత్ర పరిణామాల నైజాన్ని తెలుసుకుంటానికి జాతకచక్రములో లగ్నాత్ బృహస్పతి యొక్క స్థితిగతులను గూర్చి తెలుసుకోవాల్సి వున్నది. జాతకచక్రములో జన్మలగ్నం నుంచి వేరువేరు భావాలలో గురుడున్న ఈ క్రిందివిధంగా తెలుసుకోవచ్చు. అయితే ఇది రాశిరీత్యా తెలుపబడిన ఫలితములు కావు. లగ్నంనుంచి లెక్కించి తెలుపుతున్నాము. కాని గురుగ్రహానికి రెండు ఆధిపత్య ధనస్సు,మీనరాశిలు వున్నవి కాబట్టి ఫలితములను రెండు విధములుగా అంచనా వేసి ఫలితములను స్పష్టముగా తెలుసుకోవలసివున్నది. దీనికొరకై 12 లగ్నములకు వివిధ రాశులలో వివిధ గ్రహములున్న లభించు ఫలితములు తెలుసుకొనుటకై రాశిరీత్యా, ఆధిపత్య భావరీత్యా, లగ్నం నుండి పరిశీలించి 12 లగ్నాలకు శుభాశుభములు తెలుపు టకొరకై నాడీ గ్రంధ సహాయములో చూపబడినవి. వాటిని నిశితముగా పరిశీలించవలసి వున్నది. అయితే ఈ క్రింది ఫలితములు సామూహికంగా వ్రాయబడినవి. లగ్నాల వారీగా చూస్తే ఫలితములలో మార్పులు వుంటాయి గ్రహించవలయును.

1. జన్మలగ్నములో బృహస్పతి బలముగా వుంటే బుద్ధి కుశలత, అదృష్టం కలిసివచ్చి అన్ని విధాల సుఖపడతారు. అన్ని రంగాలలో సంతృప్తి, సంఘంలో గౌరవం లభిస్తాయి. గురుగ్రహం బలం లోపించిప్పుడు తమ్ముతామే స్వయంకృతాపరాధాల వలన కష్టపెట్టు కుంటారు. క్షణికోద్రేకములకు వీగిపోయి ఆరోగ్యమును పాడుచేసుకుంటాడు.
2. రెండవ ఇంటిలో బలంగా గురువు వున్నప్పుడు ఆర్థికరంగాలలో, విద్యా వ్యాసంగములో, రాజకీయ రంగములో అభివృద్ధి విశేషముగా వుంటుంది. గురుని కారకత్వాలకు సంబంధించిన అన్ని రంగాలకు ఈ స్థితి యోగదాయకముగా నుండును. బలహీన పడినప్పుడు అపార్థాల మూలముగా సంఘంలో కించపడిపోయి కష్టనష్టాలకు గురి అవుతారు.
3. మూడవ ఇంటిలో గురుని స్థితి బలంగా వున్నప్పుడు సంఘంలో పరపతి బాగా లభి స్తుంది. తోబుట్టువుల మూలముగా సుఖము, సాంస్కృతిక, రచనా వ్యాసంగాల్లో గణనీయత వుంటుంది. విలాసయాత్రానుభవములు సంతోషంగా ఉంటాయి. గురుడు బలహీనంగా వుంటే కార్యదీక్షాలోపము వలన భంగపాట్లు దుఃఖానుభవాల కలుగుతాయి. చంద్రుడు బలంగా లేకుంటే తేలికగా చెరసాలకు గురిఅవుతారు. కుజుడు బలంగా లేకుంటే పిరికితనము, మాటజారటము, పేచీలు పడటం మూలముగా బాధపడతారు.
4. నాల్గవ స్థానములో గురుడు బలంగా వుండినప్పుడు కన్నవారి ప్రేమానురాగాలు పుష్క లంగా లభిస్తాయి. బుద్ధిబలానికి దైవానుగ్రహము కూడా తోడయి భార్యాబిడ్డల మూలముగా సుఖము, వాహన ధనధాన్య సమృద్ధి లభించును. బుధ శుక్రుల బలం కూడా కలిసివస్తే అంతులేని సంపద, హెూదా, కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. గురుడు

బలహీనపడితే ముందు జాగ్రత్తలు అవసరము. అయినవారి మూలముగా అవమానములు, కష్టాలు వస్తాయి. కుజుడు కూడా కూడితే అగ్ని, వాహనప్రమాదములు కలుగుతాయి. సూర్యుడు,చంద్రుడు కూడా శుద్ధిలేనప్పుడు గుండె జబ్బులు వగైరా వస్తాయి. బుధుడి బలంలోపించినప్పుడు ఆస్తి పాస్తులపై దావాలు మూలముగా మన:క్లేశము కలుగుతుంది.

5. ఐదవ స్థానములో గురుడు బలంగా వుంటే ఆర్థిక రగములో సంతృప్తికర పరిణామాలు- సంతానం మూలంగా అదృష్టము, సంతోషము,ప్రేమలు,స్నేహాలు,సుఖాంత మవుతాయి. రాహువు బలము తోడయితే ప్రయోజకుడు అయిన సైనికుడిగా రాణిస్తాడు. శని యొక్క శుభదృష్టి ఉంటే కీర్తి సంపదలు కలుగుతాయి. గురుడు బలహీనపడితే బుద్ధి కుశలతా లోపము, మూర్కత్వము, జూదగొండితనము,మూలముగా జీవితములో ఎన్నో సదా వకాశములను పోగొట్టుకొని బాధపడతారు.కొన్ని పరిస్థితులలో సంతానము యొక్క పతనానికి తామే కారకులవుతారు.

6. ఆరవ ఇంటిలో బలముగా వున్న గురుని మూలముగా వృత్తి ఉద్యోగాలల్లో సేవానిరతి, నిజాయితీ కారణముగా గుర్తింపు వస్తుంది. సౌజన్యం కారణముగా సాటివారిలో గౌరవము లభిస్తుంది. శత్రువులపై విజయము, వారసత్వమూలముగా లాభాలు కలుగుతాయి. గురుడు బలహీనపడితే ఉద్రేక స్వభావాలకు లోనయి మనశ్శాంతి కోల్పోవటము జరుగుతుంది. అనారోగ్యము కారణముగా, నౌకర్లు సేవకులు మూలముగా భద్రత లోపించి మనస్తాపం కలుగుతుంది.

7. సప్తమ స్థానంలో గురుడు బలంగా వుంటే వివాహానంతరము జీవితము సుఖమయముగా వుంటుంది. కళత్ర మూలముగా, భాగస్వాముల మూలముగా సుఖము లభిస్తుంది. లావాదేవీలలో కూడా విజయం కలుగుతుంది. యాత్రా సుఖములు విశేషంగా ఉంటాయి. కుజ సూర్య చంద్ర శుభస్థితి వంశగౌరవాన్ని ఇనుమడింపచేస్తుంది. ధర్మ ప్రచారకులుగా గౌరవింపబడతారు. బలహీనపడిన గురువు వలన కళత్రము మూలముగా అశాంతి, స్వయంకృతాపరాధాల మూలముగా సంసార జీవితములో క్లేశములు వుండును. కుజుడు కూడా తోడయితే మరిన్ని అనర్ధములు వుంటాయి. వార్ధక్యములో తీవ్ర అశాంతి కలుగుతుంది. యీ ధోరణులు మూలంగా సన్యాసులలో కలిసిపోయేవారు కూడా వున్నారు. శని,బుధులు కూడా తోడయితే వంశాభివృద్ధికి నష్టము.

8. ఎనిమిదవ ఇంట గురుడు బలంగా వుంటే ఆర్థిక సౌష్ఠవం ఎలా వున్నా జరుగుబాటుకు లోటువుండదు. దైవబలం సమృద్ధిగా వుంటుంది. చంద్రుని బలము ఇంకా యోగదాయకము. శుక్రుడు బలంగా వుంటే జీవితాంతము నిశ్చింత, సంతోషం, అంతరాత్మ ఆదేశానుసారము జీవితము సాగిస్తే జీవితము సుఖాంతము అవుతుంది. అతీంద్రియ శక్తులు కూడా అందుబాటులోనికి వస్తాయి. భార్యా మూలముగా భాగస్వాములు లాభ పడతారు. గురుడు బలహీనపడితే అనారోగ్యము, రక్తంలో మాలిన్యాలు పేరుకొనుట మూలముగా గుండె జబ్బులు మొదలైన వాటిమూలముగా బాధపడతారు.

9. తొమ్మిదవయింట శుభుడయిన గురువు యొక్క అసాధారణ వీక్షణములు మూలముగా జీవితములో విశాలభావాలు, వితరణ గుణము, మతవిశ్వాసము, యాత్రా సాఫల్యము,

దూరదృష్టి కలిగివుండటము, మొదలైన లక్షణములుంటాయి. జీవితములో వయస్సుతో పాటు క్రమాభివృద్ధి వుంటుంది. ముఖ్యంగా ఆధ్యాత్మికా భివృద్ధి వుంటుంది. గురుడు దోషుడయితే గర్విష్టంగా మాట్లాడటం మూలముగా ఆదర్శాల మేరకు జీవితము గడపలేనిస్థితి కలుగుతుంది. బుధుడు బలహీన పడితే ఆయుక్షీణం, కుజుని పాపదృష్టి సోకితే ప్రయాణములలోను, అగ్నిమూలముగాను, ప్రమాదాలు, ప్రాణాపాయములో కలుగవచ్చును.

10. పదవ ఇంట గురుడు బలంగా వుంటే స్వయంకృషి మూలముగా అభివృద్ధి.ఎటువంటి అశుభదృష్టి లేని గురుడు కీర్తిని, అధికారాన్ని, రాజకీయములలో రాణింపును ఇస్తాడు. బుధుడు కూడా తోడ్పడితే రాజకీయములలో వున్నతస్థితి కలుగుతుంది. గురుడుదెబ్బతింటే నిర్లక్ష్యము మూలముగా సత్సంబంధాలు నశించుటం మూల ముగాను సంకట పరిస్థితులు కలుగుతాయి. సూర్యచంద్రులు కూడా దెబ్బతింటే పరపతి కి నష్టము కలుగుతుంది. శని అశుభదృష్టి మూలముగా వివాదములుండును. సూర్యుడు కూడా తోడయితే ఏదో కారణముల మూలముగా భార్యా వియోగము కలగటం సంభవిస్తుంది.

11. పదకొండవ ఇంటిలో గురుడు బలముగా వుంటే మిత్రలాభము, ఉన్నతస్థితి లోవున్న వారి సహాయ సహకారాలు మూలముగా లాభాలు హోదా,కీర్తి లభిస్తాయి. బుధుడు ఆరవ ఇంట వున్నా, గురు శనులు లాభములో కలిసివున్నా యోగదాయ కముగా వుంటుంది. గురుడు దెబ్బతింటే జీవితములో అణుకువగా వుండటం నేర్చుకోవాలి. స్త్రీ పురుషుల్లో పరస్పరావగాహన లేకపోవటము మూలముగా సుఖము లోపిస్తుంది. లగ్నంలో చంద్రుడుండి నీచపడితే అశ్లీల సంబంధాల మూలముగా దరిద్రందాప రిస్తుంది.

12. పన్నెండవ ఇంటిలో గురుడు బలంగా వుంటే కష్టాల నుంచి సత్వర విముక్తి కలు గుతుంది. శాస్త్ర విద్యల సదవగాహన కలుగుతుంది. ప్రేమానురాగములో వింత అనుభవాలు కలుగుతుంటాయి. జీవితములో కొన్ని రహస్యాలు రహస్యాలగానే మిగిలిపోతాయి. ఆధ్యాత్మికముగా అభివృద్ధి చెందే అవకాశములు ఎక్కువ. ఇక్కడ శుక్రుడు యోగిస్తాడు. ప్రార్థనలు ఫలిస్తాయి. ఉచ్ఛలోనున్న కేతువు మూలముగా లాభము కలుగును. ఇక్కడ గురువు దెబ్బతింటే పాపకార్యాసక్తత, శతృవుల మూలముగా వినాశనము, అంగవైకల్యము కూడా కలుగువచ్చును. గురునికి పాపగ్రహ దృష్టి విశేషంగా వుంటే జీవితాంతములో తన పాపాలే తన్ను మట్టుపెట్టి నట్టుగా భావిం చవచ్చును. గురుడు అశుభుడై యోగిస్తే సంతానానికి కష్టనష్టాలు సంభవిస్తాయి.

జాతకచక్రములో గురుని స్థితిని చూసుకొని ఫలితములను తెలుసుకొని గృహమందలి ఈశాన్యము యొక్క ఫలితములు అంచనా వేసుకొనుట సమంజసము. అనగా గురుడు శుభఫలితములు ప్రసాదించే స్థితి వున్నప్పుడు ఈశాన్యము హెచ్చుగా వుంచుకొనవచ్చును. తద్వార శుభఫలితములు హెచ్చు స్థాయిలో పొందగలము. గురుడు బలహీనుడై పాప ఫలితములు ప్రసాదించునప్పుడు ఈశాన్యదిశను సాధారణముగా వుంచాలి. కొద్దిగా తగ్గినా ఫరవాలేదు. అలా కాకుండా ఈశాన్య దిశను అధికముగా పెంచినచో వచ్చు దుష్ఫలితములు అమితముగా వచ్చును. కష్టాల పాలు అవ్వవలసి వుంటుంది.

గురు గ్రహము మేష,మిథున,కర్కాటక,కన్య,వృశ్చిక,ధనుస్సు,మీన లగ్నాలకు ఆధిపత్య శుభుడు గాను ఉండును. అందువలన ఈ లగ్నాల వారికి నైసర్గిక ఆధిపత్యరీత్యా శుభఫలితములు ప్రసాదించును. కాని స్థాన స్థితిని కూడా అనగ 6,8,12 స్థానాలలో వుండినచో అశుభఫలితములు ప్రసాదించును. ఇదే విధముగా మిగిలిన గ్రహాదులకు కూడా పరిశీలించవలెను. అందు కొరకు 62 పేజీలోని పట్టికను చూడగలరు.

ఇదే విధముగా మిగతా గ్రహాల ఫలితములను జాతకరీత్యా పరిశీలించి శుభ ఫలితములు ఇచ్చే విధమైతే ఆ గ్రహసంబంధిత దిశను పెంచటం జరగవలెను. అశుభ ఫలములు అధికముగా ఇచ్చు గ్రహము యొక్క దిశను తగ్గించటము చేయాలి. అశుభ ఫలితములు ఇచ్చు గ్రహము యొక్క దిశను బలము గల దానిగా చేసినచో అష్టకష్టములు, నరకయాతనలు అనుభవించవలసివున్నది. ఈ విధముగా ప్రతిగ్రహ దిశను సరిచేసు కొనవలెను. దశను బట్టి దిశ అనునది ఏర్పడుతుంది అని గ్రహించగలరు. అయితే స్థానాధిపతి స్థితిని కూడ పరిగణించవలయును.

## జాతకచక్రములో స్వగృహయోగం చెప్పే గ్రహస్థితులు

1. లగ్నాధిపతి లగ్నమందున్నా, చతుర్థాధిపతిలో కలిసివున్నా, శుభ దృష్టి కలిగి ఉచ్ఛ యందున్నా, స్వక్షేత్రగతుడైయున్నా కష్టపడకుండానే గృహలాభము వుంటుంది.
2. భాగ్యాధిపతి కేంద్రములో వుండి, చతుర్థాధిపతి, స్వ, మిత్ర, ఉచ్ఛ క్షేత్రములలో వుంటే దివ్యమైన గృహము లభిస్తుంది.
3. చతుర్థాధిపతిగాని, గృహకారకుడుగాని, ద్వితీయ లాభాధిపతులలో ఎవరితోనైనా కలిసివుంటే మంచి గృహము లభిస్తుంది.
4. లగ్న చతుర్థాధిపతులు చతుర్థములో వుంటే ఆకస్మాత్తుగా గృహలాభము వుంటుంది.
5. చతుర్థములో శుక్ర – చంద్రులుంటే గృహసౌఖ్యముంటుంది.
6. లగ్నాధిపతి సప్తమాధిపతితో కలిసి సప్తమంలో వుంటే, దూరదేశాలల్లో కూడా భూమి, గృహ వసతి కలిసి వచ్చే అవకాశాలు వుంటాయి.
7. చతుర్థము చరరాశియై, చతుర్థధిపతి చరరాశిలో వుండి కారకుడు కూడా చరరాశిలో వుంటే చాలాచోట్ల గృహవసతి వుంటుంది.
8. ముఖ్యముగా చతుర్థాధిపతి బలముగా వుండాలి. కేంద్రములలో గాని, ఉచ్ఛలో గాని వుంటే ఇంకా శ్రేష్టము.

జాతకుని జీవితములో గృహలాభము అనే అంశము బలంగా వున్నదని తేలిన తరువాత గృహనిర్మాణము కోసము ఎన్నుకునే స్థలం కూడా యోగదాయకముగా ఉండాలనే అంశ ముపై చూపుమరలుతుంది.

## స్థలాన్ని ఎన్నుకునే సమయములో దృష్టిలో ఉండవలసిన అంశములు

ఎ. ఆకారము

1. చతురస్రాకారముగాని, దీర్ఘచతురస్రాకారంగా గాని ఉన్న స్థలములు సర్వత్ర మంచివి.
2. నాలుగు మూలలు అంటే విదిశలు 90డిగ్రీలు ఉంటే మంచిది. ఒక్క ఈశాన్యం మూలమాత్రమే 90డిగ్రీలు కన్న తగ్గివుంటే శుభస్కరమని భావించవలయును. అనగా

తూర్పు లేక ఉత్తర ఈశాన్యములు వృద్ధిలో వున్నవని అర్థము.

3. ఏ పరిస్థితులలో కూడ ఆగ్రేయ, నైఋతి, వాయువ్యాలు 90 డిగ్రీలకన్నా తక్కువ వుండకూడదు. అలా వుంటే ఆ దిశలు నీచపడినాయని అనర్థదాయకమని భావించాలి.

బి. ఎత్తు – పల్లాలు

1. స్థలము సమచదరముగా లేనప్పుడు ఉత్తరముగాని, ఈశాన్యముగాని, తేర్పుగాని కొద్దిగా పల్లముగా వుంటే శ్రేయోదాయకము.
2. తూర్పు, ఉత్తరాలతో కూడిన ఈశాన్యం పల్లంగా వుంటే సర్వశ్రేష్ఠముగా భావించాలి.
3. దక్షిణము పడమరలు, వాయువ్య నైఋతి, ఆగ్నేయములు పల్లముగా వుంటే ఆ దిశలు నీచపడినవని, ఆయాదిశలు అందించే సత్ఫలితాల ప్రభావములు తగ్గిపోవడమే కాక విషాదకర పరిణామాలకు దారితీసే పరిస్థితులు చోటుచేసుకుంటాయని భావించవలయును.

## గృహసౌఖ్యము లేని గ్రహస్థితులు

1. చతుర్థాధిపతి అష్టమములో వున్నా, నీచపడినా, భూ, గృహవసతుల సుఖము దుర్లభము.
2. చతుర్థాధిపతి నీచపడి రవితో కూడ కలిసివుంటే ఆస్తిపాస్తుల నష్టంలో ప్రభుత్వ పరమైన జోక్యము కూడా వుంటుంది.
3. చతుర్థాధిపతి అష్టమాధిపతితో కలిసి అష్టమములో వుంటే చతుర్థాధిపతి దశలో గృహవాహన సౌఖ్యములు దెబ్బతింటాయి.

ఎ. వాస్తుదోషములు వ్యక్తుల జాతక స్వభావాన్ని ఆధారంగా తీసుకొని సంబంధిత దశాంతర్దశలు మాత్రమే తమతమ ప్రభావాన్ని చూపగలవనే అంశాన్ని విస్మరించరాదు.

బి. కొన్ని సందర్భాలలో జాతకరీత్యాకొన్ని దశలు అనుభవానికి రాని వారిపై వాస్తుప్రభావం వుండదని భావించవచ్చును.

సి. ఏ ఇంటిలోను, ఏఒక్క దోషం మూలంగా ప్రతి ఒక్కరూ ఒకే సమయంలో ఒకే రకంగా బాధపడే అవకాశాలు వుండటం అసంభవం కాబట్టి అన్వయించు కోవడంలో తొందరపాటు కూడదు.

డి. గ్రహాల కారకత్వాలను దృష్టిలో వుంచుకొని గృహములోని సభ్యులందరకు సమానమైన వాస్తు ఫలం అందించటానికి గృహనిర్మాణములో ముఖ్యంగా ప్లాన్ విషయములో జాగ్రత్తలు తీసుకోవాలి.

ఇ. ఏ ఇంటిలో కూడ కుటుంబసభ్యు లందరిపైన వాస్తు శుభాశుభ ఫలితాల ఒకేరకంగా ఏకకాలంలో ప్రకటితముకావు. అందుకు కారణము ఎవరి జాతకులోని ప్రత్యేకతలు వారికుంటాయి. జన్మలగ్నాన్నిబట్టి, భావాధిపత్యాలను బట్టి గ్రహాల మిత్రత్వ శతృత్వాలు మారుతుంటాయి. గృహవాస్తు ఫలితములను అంచనావేసే టప్పుడు ఈ విషయమును దృష్టిలో వుంచుకోవాలి. అందువలన గృహవాస్తు సత్ఫలితాలు కుటుంబ సభ్యులందరికి అందుబాటులో వుండేలా గృహనిర్మాణం జరగాలి. వాస్తు

రూపులో అందే ఈ అవకాశములను, పూవులను ఎవరెంతవరకు అందుకొని లాభపడతారనేది వారివారి తత్త్వం, అదృష్టం మీద ఆధారపడివుంది.

ఎఫ్. ఏ దిశకుగాని, ఏసెక్టార్‌కుగాని మోతాదుకు మించిన శక్తిని ఇవ్వగూడదు. “అతి సర్వత్ర వర్జయేత్” అని పెద్దలు అభిప్రాయము ఇక్కడ సార్ధక మవుతుంది. మన పురాణములలో లోకకంటకులుగా ప్రసిద్ధిచెందిన దానవ ప్రముఖులందరు భౌతిక శక్తులపై విజయం సాధించి స్వశక్తితో త్రిలోకాధిపత్యం సాధించిన వారే. అయినా వారందరి make and psyche లో జ్యోతిష్య శాస్త్రరీత్యా ఒకరకమైన నిర్ధుష్టమైన imbalance వుండబట్టే వారుపతనమైన పోయినారు. అందువల్ల వాస్తుఎప్పుడూ మనష్యులలో నిద్రాణంగా వున్న నిర్మాణాత్మక శక్తులను, ఆధ్యాత్మిక విలువలను పెంపొం దిం చేందుకు మాత్రమే ఉపయోగపడాలి. ఉదాహరణకు తూర్పు ఉత్తర దిశలు ఎంత అధికప్రమాణంలో వున్నా అంతకుమించిన వాస్తు దోషాలు తత్సంబంధిత గ్రహ దోషములు జాతకములో వుంటే వినాశనానికి తీసే అత్యాశలు, కుట్రలు, కుటిలనీతి, దురహంకారము, ప్రతీకారవాంఛ మొదలగు దుస్వభావములకు బానిసలవుతారు.

జి. జ్యోతిషశాస్త్రాన్ని అర్థం చేసుకోవడం అంటే మనలోని స్థూల, సూక్ష్మ శక్తులను/శారీరక మానసిక వ్యాపారాలను నియంత్రించే Agencies గా గుర్తింపు పొందిన గ్రహ స్వభావాలను అర్థం చేసుకోవడమే. వివిధ గ్రహాలకు అధిష్ఠానదేవతలైన వారిని ప్రార్థనలలోను, పూజాది కాలతోను, తృప్తిపరుసున్నామంటే మనవర్తమాన జీవిత గమనానికి కారణ భూతమైన Energy patternను అర్థం చేసుకొని మనల్ని మనం సంస్కరించు కుంటున్నామని గ్రహించాలి.

హెచ్. ఇంటిలో లేక స్థలములో ఏఏ భాగాలు (సెక్టార్లు) దిశలు బలంగా వున్నాయో లేక లోప భూయిష్టంగా వున్నాయో ముందుగా పరిశీలించవలయును. ఆయాదిశలకు లేక భాగాలకు ఆధిపత్యం వహించే గ్రహాల కారకత్వాలను దృష్టిలో పెట్టుకొని గృహస్థు జాతకముతో సరిపొల్చిచూసి, ఏ దశాంతర్దశలలో గృహయజమానిని గాని అతని భార్యాబిడ్డలకు గాని వాస్తు దోషములవల్ల అనర్థములు ఏ రూపములో ఏ కాలములో ముంచుకొనివున్న లోపాలే (గ్రహదోషములు) ఇంటిలో కూడా వున్నట్లయితే అనర్థాలు అనివార్యమని భావించవచ్చును.

ఐ. గృహస్థు జాతకం బలంగా వుండి గృహవాస్తు బలహీనంగా వుంటే, గృహస్థు జాతకం బలహీనంగా వుండి, తత్సంబంధిత గ్రహములకు శక్తినిచ్చే పద్ధతిలో గృహనిర్మాణము జరిగివుండినట్లయితే గృహస్థుడు పుంజుకుంటాడు. అంటే House plays a catai ystic role in shaping the Destiny of Human Beings అని చెప్పవచ్చును.

జె. మరి జాతకానికి వాస్తు శాస్త్రముతో సంబంధము వున్నదా? అని అంటే వుంది అని సమాధానం. వాస్తు శాస్త్ర లక్ష్యం కేవలం గ్రహాలు, జీవితముపై వాటి ప్రభావము గురించి వివరించడమోకాదు. కర్మఫలితాన్ని అనుభవించడానికి వీలుగా గ్రహముల ప్రభావము మనిషిపై ఎలావుంటుందో జాతకము వివరిస్తుంది. అదే విధముగ వాస్తు శాస్త్రముకూడ మనిషి జీవనశైలిని గ్రహప్రభావాల నేపధ్యములో ఎలా మార్చుకోవాలో,

ఎలా మంచిగా జీవన శైలిని రూపొందించుకొవలయునో వాస్తు శాస్త్రము నిర్ధేశిస్తున్నది. అయితే చెడు కర్మలను విసర్జించి మంచి సంస్కారముతో సద్గతిని సాధించడానికి మన జీవిత గమనాన్ని మార్చుకోవాలి గదా. మరి జీవిత గమనమును ప్రభావితము చేసే అంశాలు నాలుగు వున్నవి. అవి 1.జాతక చక్రము 2. ధార్మిక జీవనము 3 పెద్దల ఆశీ స్సులు 4.గృహము. కనుక గృహము కూడ జీవిత గమనమును ప్రభావితము చేయుచుండును అని గ్రహించవలసియున్నది.

కె. కర్మకు లోబడి మనిషి జీవించాలి. కాబట్టి మనిషి తన జీవితకాలములో అనుభవించ వలసిన కర్మతెలుసుకోవాలంటే జాతకము అవసరము. జాతకములో మనిషి స్వరూపము, స్వభావము, మంచి చెడుల మొదలగునవి స్పష్టమవుతాయి. అయితే జీవిత కాలములో జీవితమును సన్మార్గముతో శాంతి మార్గము వెంబడి పయనింప చేయడానికి అనేక అంశాలతోపాటు వాస్తు కూడ దోహదము చేయుచున్నది. అనగా వాస్తుశాస్త్రమును జాతక ప్రభావిత గృహనిర్మాణము (Astro Architective)గా కూడ పరిగణిస్తారు. అనగా మనిషి జాతకమునకు గృహనిర్మాణ మునకు సంబంధం వున్నది అని తెలియును. జాతకము అంటే పూర్వజన్మ పాప, పుణ్యకర్మల ఫలితాన్ని ఈ జన్మలో సూచించేదికదా. అనగా వాస్తుశాస్త్రము జీవి మరణానంతర ప్రయాణానికి సంబంధించిన సిద్ధాంతాల నుంచి ఉద్భవించినది. అందువలననే వాస్తుశాస్త్రము అచ్చమైన ప్రకృతికి సంబంధించిన తత్వమని (Phylosophy of Nature) దృక్పధంలో ఆధ్యాత్మిక తత్వమని సుఖదు:ఖాల విశ్లేషణమని మయబ్రహ్మ విశ్వకర్మలు పేర్కొనినారు. అందువలన ఒక్కమాటలో చెప్పవలెనంటే వేదశాస్త్రమైన జ్యోతిష శాస్త్రములో భాగముగా వాస్తుశాస్త్రము ఉద్భవించింది. వాస్తుశాస్త్రము పూర్తిగా ఆధ్యాత్మిక పరమైనది. నేటి గృహనిర్మాణము Architecture అనగా Engineering పూర్తిగా భౌతిక పరమై నది. వేదశాస్త్రములో ఒకశాఖ వాస్తు శాస్త్రము. ఇది మనిషికి ఈ విశ్వానికి వున్న సంబంధమును వివరించుచున్నది.

ఎల్. మానవ ప్రయత్నమునకు దైవము కూడ అనుకూలించినప్పుడు ఫలితములు సత్వరముగాను, సంతృప్తికరముగాను వుంటాయి. "దైవం మానుష రూపేణ" అన్న ఆర్యోక్తి ప్రకారము మనము ప్రత్యక్ష దైవములుగా భావించే జన్మనిచ్చిన తల్లిదండ్రులు, విద్యాబుద్ధులు చెప్పి పునర్జన్మనిచ్చిన సద్గురువుల ఆశీస్సులు మన పురోగతికి దోహదము చేస్తాయి. పురాణ పురుషులైన మార్కండేయుడు, ధ్రువుడు మొదలగు వారి జీవితములు ఇందుకు నిదర్శనములుగాను ఆదర్శులు.

## కొత్త ఇంటికి పాత ఇంటి కలప వాడవచ్చునా

కొత్త ఇంటికి పాత ఇంటి కలప వాడితే శ్రేష్ఠము కాదు. కాని మనము నివసించిన ఇంటిని తొలగించి దాని స్థానములో నూతన గృహమును కట్టునప్పుడు మనము నివసించిన ఇంటి కలప వాడిన దోషము లేదు. అయితే చెక్కపై భాగమును చెక్కి వాడుకొనవచ్చును. మనము నివసించిన ఇల్లు కాబట్టి వాడవచ్చు. ఇతరులు నివసించిన ఇంటి కలపను మన క్రొత్త ఇంటికి వాడరాదు.

## కర్తరిలో గృహనిర్మాణ పనులు కొనసాగించవచ్చా

కొంతమంది అభిప్రాయములో తాటాకు,చెక్కతో చేయబడిన స్తంభములుగల ఇంటికి కర్తరిలో నిర్మించరాదు. అప్పుడు సూర్యుడు శక్తి అధికముగా వుండి ప్రమాదములు జరుగుతాయి అని అంటారు. డాబాలు, శ్లాబులు వాటికైతే కర్తరిలో పనులు నిరాటంకంగా చేసుకోవచ్చు అని అభిప్రాయపడతారు. కాని వాస్తు శాస్త్రజ్ఞులు ఎటువంటి ఇల్లు అను విషయముతో సంబంధము లేకుండా కర్తరిలో శంఖుస్థాపన, గృహనిర్మాణ పనులు కొనసాగింపు వద్దని తెలిపినారు. కొంతమంది కర్తరిని నిజకర్తరి అని డొల్లుకర్తరి అని విభజన చేసి డొల్లు కర్తరి యందు దోషము స్వల్పము అందువలన డొల్లు కర్తరినందు పనులు నిర్వహించుకోవచ్చు అని చెబుతుంటారు. కాని ఏ కర్తరి అయినా గృహనిర్మాణ పనులు నిలిపివేయవలసినదే. అత్యవసర పరిస్థితుల యందు ఉపయోగించుటకు డొల్లు కర్తరిని వినియోగములోనికి తీసుకువచ్చినారు. ఈ కర్తరి యందు గ్రామారంభము, దేవాలయ ఆరంభము, గృహారంభము, వాపీకూప తటాకారంభ నిర్మాణములు, గోడలు కట్టుట, వడ్రంగము అనగా దారుకర్మ చెట్లునరుకుట, ఇంటికప్పు నిమిత్తము గడ్డి,తాటాకు మున్నగు వానిని కోయుట,శయ్య,ఆసన,వస్తు,వాహనాదుల నిర్మాణము,వానిని మొదటి సారిగా ఆరోహించి వాడుక ప్రారంభించుట. నూతన గొడుగును వాడుట, అశ్వారోహణం, నూతన యాత్రారంభము, నూతన వ్యాపార ప్రారంభము, నూతన వస్త్రధారణము, గృహ మునకు పైన కప్పు వేయుట – నారతీయుట, త్రాళ్ళుపేనుట, నూతనముగా భూమిని దున్నుట, బీజావాపము చేయుట, నూతన గృహప్రవేశము, గర్భాధానము, యజ్ఞయాగాది కర్మలు ప్రారంభించుట, ఆరామప్రతిష్ఠ, ద్వారస్థాపనలు చేయరాదు. కర్తరి అనగా సూర్యుడు తన నిత్య సంచారములో మేషరాశి ప్రవేశించియందు అశ్వినీ నక్షత్రముదాటి భరణీ నక్షత్రమునందు ఒకటవ, రెండవ పాదములు జరుగగా అనగా రవి భరణీ నక్షత్ర 3వ పాదము నుండి రోహిణీ నక్షత్ర ప్రథమ పాదము వరకు గల కాలాన్ని కర్తరీ అని అందు రు. భరణి 3,4 పాదులలో రవి సంచరించు కాలాన్ని డొల్లు కర్తరి అనియు, రవి కృత్తిక 1,2,3,4 పాదముల రోహిణి నక్షత్ర ప్రథమ పాదము వరకు సంచరించుకాలమును నిజకర్తరి అని వాస్తు కర్తరి అని పిలిచెదరు.

### భూమి నిద్రించుకాలము

రవి ఉండు నక్షత్రమునకు 1,2,5,3,7,8,9,10 నక్షత్రములలో చంద్రుడు వుండు కాలమున భూమి నిద్రించును. అందువలన ఈ నక్షత్రములందు గృహ,ఆరామ, వాపీకూప తటాకాదులు నిర్మించరాదు.

### తాటాకు గృహములకు మాసదోషములుండవా

తాటాకు గృహములు ఎక్కువకాలము నిలచివుండవు. మాటిమాటికి జీర్ణమై అనేకసార్లు బాగుచేయించు కోవలసినవి కావున వాటికి మాసదోషము చూడరాదు అని వసిష్టులవారు చెప్పినారు. ఎందువలననగా గడ్డి, తాటాకు త్వరగా ఎండి వర్షము ఇంటిలో కురుస్తుంది కాబట్టి అటువంటి ఇండ్లకు మాసనియమము పెడితే వర్షాలవలన గృహస్థులు ఇబ్బంది

పడతారని ఉద్ధేశముతో చెప్పబడినదేగాని వాటికి మాసదోషములు వుంటాయి అని నా అభిప్రాయము. పెంకుటిల్లు, డాబాలు అయితే రిపేరులు త్వరగా రావని వాటి నిర్మాణ మునకు మాత్రమే మాసదోష ఫలితములుంటాయని అభిప్రాయపడిరి.

## రెండు పోర్షనుల ఇల్లు నిర్మించుట శుభదాయకమా

ఒకే శ్లాబు క్రింద కట్టిన ఇంటిని రెండు పోర్షన్లుగా విభజించుట జరుగుచున్నది. కొన్ని చోట్ల నిర్మాణములప్పుడే రెండు పోర్షన్లుగా చేసి ఒకే శ్లాబుక్రింద నిర్మించుచున్నారు. ఆ రెండు పోర్షన్లు ఇంటికి శంకుస్థాపన ఇంటికి ఈశాన్య వైపున్న ఇంటికి చెందుతుంది. అంతేకాకుండా శుభదిక్కులైన ఉత్తర,ఈశాన్య, తూర్పులు ఒక పోర్షను వారికి వస్తాయి. రెండో పోర్షను వారికి అశుభదిక్కులైన ఆగ్నేయం,దక్షిణం, నైఋతి లాంటివి లభిస్తాయి. అందువలన శుభదిక్కులందు ఖాళీస్థలమున్న పోర్షన్లులలో నివసించేవారికి శుభకరముగానే ఉంటుంది. ఆగ్నేయ, దక్షిణ, దిక్కులందుండు వారు అశుభ ఫలితములు పొందుతారు. అంతేకాకుండా ఇంటికి నిర్ణయించిన ఆయము ఫలితము ఎవ్వరికి కాకుండా పోతుంది. అందువలన ఒకే శ్లాబు క్రింద రెండుపోర్షన్ల ఇల్లు శుభకరమైనది కాదు. ఉత్తర, ఈశాన్యం వైపు వున్నవారికి ఆగ్నేయ, దక్షిణ, నైఋతి, పడమర దిశలకు సంబంధించిన శుభ ఫలితములు వారికి అనుభవమునకు రాకుండా వుంటాయి.

## భార్యగర్భవతిగాయుండిన వాస్తు కర్మలకు దోషకాలము

భార్యగర్భవతిగా యున్నప్పుడు 5 వ మాసము పూర్తి అగువరకు గృహారంభాదులు జరుపుటకు దోషములేదు. 6వ మాసమువచ్చిన నాటినుంచి గృహారంభ గృహప్రవేశాలు వాస్తుకర్మలు ప్రారంభించిన వాని భార్యకు గర్భహాని కలిగించుటయు గాక గృహమునకు హానికలుగును. శౌనకమహర్షి మాత్రమే 6 మాసములు నిండువరకు దోషము నీయదని తెలిపినారు.

## గృహమునందు తేనేతేట్టి పెట్టిన దోషము

జైమిని వాస్తు గ్రంథమునందు తేనేతుట్ట గృహమునందు తూర్పున ఇంటికి హాని, ఆగ్నేయమున ధననాశనము, నైఋతియందు యజమానికి కష్టములుండును. దక్షిణ దిశయందు ధనముపోవుట ఇంటిమధ్యయందు 3మాసములు, ఆగ్నేయ – దక్షిణ – ఈశాన్యములయందు రెండు మాసములు దోషం కల్గును. ఆ దోషశాంతికి వాస్తుపూజ చేయవలయును.

రావణహస్తము (మంచి చేయి) 6 నెలల నుండి 10మాసముల వరకు దోషం వుండును. వాస్తు శాంతి చేయించవలయును.

## వాస్తుదోష పరిహారమునకు చుట్టిల్లు

గృహమునకు సింహద్వారము ఏ దిశనను చూచినను ఆగ్నేయ,దక్షిణ, నైఋతి దిశలందు అధిక ఖాళీస్థలములుండిన యెడల ఆ దోషపరిహారము కొరకు ఆ దిశలయందు చుట్టిల్లు నిర్మించవలెను. చుట్టిల్లు వల్ల ఆ ఇంటికోణము, వేధలు కలిగిన ఇబ్బంది వుండదు.

## మత్స్య యంత్రస్థాపన

గృహము నిర్మించి 60 సం॥ల దాటిన తరువాత ఆ ఇంటియందు మత్స్యయంత్రము స్థాపించవలయును. గృహమునందలి జీవకళ క్రమముగా నశించుచు 60ఏట పూర్తిగా క్షీణించును. మత్స్యయంత్ర ప్రతిష్ఠ చేస్తే తిరిగి ఆ ఇంటకి జీవకళ ఏర్పడును. కొందరు అమాయకత్వముతోనో, అత్యాశతోనో గృహశంఖుస్థాపన సమయమందే శంఖుతోపాటు మత్స్యయంత్రము స్థాపన చేయుచున్నారు. దానివలన అనవసరశ్రమ తప్ప ఎటువంటి ప్రయోజనం లేదు. 60 సం॥ల తరువాత తిరిగి మత్స్యయంత్రము స్థాపించవలసి వుంటుంది.

## ఇంటికి పిశాచ స్థానము ఏది,దానిని ఖాళీగా వుంచాలా

గృహము నిర్మించుటకు స్వీకరింపబడిన భూమిని నాలుగు దిక్కులయందు 9 భాగములు చేసి చివరి 9వ భాగమునందు ఇల్లు కట్టరాదు. ఆ భాగము వదలి కట్టవలెను. ఎందు వలనంటే వాస్తు పదవిన్యాసము ప్రకారము గృహమును దుష్టశక్తులనుంచి రక్షించుటకు కొన్ని అదృష్టశక్తులు సంచరించుచుండును. వాటికి శాంతి, బలి ఇవ్వవలయును. శాంతి బలుల సమర్పణకు తప్పనిసరిగా ఇంటిచుట్టు కొద్దిస్థలము ఖాళీగా వదలవలసి వుంటుంది. ఈ విధముగా వదలబడిన స్థలమునే పిశాచస్థానము అందురు.

## శల్యముల శోధన

నూతనముగా నిర్మించు ఇంటిస్తలమందు జంతువుల ఎముకలు, బొగ్గులు తదితర ములను శల్యములు అందురు. శల్యములు భూమిలోపల ఉంచి గృహనిర్మాణము చేస్తే ఆ ఇంట నివసించే వారికి మనశ్శాంతి లోపిస్తుంది. అందువలన ప్రశ్నద్వారా శల్యశోధన చేయాలి. అవి ఏ దిక్కున ఉంటే ఆ ప్రదేశము వరకు త్రవ్వి తీయాలి. అంతేకాని స్థలము మొత్తము త్రవ్వి ఇసుకను బైటపారవేచి కొత్తమట్టితో నింపుట కొందరు చేయుచున్నారు. శల్యములు ఎక్కడ ఉన్నవి అని ప్రశ్నద్వారా తెలియును. శల్యములు లేని భూమిని కూడ త్రవ్విపాత మట్టి బయట పారపోసి కొత్తమట్టితో నింపటం వలన స్థలము యొక్క గట్టితనము కోల్పోతుంది. అంతేగాకుండా అనవసర శ్రమ ఖర్చుతో కూడుకున్నది. శాస్త్రమునందు చెప్పబడినది. శల్యములు 6 అడుగులలో వున్నప్పుడే ప్రభావమును చూపుతాయి గాని అంతకు మించిలోతు వున్న శల్యములు తీయనవసరం లేదు అని గ్రహించ వలయును.

## భార్య రజస్వల కాలమందు అశౌచకాలము వాస్తు కర్మలు చేయరాదు

యజమాని భార్య రజస్వలయైన 4వ దినమున స్నానానంతరము శుద్ధురాలు అగును. భర్తతో సంభోగమునకు మాత్రమే అర్హురాలు. పూజలు నిర్వహించటానికి 5వ రోజున స్నానానంతరము మాత్రమే వాస్తుపూజలలో పాల్గొనవచ్చును. రజస్వల అయిన స్త్రీ మరల 18 రోజులలోపల మరల రజస్వల అయినచో స్నానముతో శుద్ధిఅగును. శుభకార్య పూజలందు పాల్గొనవచ్చును. కాని ఇంటియందలి కోడలు, కూతురులు రజస్వల అయినచో వాళ్ళను దూరముగా వుంచి యదేచ్ఛగా యజమాన దంపతులు వాస్తు కర్మలయందు పాల్గొన వచ్చును. కుమార్తెలు, కోడళ్ళు రజస్వలైనచో వారిని పూజా వస్తువులు తాకకుండా

దూరముగా వుంచి పూజలు నిర్వహించుకోవచ్చును. గృహయజయాని భార్యరజస్వల అయినచో సమీపకాలమందు ముహూర్తములు తగినవి లేనప్పుడు ముందురోజు ఉపవాసము చేసి రాత్రియందు స్నానం చేయించి శ్రీదేవి ప్రతిమను శ్రీసూక్తవిధిచే పూజించి పాయసముతో హోమము జరిపి కలశోదకముచే అట్టి స్త్రీని అభిషేకించిన అనంతరము శుభకార్యములందు పాల్గొనునట్లు చేయవలయును. ఇది గత్యంతరం లేని స్థితియందు ఆచరింపతగినది.

జాతాశౌచమునందు (పురుడు) 10 రోజులుండును. యజమాని భార్య 21 వ రోజున పరిశుద్ధురాలు అగును. కావున యజమాని భార్య ప్రసవించినప్పుడు 21 రోజుల అనంతరమే శుద్ధి అవుతుంది. కాబట్టి అనంతరము వాస్తు కర్మలయందు పాల్గొనవచ్చును. గ్రామములో జాతరలు జరుగుచున్నప్పుడు, భయంకర అంటువ్యాధులు ప్రభలివున్నప్పుడు వాస్తు కర్మలు వాయిదా వేసుకొనవలయును. యజమాని తండ్రి మరణించితే ఒక సంవత్సరకాలము అశౌచము. కాన సంవత్సర కాలము తరువాతనే జరుపవలెను. తల్లికి 6 నెలలు, భార్యకు 3 నెలలు అశౌచకాలం తెలుపబడినది. జ్ఞాతుల అశౌచమందు చేయరాదు.

## పాపగ్రహ దిశలయందు గృహము పెరగరాదు

గృహనిర్మాణము చేయునప్పుడు నాలుగు దిశలయందు సమానముగా వ్యాపించి వున్నప్పుడు ఎటువంటి దోషము వుండదు. కాని పశ్చిమ సింహద్వారము పెట్టి ఒక గది ఇల్లు నిర్మించునపుడు ఇంటి ముందు వసారా వేయవలయును. అనగా ఇంటికి పడమర వైపు వసారా వుంచుట వలన ఇల్లు పడమర దిశవైపుకు పెరిగినట్లుండును. అట్లని వసారా వేయకుండా గృహనిర్మాణము జరిపితే ఆ ఇల్లు అసౌకర్యముగా వుండును. కావున పడమర సింహద్వారం కలిగిన ఇంటికి పడమరవైపుతో పాటు తూర్పువైపు వసారా లేకుండా కేవలము పడమరవైపు వసార వున్నచో అనేకమైన దుష్ఫలితములుండును. గృహ యజ మానికి అరిష్టము కలుగును. అదే విధముగా దక్షిణ సింహద్వారము పెట్టి కట్టిన ఇంటికి దక్షిణదిక్కున ఒక వసారా ఇంటివెనుక వైపు అనగా ఉత్తరదిక్కున మరొక వసారా నిర్మిం చవలయును. ఇల్లు తూర్పు సింహద్వారం కలిగివున్నప్పుడు తూర్పున ఒక వసారా వేయవలెను. పడమర వసారా లేకపోయినను దోషము లేదు. ఎందువలననగా ఇల్లు శుభదిక్కు అయిన తూర్పుదిశకు పెరిగినది కాబట్టి. కాని రెండు వైపుల వసారాలు శ్రేష్ఠము. ఇదే విధముగ ఉత్తర సింహద్వారం ఇంటికి కూడ అన్వయించుకొనవలయును.

### ఇంటికి ఏదైనా ఒకదిక్కునందు వరుసగా మూడు ద్వారములు వుండవచ్చునా

వీటికి దిక్కులతో సంబంధ లేకుండా ఒకదిశలో మూడు ద్వారములుండరాదు. వీటిలో ఒకటి సింహద్వారమైనను సరే మూడు ద్వారములుండరాదు.

## దేవాలయ పరిసరములందు గృహనిర్మాణం చేయవచ్చునా

గుడిలోని దేవుని శక్తి విశేషంగా వుంటుంది కాబట్టి దేవాలయ శిఖరం నీడ పడనంత దూరమున గృహమును నిర్మించుకొనవలయును. శివాలయమునకు ఎదురుగాను,

వైష్ణవాలయములకు వెనుకను, శక్తి ఆలయములకు లేక ఉగ్ర దేవతల దేవాలయములకు దక్షిణము ప్రక్కన వాటి శిఖరము గాని, గాలిగోపురము నీడపడని ప్రాంతములందు గృహనిర్మాణము చేయవలయును. దేవాలయ గర్భమునకు ఎదురుగా గృహ సింహద్వారము వుంచరాదు.

## గృహములోని పూజాగదిలో చనిపోయిన వారి చిత్రపటములు ఉంచవచ్చా

మన అభ్యున్నతి కోసము తల్లిదండ్రులు, అన్నదమ్ములు,గురువులు మొదలగు వారు పాటుపడెదరు. వారి శ్రమ, ఆశీస్సులు వలన మన జీవన విధానములో గొప్ప శుభమైన మార్పు కలగవచ్చు. అందువలన వారు ప్రాత:స్మరణీయములు కాబట్టి గృహమునందు వారిని రోజు గుర్తించుకొని స్మరించుకునుట కొరకు చిత్రపటములు వుంచుతుంటాము. పూజాగదిలో కూడ వుంచుతుంటాము. అయితే చనిపోయిన వారి ఫోటోలు కూడ వుంచ వచ్చును. అయితే బ్రతికి వుండగ తీయబడిన ఫోటోలు మాత్రే వుంచవలయును. ఇంటి ముఖద్వారము వద్ద వుంచుకోవచ్చును. కాని చనిపోయి శవముగా వున్నప్పుడు తీసిన చిత్రపటములు పూజాగదులయందు, ఇంటి ముఖద్వారమువద్ద వుంచరాదు. కాని ఇంటిలో అనుకూలమైన ఇతర చోట్ల వుంచుకొనవచ్చును. చనిపోయిన తరువాత తీయ బడిన ఫోటోను ఇంటిలో ఉంచుకొనుట ద్వార ఎటువంటి దోషమువుండదు. చనిపోయిన భర్త ఫోటోను, చనిపోయిన భార్యఫోటోను తప్పనిసరిగా గృహములో పూజాగది తప్ప ఇతర గదులలోను, హాలులోను వుంచుకొనవలెను.

## ఇంటియందు దుష్టశక్తులు, మృగముల ఫోటోలుండరాదు

ఇంటియందు కౄరత్వము కలిగిన, అశుభకరమైన చిత్రపటములుంచరాదు. గుడ్లగూబ, పిల్లి,పులి,సింహము, రాక్షసులు, వికృతములైనవి సర్పములు బొమ్మలుండరాదు. వీటిని తదేకముగా చూచుకొలది మన మనసులో అటువంటి భావాలు కలుగుట జరుగుచుండు ను. అందువలన శుభము కలిగించునవి రూపప్రాధాన్యత కలిగిన బొమ్మలు వుంచు కొనవలెను.

## గృహమునందు మరణిస్తే దోషమును ఎలా చూడాలి

గృహయజమాని వార్ధక్యం వలన లేదా అనారోగ్యం కారణముల వలన అకాల మృత్యువు ప్రాప్తించు వారికి తీరని వేదన కలిగించు విషయము ఏమిటంటే ఎంతో ఇష్ట పడి కష్టపడి కట్టుకున్న ఇంటిలో తుదిశ్వాస విడవటానికి కూడా స్వేచ్ఛ లేకుండా పోతుంది కొంతమంది వాస్తు ప్రచారకులు, పురోహితులవల్ల. కుటుంబ సభ్యుల అనవసర ఆందోళన చెందే విధముగా దుష్ప్రచారము విశేషముగా జరిగిపోయినది. యజమాని గాని, ఇంటి యందు పెద్దలు, పిన్నలు చనిపోయినపుడు దోషమువున్నదా? లేదా అని నిర్ణయించునది వేరే విధముగ. అంతేకాని ఇంటి లోపల చనిపోతే, పంచలో చనిపోతే, ఆవరణలో చని పోతే ఎటువంటి నష్టము, కష్టము లేదు. దానిని నిర్ణయించునది మృత్యుచక్రము. సూర్యుదున్న నక్షత్రము నుండి చనిపోయిన నక్షత్రము వరకు లెక్కించి ఒక గృహాకార చక్రమును బట్టి నిర్ణయిస్తారు. ఆ చక్రము మధ్యలో వున్న నక్షత్రములయందు

చనిపోయినందువలన ఎక్కువ దోషం గృహాన్ని మూతవేయాలి అని నిర్ణయిస్తుంటారు. ఆ మృత్యుచక్రములోని రెండవ ఆవరణలో చనిపోతే పంచలో చనిపోయినందువల్ల దోషం తక్కువ అని ఇంటి 3వ ఆవరణలో చని పోతే దోషము లేదు అని చెప్పిన మృత్యుచక్రములోని ఇల్లు, పంచ, ఆవరణలోపల, ఆవరణ వెలుపల అను పదములను స్వగృహమునకు అన్వయించుకొని భయపడి బ్రతికి వుండగానే చావుబ్రతుకుల మధ్యలోవున్న వ్యక్తిని ఇంటిబయలకుగాని, పంచలోనికి చేరుస్తారు. ఇది అపోహ మాత్రమే. వివరములకు 91 నుండి 94 వ పేజీలోని పట్టికలనుపరిశీలించగలరు.

## శల్య వాస్తు

గృహమును శాస్త్రీయముగా నిర్మించి బలమైన శుభముహూర్తముల యందు గృహారంభ, గృహప్రవేశములు చేసినను నివసిస్తునప్పుడు కొందరికి మానసికముగా అశాంతి, ఆందోళన, గృహమునందు జగడములు, భార్యాభర్తల మధ్య సఖ్యత లోపించుట, ఇంటిలో స్త్రీలు తరచుగా వివాదపడుట సంభవించు చుండును. అందులకు గల కారణ ములలో అతిముఖ్యమైనది శల్యవాస్తును అనుసరించకపోవడమే. ఇంటిని నిర్మించుటకు స్వీకరింపబడిన స్థలములోపల ఎముకలు, బొగ్గులు, కుండపెంకులు, పుట్టలు మొదలగునవి లేకుండా స్తలమును శుభ్రపరచవలెను. గృహమును శాస్త్రీయముగ నిర్మించినను శల్యవాస్తును కూడా అనుసరించ వలయును. లేని యెడల లక్ష్మీదేవి అక్కగారు అయిన జ్యేష్ఠా దేవి నివాసముంటుంది. ఆ గృహము దరిద్ర దేవతలకు మూలమవుతుది. కసువుచెత్త, బొగ్గులు, ఎముకలు, రాయి, ఇసుక, ఇనుమూ, తలపుర్రెలు, వెంట్రుకలు, బూడిదె, పొట్టు, బొగ్గులూ, జంతుశిరములు, చీమలపుట్టలు, కప్పల సము దాయము, జంతువుల గ్రుడ్లు, సర్పములు, గవ్వలు, పగిలిన పెంకులూ, కాలిన కట్టెలు, ప్రత్తి మొదలగునవి గృహనిర్మాణ స్థలములోపల వుండరాదు. వీటినే శల్యములు అందురు. అవి అశుచిమైనవి. జ్యోతిర్నిబంధ గ్రంథమునందు లోహధాతువులు, కాలిన కాష్టములు, ఎముకలు, పరుల ఇంటి కలపలు, గృహశల్యములుగానే చెప్పబడినవి. ఇతరుల ఇంటి వస్తువులు తాను ఉపయోగించరాదు వాటిని కూడ శల్యములు గానే చెప్పబడ్డవి. పెంకులు, రాళ్ళు, యినుము, మనుష్యుని తలపుర్రె, పందిశల్యము, కుమ్మర ఆముగుంట, గుర్రపు ఎముకలు, ఎద్దుకొమ్ము, పిశాచ గ్రస్తుని శవము, ఇటుకలు, శిశువుతలపుర్రె, పిల్లి శల్య ములు, గాడిద బొమికలు, కుక్క ఎముకలు, విగ్రహములు, జింక ఎముకలు, రోలు, దున్నపోతు శల్యములు, ఖరశల్యము, దేవతావిగ్రహములు, లింగము, పాత్రలు మొదలగు వాటిని శల్యములు అందురు.

నేటి కాలములో జనాభా విపరీతముగా పెరుగుచున్నది. పెరుగుతున్న జనాభాకు అవసరమైన ఇళ్ళు నిర్మించుట అవసరమవుచున్నది. జీవనోపాధి కొరకు, ఉద్యోగాల కోసము, విద్యార్జన కోసము, మొదలగు అవసరముల నిమిత్తము గ్రామాలలోని ప్రజలు క్రమముగా పట్టణములు నగరములవైపు అడుగులు వేయుచున్నారు. తత్ఫలితముగా అధిక సంఖ్యలో గృహములు నిర్మించవలసివున్నది. నేడు రియల్ ఎస్టేట్ వ్యాపారం బాగా పుంజుకున్నది. ధనవంతులు అధికమంది భూమిమీదనే పెట్టుబడులు పెట్టి రియట్

ఎస్టేట్ వ్యాపారంలో బ్రతుకుచున్నారు. రియల్ ఎస్టేట్ వ్యాపారుల మధ్య వున్న అధిక పోటీ కారణముతో పాటు ఇబ్బడి ముబ్బడిగా అసంఖ్యాకంగా ప్రజలు పెరిగిపోవుట వలన నివాసయోగ్యమైన భూమికి కొరత ఏర్పడినది. బహిప్రదేశములు, బీడుభూములు, తుమ్మచెట్లుతో నిండివున్న భూములు, స్మశాన సమీప భూములు, కొండల సమీపమునందుండు భూములు మొదలగు నిందిత భూములను వీరు మనోహరముగ చేసి అమ్మక మునకు రియట్ ఎస్టేట్ వ్యాపారులు ముందంజలో వుంటున్నారు. పంటపొలాల భూములు ఇండ్ల స్థలములుగా రూపాంతరము చెందుచున్నవి. దేవాలయ సమీప ప్రాంతములను వాడుచున్నారు. అనేక నూతన ప్రాంతములలో అనగా లోగడ గ్రామం వెలుపలవున్నవి కూడా గృహనిర్మాణములు జరుగుచున్నవి. కావున గృహనిర్మాణమునకు గృహవాస్తు ఎంత ముఖ్యమో, శల్యవాస్తు కూడ అంతే ముఖ్యము. శల్యములున్న గృహమునందు నివసించిన దుస్వప్నములు,హాని, రోగము, ధననాశనము కలుగును అని విశ్వకర్మ ప్రకాశిక తెలుపుచున్నది. శల్యములు లేని స్తలమునందు గృహము నిర్మించుకొని నివాసము చేసిన యెడల ఐశ్వర్యము, ఆరోగ్యము, సుఖము, వంశవృద్ధి కలుగుతుంది.

కావున గృహనిర్మాణానికి ముందుగా భూమియందు శల్యములున్నవి లేనివి అని నిర్ధారించుకొనవలెను.రియల్ ఎస్టేట్ వ్యాపారులు ప్లాటులు వేసి అమ్మేటప్పుడు శల్యములను బాగుగా శోధించిన తరువాతనే చేయాలి.అమ్మకం దారుడు కొనుగోలు దారుడు ఇరువురు సుఖముగా వుండవలెను. ఇప్పటి కొత్తకొత్త స్థలములతోను ప్లాటులు వేస్తున్నారు కాబట్టి అవి నివాసయోగ్యమైనవో కావో అని నిర్ధారించు కొనవలసివున్నది. గ్రామాలు, పట్టణాలు పరిధిలోపలనే అనగా జనులు సుదీర్ఘకాలం నివాసం వుండే గ్రామాలు, పట్టణాల ఇంటి స్థలములను శల్య రహితముగా చేసుకోమని చెబితే, ఇక గ్రామాల,పట్టణాల సుదూర క్రొత్త భూములయందు తప్పని సరిగా శల్యశోధన చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నది. నేడు అధునాతన సౌకర్యములున్నవి. అందువలన శల్యశోధన కష్టమైన పనికాదు. కాని భూమిలోపల ఆరు అడుగుల కన్నా ఇంకా ఎక్కువ లోతులో శల్యములున్నట్లయితే వాటి ప్రభావము గృహముపై ఏ మాత్రము వుండదు. కావున ఆరు అడుగుల లోపు భూమిపైన వుండే శల్యములను శోధించ వలయును. అప్పుడు మాత్రమే ఆ భూమి గృహనిర్మాణమునకు యోగ్యత కలదిగా వుండును. వంశాభివృద్ధిని ఇచ్చును. శల్యశోధన చేయకుండా నిర్మించిన గృహము నివాసయోగ్యముకాదు. దు:ఖములకు మూలకారణము అవుతుంది. సుఖసంపదలు పొందలేము. ఇల్లు లక్షలాదిరూపాయలు వెచ్చించి నిర్మించినను ఫలితముండ వలయును. నిర్మించిన తరువాత చేయగలిగిన దేమీలేదు. శల్యములు తీయవలెనన్న సాధ్యపడదు. పునాదులతో సహా గృహమును నేల మట్టము చేస్తేనే గాని సాధ్యపడదు. లక్షలాది రూపాయలు, విలువైన కాలం వృధా కానీయరాదు. భూమిపై నిర్మించేదానికి ఎన్నిసార్లైనా రిపేర్లు చేసుకోవడానికి అవకాశం వుంటుంది. కాని శల్యశోధన ఒక్కసారే చేసేది. గృహనిర్మాణం జరిగినచో చేయగలిగింది ఏమీలేదు. కావున గృహస్థులు శల్యశోధన ఆవశ్యకతను గ్రహించగలరు.

# గృహములోని వాస్తు దోషములను దేవతా యంత్రముతో తొలగించగలవా ?

గృహ నిర్మాణ సమయంలో సమయాభావం వలన జ్ఞానలోపం వలన, వాస్తు సిద్ధాంతి అవగాహనా లోపం వల్ల నిర్లక్ష్యం వలన, ఆర్థిక శక్తిలోపంవల్ల, పిసినారితనం వలన,బ్రాహ్మణభక్తిలోపం వల్ల, మేస్త్రీకూలీల నిర్లక్ష్యం వలన, సరియైన పర్య వేక్షణను తగిన సమయములో చేయలేక పోవుడం వలన, గృహము వాస్తుకు అనుగుణముగా వుండకపోవచ్చును. కొందరు భూమిపై మక్కువ వుండుటవలన స్థలాన్ని చతురస్రంగా సరిచేయకుండా నిర్మాణాలు చేస్తూవుంటారు. ఆ నిర్మాణాల కొరకు లక్షలాది రూపాయలు వ్యయం చేసిన తరువాత గృహప్రవేశము చేస్తారు. ఆ గృహప్రవేశ ముహూర్తమును సరియైనది నిర్ణయించుటకు మిక్కిలి శ్రద్ధ వహించరు. మొక్కుబడిగా పురోహితుని దగ్గరకు వెళ్ళి మంచి సమయం చెప్పండి అని అడుగుట ద్వారకాని, లేదా పురోహితుడికి ఈతని వద్దనుండి తగినరీతిగా సంభావనరాదు అని భావించి ఏదో ఒక సమయం చెప్పడం ద్వారా కాని, ఒక వేళన గృహయజమాని శ్రద్ధాభక్తి కలిగి సంతోషబుద్ధితో మంచి కానుకలు సమర్పించినను పురోహితుని నిర్లక్ష్యం వలన కాని, జ్యోతిషభాగంలో నిష్ణాతుడు కాకపోవటం వలన కాని, ముహూర్తం సరియైనది నిర్ణయించినను, పురోహితునికి వున్న అనేక శుభకార్యముల వలన ముహూర్త సమయం దాటిన తరువాత గృహప్రవేశం జరగటంకాని జరగవచ్చును. కాని చాలామందికి జన్మజాతక చక్రములు లేకపోవుట వలన జన్మలగ్నానికి గాని, జన్మరాశికిగాని గృహప్రవేశ ముహూర్తము అష్టమరాశి లగ్నం, అష్టమరాశి గృహప్రవేశ రాశి అవుటవలన కూడ మంచిశుభఫలితములు గృహకర్త అందుకోలేక నానాయాతనలు పడుతూవుంటారు. గృహములో నివసించే కుటుబ సభ్యులకు ఆరోగ్య, ఐశ్వర్య లోపములు అకాలముగా కలుగుతూ వుంటాయి. ఎంతో ఇష్టపడి, కష్టపడి, ధనమును త్యాగం చేసికట్టుకునే ఇల్లు సుఖశాంతులు ప్రసాదించాల్సి పోయి ఒక్కొక్కసారి ఒక్కొక్కరికి ఎన్నో ఇబ్బందులు పడుతూవుంటారు. ఇల్లు కట్టిచూడు– పెళ్ళి చేసిచూడు అని లోకంలో సామెత వ్యాపించివున్నది. ఇవి ఎంతో కష్టపడితేగాని, అందరి సహాయసహకారాలు లభిస్తేనే గాని సకాలములో సరియైన వ్యయముతో పూర్తి కాగలవు. మరి ఏ కారణములతోనైనా సరే గృహము నివసించుటకు అనువుగా లేదు అని గృహకర్త భావించినప్పుడు గృహమునందు నివసించుట ద్వారా సుఖశాంతులను పొందుటకు పశ్చాత్తాప మనసుతో మరల వాస్తు పండితుడిని సంప్రదించగలరు. లేదా గ్రామ పురోహితుడిని సంప్రదించును. గృహకర్త తానుకట్టుకున్న ఇంటిలోనే ప్రధానంగా నివాసం వుడాలని భావన వుంటుది. ఇటువంటి పరిస్థితి లోకంలో కొందరికి సంభవిస్తుంటుంది అని భావించిన మునీశ్వరులు లోకక్షేమము కొరకు దీనికి ప్రత్యామ్యాయ మార్గములు వున్నవా అని దివ్య దృష్టితో పరిశీలన చేసి గృహములోని ఏఏ దోషములకు ఏఏ మంత్రములు అనగా దేవతారాధన చేస్తే ఆ దోషము నివారింపబడుతుంది అని గ్రహించి దాని విధి విధానములు నిర్ణయించి లోకమునకు కారుణ్య బుద్ధితో ప్రసాదించినారు. విధి విధాన

ములను అనుసరించుట ద్వారా గృహములోవున్న దోషములు నివారింపచేసుకొని సుఖ శాంతులను పొందవచ్చును. అయితే దేవతా యంత్రములను గృహమునందు స్థాపించుటగాని పూజించుట గాని చేయుట ద్వారా గృహమునందు క్రమముగా సుఖశాంతులు ఏర్పడి వంశాభివృద్ధి జరుగుచుండును. అయితే ఏ దేవతా యంత్రమును పూజించాలి అను విషయమును వాస్తు సిద్ధాంతిని సందర్శించి తెలుసుకొన వలసివున్నది. ఇంటిలోని దోషమునుబట్టి దేవతాపూజలు మారుచుండును. అయితే ఇంటియందు నిత్యపూజ చేసుకోవడానికి ఏ దేవతా పూజ చేస్తే గృహ యజమానికి లాభకరముగా వుంటుందో ముందుగా తెలుసుకోవలసి వుంటుంది. దానికి సిద్ధార్వణ చక్రమునందలి అక్షర సమామ్నాయములోని మిక్కిలి అనుకూలమైన నామాక్షరముగల దేవతను పూజించాలి. అదే విధముగ ఈ దేవతాయంత్ర పూజకు కూడ సిద్ధార్వణ చక్రమును అనుసరించి యంత్రమును నిర్ణయించుకొనవలెను.

యంత్రము అంటే ఏమిటి?. అనగా అది ఆ దేవతా స్వరూపమును, తత్వమును తెలియచేయునటువంటి దర్పణము. ఆ యంత్రములో ఆ దేవతా సంబంధిత శక్తిన ంతటిని బీజాక్షర సంపుటిత మంత్రమును లభించుట జరుగుచుండును. అనగా ఒక విధముగ ఆ దేవతా యొక్క ప్రతిరూపమే యంత్రము. ఆ యంత్రమును చైతన్య పరచుటకు దశసంస్కారములు వున్నవి. అనగా ఆ యంత్ర సంబంధిత మూలమంత్రముతో పాటు ప్రాణ, నేత్ర తదితర బీజాక్షరములను ఆయా దిశలయందు లిఖించవలసి వున్నది. ప్రాణశక్తితో కూడిన బీజాక్షరయుక్త మూలమంత్ర జపము నిర్ణీత సంఖ్యలో నిర్ణీత విధానముద్వారా జపించి ఆ శక్తిని యంత్రమునందు నిక్షేపించవలయును. అప్పుడు ఆ దేవతకు ప్రీతికలిగించు మంత్ర హోమం, దానం జరిపించవలయును. ఇవి అన్నియు పద్ధతి ప్రకారము జరిపించినచో ఆ యంత్రమునందు ఆయా దేవతా స్వరూపశక్తి తిష్ఠయై ఉంటుంది. ఆ దేవతా విగ్రహమునకు యంత్రమునకు భేదము ఏ విధముగాను వుండదు. విగ్రహాన్ని పూజిస్తే ఎటువంటి ఫలితాన్ని పొందుతామో అంతే ఫలితాన్ని యంత్రారాధన ద్వార కూడ పొందవచ్చును. అయితే దేవతాయంత్రాలు సాధారణముగ 3 రకములుగా వుండును. 1. ధారణయంత్రములు, 2. స్థాప్యయంత్రములు 3. పూజా యంత్రములు. గృహమునకు సంబంధించిన దోషములు తొలగుటకు ముఖ్యముగా స్థాపనయంత్రములు ఉపయోగించెదరు.

మంత్రాలకు చింతకాయలు రాలతాయా? అని ఎద్దేవా చేసేవారు రానురాను అధికమై పోవుచున్నారు. ఎవరో కొద్దిమంది పొట్టకూటికోసం చెప్పే, చేసే విధానములను విశ్వసించుట ద్వారా ఇటువంటి తప్పుడు నిర్ణయములను తీసుకొనుచున్నారు. మంత్ర తంత్రాలకు పుట్టినిల్లు మనదేశం. మన మునీశ్వరులు దివ్యతపశ్శక్తి సంపన్నులు. వారు లోకక్షేమం కొరకు మంత్ర విద్యను మనకు అందించినారు. అన్ని విద్యలలో అనగా చతుష్షష్ఠి (64) కళలలో అత్యంత శక్తివంతమైనది మంత్రవిద్య. దీని శక్తి అమోఘం, అద్భుతం.అయితే ఈ కలికాలములో ఈ విద్యను దుర్వినియోగపరుచుట అధికముగా నున్నది. వ్యక్తిగత కక్షలను తీర్చుకొనటానికి ఉపయోగించుకొనుట ఎక్కువగా వుంటున్నది.

లోకకళ్యాణము కొరకు ఉపయోగించవలసిన విద్యను వ్యక్తిగత స్వార్థప్రయోజనాల కొరకు సామాజిక ప్రయోజనాల భంగం కలిగించుటానికి ఉపయోగించుకొనుట వలన మంత్రముల యందలి ప్రాణశక్తి బీజములను తొలగించి ప్రచారంకొరకు వుంచుతున్నారు. అయితే గురుముఖత: మంత్రాన్ని స్వీకరించాలనే హెచ్చరిక చేయుచున్నారు. ఇన్ని మంత్రములు కలవు. ఏ మంత్రం ఏ ప్రయోజనానికి ఉపయోగించుకోవాలో అనే స్థూల సమాచారం ప్రజలకు అందించుచున్నారు. అందువలననే శ్రీవిద్యోపాసనలో అత్యంత కీలకమైన శ్రీషోడశాక్షరీ విద్యను గురించి ఆత్మధేయం శిరోధేయం నధేయం షోడశాక్షరీ అని చెప్పబడినది. అనగా నీ ఆత్మను అయినా ఇవ్వులేదా నీ శిరస్సునయినా ఇవ్వు అంతేగాని షోడశాక్షరీ మంత్రమును ఇవ్వవద్దు అను హెచ్చరిక వుంటుంది. అనగా శిష్యున్ని బాగా పరిశీలన చేసిన తరువాతనే అనగ ఈ షోడశాక్షరీ విద్య ఈ శిష్యుడు లోకకళ్యాణ కరమైన పనులకు ఉపయోగిస్తాడు అని అనేకసార్లు పరీక్షించిన అనంతరమే ప్రసాదించవలసినది అని శ్రీవిద్యాకల్పము లో చెప్పబడుచున్నది. ఆషాఢ భూతిలాంటి శిష్యులు ఈ కాలంలో అత్యధికులు కాబట్టి మోసపోగూడదు. దుష్టుడు దుర్మార్గుని చేతిలోకి ఈ విద్యలభించితే లోకకంటకుడుగా తయారవుతాడని ఈ మంత్రవిద్యను సమాజ క్షేమం కోసం గుప్తము చేసినారు. ప్రకటించిన కొన్ని మంత్రములద్వార వారి ఆశలు నెరవేరవు. దుష్టులచేతిలో మంత్రవిద్య వుండరాదు. రావణాసురుడు లోకకంటకుడు. అతడిని వధించటానికి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే నరావతారంగా శ్రీరాముడిగా అవత రించినాడు. అందువలన విద్యను గుప్తం చేసినారని అధికమంది భావించుచున్నారు.

ప్రకాశం జిల్లాలోని అద్దంకి పట్టణంనందు మంత్రవిద్యలో క్షుణ్ణంగా తెలిసిన వ్యక్తిని అద్దంకి సిద్ధాంతి అనిపిలిచేవారు. ఆయన గురించి ఎంతో గొప్పగా చెప్పుకోవడం ఈ నాటికివుంది. దివ్యదృష్టి కలిగిన వ్యక్తి. మంత్ర స్వరూప స్వభావములను క్షుణ్ణముగా తెలిసిన వ్యక్తి. ఆతడు ప్రదర్శించిన మంత్రవిద్యపట్ల ప్రజలు మిక్కిలి విస్మయంచెందినారు. ఆతని ఖ్యాతి ఆంధ్రప్రాంతము అంతావ్యాపించివుంది. యంత్రనియంత్రి గ్రంథకర్త ఆచార్య వడ్లమూడివేంకటేశ్వరరావుగారు తెలిపినారు. అదే విధముగా ప్రకాశంజిల్లా అర్ధవీడు మండలం అర్ధవీడు గ్రామమునందు 50,60,సం॥లకు పూర్వము మంత్ర విద్యనేర్చిన వాళ్ళు శివాలయం బజారులోని గాజులవారి వీధిలో వుండేవారని గుర్రంమీద ప్రయా ణిస్తున్న ఆంగ్లేయుడిని ఆ గుర్రానికి అతుక్కుపోయే విధంగా మంత్రప్రయోగం చేసినారని, ఈ విధముగ ఆ గ్రామములో పెద్దలు చెప్పుకొనుట ఇప్పటికీ వున్నది. ఆ గ్రామంలోనే ఒకముస్లిమ్ వ్యక్తి అయ్యా! మా పీర్‌దేవతకు యంత్రము వేయండి, దైవశక్తిని పెంచండి అని ఒకరిని అడుగుటను తటస్థించినది. అర్ధవీడు మండలంలోని పాపినేనిపల్లి గ్రామ ములో రామాలయము జీర్ణోద్ధారణ చేయుటకువచ్చిన ఆగమ పండితుడు ఒకరు బస్తాలోని కొబ్బరికాయలు బస్తాలోనే ఉండగా ఒక్కొక్క కొబ్బరికాయ దానికదే పగిలి రెండు చెక్కలుగా అయ్యే విధంగా బస్తా కొబ్బరికాయలు ఒకదాని వెంట మరొకటి పగులునట్లు చేయుట అందరినీ ఆశ్చర్యులను చేసినది అని ఆ గ్రామస్థులు చెప్పుకోవటం వున్నది. ఈ విషయం 7,8 సం॥ల క్రితమే జరిగినది. దేవాలయ ప్రతిష్ఠలయందు విగ్రహాన్ని సుముహూర్త

సమయానికి భక్తులందరు ఎత్తి పీఠమునందు వుంచుట జరుగుచుండును. ఇది ఎంతో వ్యయప్రయాసలతో జరుగుచుండును. కాని కొన్నిచోట్ల అక్కడక్కడ ఆగమ పడితులు తమ మంత్రశక్తితో ఆ రాతి విగ్రహము తనకు తానుగ కదిలివచ్చి ఆ పీఠమునందు కూర్చునుట చూచినాము అని విద్యావంతులు చెబుతూవుంటే ఆశ్చర్యము వేయకమానదు.

కావున పొట్టకూటికోసం, ప్రగల్భాలు పలికే అల్పులైన వారివలన మంత్రవిద్యకు పుట్టినిల్లు అయిన మనదేశం హేళన గురికావటంలో బాధాకరమైన విషయము. ఇటువంటి శక్తి వున్నవారు ఎవరూ ప్రజలముందరకురారు. అందువలన ఇది పుక్కిటి పురాణకథ అని నమ్మేవారు ఎక్కువ అవుచున్నారు. ఇది మనదేశ కళకు తీవ్రమైన అపచారముకదా. కావున నిజంగా మంత్రబలములేని పురోహితులు, సిద్ధాంతులు, వ్యక్తులు యంత్రముల స్థాపన ద్వార ఇటువంటి ఫలితములు జరుగుతాయని ప్రజలను మభ్యపెట్టరాదు. కావున మంత్ర విద్య వున్నది యంత్ర స్థాపన ద్వారా శుభములు జరుగుతాయి అను విశ్వాసం అత్యంత ముఖ్యము. మహర్షులచే చెప్పబడినది కావున సత్ఫలితములు ఇవ్వబడతాయి అను నమ్మకము కలిగివుండాలి.

The wonder that india (అద్భుత భారతం) అనుగ్రంథము చదివితే మధ్యయుగ కాలములో మన దేశంలోవున్న మంత్రశక్తి పరుల గురించి తెలియును.

**శుభమ్**

| గృహము నందు ఎవరైనా మరణించినచో కలుగు దోషము మరియు దోషకాలమును సూచించు నక్షత్రముల పట్టిక - చంద్రుడున్న నక్షత్రము | | | | | |
|---|---|---|---|---|---|
| సూర్యుడున్న నక్షత్రం | నుండి - వరకు | దోషము లేని నక్షత్రాలు | 15 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు | 30 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు | 45 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు |
| అశ్విని | ఏప్రి 14 - 27 | అశ్వి,పునర్వ,పుష్య,చిత్త, స్వాతి,ఉ.షాఢ,అభిజిత్,రేవతి | భర.ఆరు,ఆశ్రే,హస్త, విశా,పూ.షాఢ,శ్రవ,ఉ.భాద్ర | కృత్తి,మఖ,ఉత్తర,అనూరాధ మూల,ధని,పూ.భాద్ర,మృగ | రోహి,పుబ్బ, జ్యేష్ఠ,శతభిషం |
| భరణి | ఏప్రి 28 - మే 10 | భర,పుష్య,ఆశ్రే,స్వాతి,విశాఖ అభిజిత్,శ్రవ,అశ్వి | కృత్తి,పున,మఖ,చిత్త, అనూరాధ,ఉ.షాఢ,ధని,రేవతి | రోహి,ఆరు,పుబ్బ,హస్త జ్యేష్ఠ,పూ.షాఢ,శతభి,ఉ.భాద్ర | మృగ,ఉత్త,మూల, పూ.భాద్ర |
| కృత్తిక | మే 11 - 24 | కృత్తి,ఆశ్రే,మఖ,విశా, అనూరాధ,శ్రవ,ధని,భర | రోహి,పుష్య,పుబ్బ,స్వాతి,జ్యేష్ఠ అభిజిత్,శతభి,అశ్విని | మృగ,పునర్వ,ఉత్త,చిత్త,మూల ఉ.షాఢ,పూ.భాద్ర,రేవతి | ఆరుద్ర,హస్త,పున పూ.షాఢ,ఉ.భాద్ర |
| రోహిణి | మే 25 - జూన్ 6 | రోహి,మఖ,పుబ్బ,అనూరాధ, జ్యేష్ఠ,ధని,శత,కృత్తి | మృగ,ఆశ్రే,ఉత్త,విశా,మూల, శ్రవ,పూ.భాద్ర,భరణి | ఆరు,పుష్య,హస్త,స్వాతి,పూ.షాఢ అభిజిత్,ఉ.భాద్ర,అశ్విని | పునర్వ,చిత్త ఉ.షాఢ,రేవతి |
| మృగశిర | జూన్ 7 - 20 | మృగ,పుబ్బ,ఉత్తర,జ్యేష్ఠ, మూల,శత,పూ.భాద్ర,రోహి | ఆరు,మఖ,హస్త,అనూ,పూ.షాఢ ధని,ఉ.భాద్ర,కృత్తిక | పునర్వ,చిత్త,విశా,ఉ.షాఢ, శ్రవ,రేవతి,భర | పుష్య,స్వాతి అభిజిత్,అశ్వి |
| ఆరుద్ర | జూన్ 21 - జూలై 3 | ఆరు,ఉత్త,హస్త,మూల,పూ.షాఢ పూ.భాద్ర,ఉ.భాద్ర,మృగ | పునర్వ,పుబ్బ,చిత్త,జ్యేష్ఠ ఉ.షాఢ,శతబి,రేవతి,రోహిణి | పుష్య,మఖ,స్వాతి,అనూరాధ అభిజిత్,ధని,అశ్వి,కృత్తి | ఆశ్రే,విశా శ్రవ,భరణి |
| పునర్వసు | జూలై 4 - 17 | పున,హస్త,చిత్త,పూ.షాఢ ఉ.షాఢ,ఉ.భాద్ర,రేవతి,ఆరుద్ర | పుష్య,ఉత్త,స్వాతి,మూల,అభిజిత్ పూ.భాద్ర,అశ్వి,మృగ | ఆశ్రే,పుబ్బ,విశా,జ్యేష్ఠ,శ్రవ శతభి,భర,రోహిణి | మఖ,అనూరాధ, ధనిష్ఠ,కృత్తిక |
| పుష్యమి | జూలై 18 - 31 | పుష్య,చిత్త,స్వాతి,ఉ.షాఢ,అభిజిత్ రేవ,అశ్వి,పునర్వ | ఆశ్రే,హస్త,విశా,పూ.షాఢ శ్రవ,ఉ.భాద్ర,భర,ఆరు | మఖ,ఉత్త,అనూరాధ,మూల, ధని,పూ.భాద్ర,కృత్తి,మృగ | పుబ్బ,జ్యేష్ఠ శతభి,రోహిణి |

| గృహము నందు ఎవరైనా మరణించినచో కలుగు దోషము మరియు దోషకాలమును సూచించు నక్షత్రముల పట్టిక - చంద్రుదున్న నక్షత్రము | | | | | |
|---|---|---|---|---|---|
| సూర్యుదున్న నక్షత్రం | నుండి - వరకు | దోషము లేని నక్షత్రాలు | 15 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు | 30 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు | 45 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు |
| ఆశ్రేష | ఆగష్టు 1 - 13 | ఆశ్రే,స్వాతి,విశా,అభి, శ్రవ,అశ్వి,భర,పుష్య | మఖ,చిత్త,అనూరాధ,ఉ.షాఢ ధని,రేవతి,కృత్తి,సునర్వ | పుబ్బ,హస్త,జ్యేష్ఠ,పూ.షాఢ శత,ఉ.భాద్ర,రోహిణి,ఆరుద్ర | ఉత్త,మూల పూ.భాద్ర,మృగ |
| మఖ | ఆగష్టు 14 - 27 | మఖ,విశా,అనూరాద,శ్రవ,ధని భర,కృత్తి,అశ్రేష | పుబ్బ,స్వాతి,జ్యేష్ఠ,అభి,అశ్వి శతభి,రోహి,పుష్య | ఉత్త,చిత్త,మూల,ఉ.షాఢ పూ.భాద్ర,రేవతి,మృగ,పునర్వ | హస్త,పూ.షాఢ ఉ.భాద్ర,ఆరుద్ర |
| పుబ్బ | ఆగ 28 - సెప్టె 9 | పుబ్బ,అనూరా,జ్యేష్ఠ,ధని శతభి,కృత్తి,రోహిణి,మఖ | ఉత్త,విశా,మూల,శ్రవ, పూ.భాద్ర,భర,మృగ,ఆశ్రే | హస్త,స్వాతి,పూ.షాఢ,అభి ఉ.భాద్ర,అశ్వి,ఆరుద్ర,పుష్య | చిత్త,ఉ.షాఢ రేవతి,పునర్వ |
| ఉత్తర | సెప్టె 10 - 23 | ఉత్త,జ్యేష్ఠ,మూల,శతభి,పూ.భాద్ర, రోహిణి,మృగ,పుబ్బ | హస్త,అనూరా,పూ.షాఢ ధని,ఉ.భాద్ర,కృత్తి,ఆరుద్ర,మఖ | చిత్త,విశా,ఉ.షాఢ,శ్రవ రేవ,భర,పునర్వ,ఆశ్రే | స్వాతి,అభిజి, అశ్వి,పుష్యమి |
| హస్త | సెప్టె 24 - అక్టో 6 | హస్త,మూల,పూ.షాఢ,పూ.భాద్ర ఉ.భాద్ర,మృగ,ఆరు,ఉత్త | చిత్త,జ్యేష్ఠ,ఉ.షాఢ,శతబి,రేవ రోహిణి,పునర్వ,పుబ్బ | స్వాతి,అశిజి,లనూరాధ,ధని అశ్వి,పుష్య,మఖ | విశా,శ్రవ, భర,ఆశ్రే |
| చిత్త | అక్టో 7 - 20 | చిత్త,పూ.షాఢ,ఉ.షాఢ,ఉ.భాద్ర రేవ,ఆరు,పునర్వ,హస్త | స్వాతి,మూల,అభిజి,పూ.భాద్ర అశ్వి,మృగ,పుష్య,ఉత్త | విశా,జ్యేష్ఠ,శ్రవ,శతభి,భర రోహి,ఆశ్రే,పుబ్బ | అనూరా,ధని కృత్తి,మఖ |
| స్వాతి | అక్టో 21 - నవ 2 | స్వాతి,ఉ.షాఢ,అభిజి,రేవ,అశ్వి పునర్వ,పుష్య,చిత్త | విశా,పూ.షాఢ,శ్రవ,ఉ.భాద్ర భర,ఆరుద్ర,ఆశ్రే,హస్త | అనూరా,మూల,ధని,పూ.భాద్ర కృత్తి,మృగ,మఖ,ఉత్తర | జ్యేష్ఠ,శత,రోహి పుబ్బ |
| విశాఖ | నవ 3 - 16 | విశా,అభిజి,శ్రవ,అశ్వి,భర పుష్య,ఆశ్రే,స్వాతి | అనూరా,ఉ.షాఢ,ధని,రేవ,కృత్తి పునర్వ,మఖ,చిత్త | జ్యేష్ఠ,పూ.షాఢ,శతభి,ఉ.భాద్ర రోహి,ఆరుద్ర,పుబ్బ,హస్త | మూల,పూ.భాద్ర మృగ,ఉత్తర |

| గృహము నందు ఎవరైనా మరణించినచో కలుగు దోషము మరియు దోషకాలమును సూచించు నక్షత్రముల పట్టిక - చంద్రుడున్న నక్షత్రము | | | | | |
|---|---|---|---|---|---|
| సూర్యుడున్న నక్షత్రం | నుండి - వరకు | దోషము లేని నక్షత్రాలు | 15 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు | 30 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు | 45 రో॥ల దోషములిచ్చు నక్షత్రాలు |
| అనూరాధ | నవ 17 - 29 | అనూరా,శ్రవ,ధని,భర, కృత్తి,ఆశ్రే,మఖ,విశా | జ్యేష్ఠ,అభి,శతభి,అశ్వి,రోహి పుష్య,పుబ్బ,స్వాతి | మూల,ఉ.షాఢ,పూ.భాద్ర,రేవ మృగ,పునర్వ,ఉత్త,చిత్త | పూ.షాఢ,ఉ.భాద్ర ఆరుద్ర,హస్త |
| జ్యేష్ఠ | నవ 30 - డిశె 13 | జ్యేష్ఠ,ధని,శత,కృత్తి,రోహి మఖ,పుబ్బ,అనూరా | మూల,శ్రవ,పూ.భాద్ర,భర మృగ,ఆశ్రే,ఉత్త,విశా | పూ.షాఢ,అభి,ఉ.భాద్ర,అశ్వి, ఆరు,పుష్య,హస్త,స్వాతి | ఉ.షాఢ,రేవ పునర్వ,చిత్త |
| మూల | డిశె 14 - 26 | మూల,శత,పూ.భాద్ర,రోహి మృగ,పుబ్బ,ఉత్త,జ్యేష్ఠ | పూ.షాఢ,ధని,ఉ.భాద్ర,కృత్తి ఆరుద్ర,మఖ,హస్త,అనూరాధ | ,ఉ.షాఢ,శ్రవ,రేవ,భర,పునర్వ ఆశ్రే,చిత్త,విశా | అభిజి,అశ్వి పుష్య,స్వాతి |
| పూర్వాషాఢ | డిశె 27 - జన 5 | పూ.షాఢ,పూ.భాద్ర,ఉ.భాద్ర, మృగ,ఆరుద్ర,ఉత్త,హస్త,మూల | ఉ.సాఢ,శత,రేవ,రోహి,పునర్వ పుబ్బ,చిత్త,జ్యేష్ఠ | అభి,ధని,అశ్వి,కృత్తి,పుష్య మఖ,స్వాతి,అనూరా | శ్రవ,భర ఆశ్రే,విశా |
| ఉత్తరాషాఢ | జన 6 - 22 | ఉ.షాఢ,ఉ.భాద్ర,రేవ,ఆరుద్ర పునర్వ,హస్త,చిత్త,పూ.షాఢ | అభిజి,పూ.భాద్ర,అశ్వి,మృగ, పుష్య,ఉత్త,స్వాతి,మూల, | శ్రవ,శత,భర,రోహి,ఆశ్రే,పుబ్బ విశా,జ్యేష్ఠ | ధని,కృత్తి మఖ,అనూరా |
| అభిజిత్ | -------- | అభిజి,రేవ,అశ్వి,పునర్వ,పుష్య చిత్త,స్వాతి,ఉ.షాఢ | శ్రవ,ఉ.భాద్ర,భర,ఆరుద్ర, ఆశ్రే,హస్త,విశా,పూ.షాఢ | ధని,పూ.భాద్ర,కృత్తి,మృగ,మఖ ఉత్త,అనూరా,మూల | శత,రోహి పుబ్బ,జ్యేష్ఠ |
| శ్రవణం | జన 23 - ఫిబ్ర 5 | శ్రవ,అశ్వి,భర,పుష్య,ఆశ్రే స్వాతి,విశా,అభిజి | ధని,రేవ,కృత్తి,పున్వ,మఖ,చిత్త అనూరా,ఉ.షాఢ | శతభి,ఉ.భాద్ర,రోహి,ఆరుద్ర పుబ్బ,హస్త,జ్యేష్ఠ,పూ.షాఢ | పూరాభాద్ర,మృగ ఉత్త,మూల |
| ధనిష్ఠ | పిబ్ర 6 - 18 | ధని,భర,కృత్తి,ఆశ్రే,మఖ,విశా, అనూరాధ,శ్రవ | శతబి,అశ్వి,రోహి,పుష్య,పుబ్బ స్వాతి,జ్యేష్ఠ,అభిజి | పూ.భాద్ర,రేవ,మృగ,పునర్వ, ఉత్త,చిత్త,మూల,ఉ.షాఢ | ఉ.భాద్ర,ఆరుద్ర హస్త,పూ.షాఢ |

